# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2006 65 రు. 10

* ఫోకస్ : ప్రత్యేక ఆర్థిక మండలాలు
  నాలుగు వ్యాసాలు
* అఫ్జల్ గురు మరణ శిక్ష - న్యాయాన్యాయాలు
* చేనేత సంక్షోభం - జౌళి విధానాలు
* చెంచుల జీవనసరళి
* తెలంగాణ చరిత్రంతా ప్రజాపోరాటాల చరిత్రే
* శాసన మండలి - ఉపాధ్యాయ సంఘాలు

# 'వీక్షణం' విస్తరణకు సహకరించండి !

తెలుగు నాట సామాజిక విశ్లేషణా వికాసానికి మీ తోడ్పాటు నందించండి !!

నాలుగు సంవత్సరాలుగా సామాజిక, ఆర్థిక రాజకీయ సమాచార సమర్పణలో, విశ్లేషణలో సాగిస్తున్న అప్రతిహతమైన, అసాధారణమైన కృషి వల్ల సామాజిక ఆర్థిక మాసపత్రి 'వీక్షణం' పాఠకుల ఆదరాభిమానాలను అపారంగా చూరగొంటున్నది. వేలాది మంది పాఠకులను సంపాదించుకున్నది. తెలుగు సీమలో పేరున్న రచయితలు, సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషకులు అందరూ 'వీక్షణం' కు తమ రచనలు అందజేస్తున్నారు. వందలాది మంది అభిమానులు 'వీక్షణం' కు తమ సహాయ సహకారాలు అందించడానికి ముందుకు వస్తున్నారు. నాలుగు సంవత్సరాల వ్యవధిలో, అరవై సంచికలతో సాధించిన ఈ విజయాలు గణనీయమైనవే గాని తెలుగు సామాజిక అవసరాలతో పోల్చినప్పుడు చేయవలసింది ఇంకా ఎంతో ఉంది. తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి ప్రామాణిక రాజకీయార్థిక విశ్లేషణా వేదికను నిర్మించాలనే మా కోరిక నెరవేరడానికి సాధించవలసింది ఎంతో ఉంది. అయితే ఇది మా ఒక్కరి కృషి వల్ల సాధ్యం కాదు. 'వీక్షణం' తెలుగు సమాజం తనగురించి తాను చేసుకునే అన్వేషణ. అందువల్ల 'వీక్షణం' విస్తరణ తెలుగు సమాజంలోని ఆలోచనా పరులందరి ఉమ్మడి బాధ్యత. రండి, ఈ కర్తవ్య నిర్వహణలో మీ వంతు భాగం పంచుకోండి.

★ 'వీక్షణం' చందాదారులుగా చేరండి !

★ మీరు చందాదారులయితే కనీసం మరొకరిని చందాదారుగా చేర్చండి !

★ మీ ఊళ్లో 'వీక్షణం' విడి కాపీల అమ్మకం కొరకు ఏజెన్సీని ఏర్పాటు చేయండి !

★ 'వీక్షణం' కు రచనలు పంపించండి !

★ 'వీక్షణం' కు వ్యాపార ప్రకటనలు సమకూర్చండి !

విడి ప్రతి: రు. 10, సంవత్సర చందా రు. 120, మూడు సంవత్సరాల చందా రు. 350,
ఐదు సంవత్సరాల చందా రు. 550, పది సంవత్సరాల చందా రు. 1000

ఎం.ఓ. / డి.డి. పంపవలసిన చిరునామా


## వీక్షణం

ఆర్థిక, సామాజిక మాస పత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029,
ఫోన్ / ఫాక్స్ : 040-66843495

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ





వార్షిక చందా: రు.120 విడి ప్రతి : రు. 10

**65** డిసెంబర్ 2006


*సంపాదకీయం*

## ఎవరికి ఎవరు మార్గదర్శి?

**మా**ర్గదర్శి ఫైనాన్షియర్స్ అనే ఒకానొక ప్రైవేట్ సంస్థ (అది సంస్థగా చట్టబద్ధంగా నమోదు కాలేదనేది వేరే కథ) ప్రజలనుంచి వందలకోట్ల డిపాజిట్లు సేకరించిందని, అందులో సగం నష్టపోయానని ఆదాయపు పన్ను శాఖకు తెలిపిందని వచ్చిన వార్తలు రాష్ట్రంలో పెద్ద దుమారాన్ని సృష్టించాయి. ఆ గాలి దుమారపు ఫలితాలు, ప్రతిస్పందనలు ఇంకా వెలువడుతూనే ఉన్నాయి. ఆ సంస్థ చేసిన చట్టపరమైన ఉల్లంఘనలనే మరొకరెవరయినా చేసి ఉంటే ఈ పాటికి ఏమయి ఉండేదో అందరికీ తెలుసు. ఆ సంస్థ ఒక భారీ ప్రచార సాధనాలయంత్రాంగంలో భాగం గనుక, ఆ సంస్థ గురించి వ్యతిరేకంగా మాట్లాడితే తమ ప్రచారానికి ఎక్కడ లోటు వాటిల్లుతుందోననే భయంతో దాదాపు అని రాజకీయ పార్టీలు ఆ సంస్థను కాపాడడానికి పరుగెత్తుకొచ్చాయి. ఆ సంస్థ చట్టాన్ని ఉల్లఘించి ప్రజల డబ్బును కైంకర్యంచేసిందని ఆరోపణలు చేసినవారు దురాలోచనలతోనే, కుట్రపూరితంగానే, కక్ష సాధింపు ధోరణితోనే ఆ ఆరోపణలు చేసి ఉండవచ్చు. అందుకు వారిని తప్పు పట్టినా ఫరవాలేదు. కాని ఆ తప్పు మరొక తప్పును ఒప్పుగా మార్చజాలదు. మార్గదర్శి ఫైనాన్షియర్స్ అనే సంస్థ లేనేలేదు. అది ఒక హిందూ అవిభక్త కుటుంబంగా ఉంది. అలా ఉన్నప్పుడు దానికి కుటుంబ సభ్యుల నుంచి తప్ప మరొకరి నుంచి డిపాజిట్లు సేకరించే హక్కు లేదు. అది మొదటి చట్ట ఉల్లంఘన కాగా, అలా సేకరించిన డబ్బును సొంత సంస్థల ఆస్తులు కూడబెట్టుకోవడం కొరకు వినియోగించడం నైతిక అపరాధం. ఆ పెట్టుబడులను మార్గదర్శి ఫైనాన్షియర్స్ ఆదాయవ్యయ పట్టికలలో చూపెట్టి ఉంటే ఆ అపరాధాన్నయినా క్షమించవచ్చు. ఆ పని కూడ జరగలేదు. పోనీ, ఆ ఇతర సంస్థలయినా లాభాలు సంపాదిస్తున్నాయా, ఇవాళ కాకపోతే రేపయినా ఈ లోటు భర్తీ అవుతుందా అంటే ఆ హామీ కూడ లేదు. డిపాజిట్లు పెట్టినవారందరూ ఒకే రోజు చెల్లింపులకోసం రారుగదా, వారు వచ్చినప్పుడు ఇస్తాము గదా అనే వాదన వినడానికి బాగానే ఉంటుంది గాని ద్రవ్య వ్యవహారాలలో అంగీకరించే వాదన కాదు. ఇన్ని అభ్యంతరకరమైన పనులు చేసి, వాటన్నిటినీ పత్రికా స్వాతంత్ర్యం ముసుగు కింద కాపాడుకోజూడడం మరింత అవినీతికర ప్రవర్తన. ఎన్నో అపసవ్యవాదనలు ఉన్నచోట, రాగల విమర్శాబాణాలన్నిటినీ కేవలం పత్రికల, ఛానెళ్ల డాలుతో ఆ సంస్థాధిపతి ఎదుర్కొన్నారు. అన్ని రాజకీయ పక్షాలూ ఆయనకు అదనంగా మరికొన్ని డాళ్లను అందించాయి. ఇప్పటికి ఆ సంస్థ దుమారం నుంచి బయటపడి ఉండవచ్చు. రాజకీయ పక్షాలకు పబ్బం గడిచి ఉండవచ్చు. కాని ఈ సమాజంలో చట్ట విధేయత, నైతిక ప్రవర్తన, సూత్రబద్ధ సమర్థన లాంటి విలువలకు ఏమి జరుగుతుందనేది అసలు ప్రశ్న. 

## లోపలి పేజీల్లో...



### ప్రత్యేక ఆర్థిక మండలాలు (ఎస్ఇజెడ్)

తీవ్ర విమర్శలు, రాజ్యాంగ వివాదాల మధ్య స్పెషల్ ఎకనామిక్ జోన్‌ల ఆవిర్భావం జరుగుతున్నది. ముమ్మరమయిన అభివృద్ధికి వేలకోట్ల రూపాయల పెట్టుబడులకు ఎస్ఇజడ్‌లు వేదికలు కాబోతున్నాయి. విదేశీ పెట్టుబడులు, ప్రపంచీకరణ, ఉదార ఆర్థిక విధానాలు, శాసనాల పట్టు సడలింపులతో సహా అనేకానేక మినహాయింపులతో ప్రత్యేక సదుపాయాలతో, ఎస్ఇజడ్‌లు ఈ దేశ స్వరూపాన్ని మార్చబోతున్నాయి. అది మంచికేనా? ఎవరి మంచికోసం? ఈ దేశం సుస్థిర ప్రగతికి ఎస్ఇజడ్‌లు పునాదులా? కాదా? అనే ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వివాదాలు చెలరేగుతున్నాయి.



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు.
'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష సామాజిక, ఆర్థిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో
అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040 - 66843495
ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్, అజామాబాద్, హైదరాబాద్.

సహాయ సంపాదకులు : డి.వి.రామకృష్ణారావు
సర్క్యులేషన్ మేనేజర్ : వై.రామచంద్రం
9949391028
కంపోజింగ్ & లే ఔట్ : సి. రాజశేఖర్

ఇ.పి.డబ్ల్యు. కంటే 'వీక్షణం' సరళంగా వుందన్న ఒక ఢిల్లీ పాఠకుని అభిప్రాయాలతో ఏకీభవిస్తూనే పేజీలకు పేజీలు పట్టికలు, గణాంకాలు, గ్రాఫులు, కొన్ని సందర్భాలలో కంపెనీల ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లు, పుస్తకాలు మొదలయినవి భరిస్తూ కూడా నేను ఇ.పి.డబ్ల్యు.ను మిస్సవను. ఒక్క సంచిక కూడా. అన్ని పేజీలు చదవగలుగుతానని కాదు, అయితే వ్యాసాల్ని, చర్చలను, ఉత్తరాలతో సహా చూస్తాను. ఇవ్వాళ తెలుగులో 'వీక్షణం'తో పాటు నాకు చర్చ, అరుణతార, ప్రజాస్వేచ్ఛ మొదలయినవి కూడా బాగా ఉంటున్నాయి. అన్నట్లు మహిళా మార్గం, కుల నిర్మూలన కూడా..

తెలంగాణ విడిపోవడం అనివార్యమని, అవసరమని భావిస్తున్న మేధావుల్ని, కొందరు మధ్యతరగతి పాఠకుల్నీ అర్థం చేసుకోగలను. కానీ, అంతే సమానంగా బాధపడతాను. బహుశా మధ్యతరగతి బుద్ధిజీవిగా ఇది నా బలహీనత కావచ్చు. కాగా నాకు హైదరాబాద్ మీద చెప్పుకోదగిన ప్రేమలేదు. అదనేకాదు నాకు విశాఖపట్నం అన్నా అంతే. నేను పెద్ద నగరాల్లో, మెట్రోపాలిటన్ సిటీల్లో బతకలేను. చిన్న టౌన్‌లను, పాక్షిక పట్టణీకరణ చెందిన ఊళ్లను ఇష్టపడతాను.

యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ అభిప్రాయాల్లో కొన్ని నాకు మింగుడు పడలేదు. ఓల్గా, వరవరరావులవి నచ్చాయి. ఎబికె బొత్తిగా కాంగ్రెస్ భజనతో ప్రారంభించి పాలక వర్గ ఆశల్తో ముగించారు. చిల్లం–సైబరాబాద్ చరిత్ర వ్యాసం బాగా నచ్చింది.

**– మానేపల్లి**
ఎలమంచిలి

## పాఠకుల వీక్షణం

భోపాల్ విషవాయు విషాదం గురించిన డొమినిక్ లాపెయిర్, జెనియర్ మోరోల పుస్తకాన్ని నేను అనువదించిన 'ఆ రోజు రాత్రి ఏం జరిగిందంటే...' (భోపాల్ విషవాయు విషాదం) శ్రమజీవి ప్రచురణగా ఆగస్టు ఆఖరు వారంలో వెలువడింది. ఈ పుస్తకం వల్ల వచ్చిన మిగులు సొమ్మును భోపాల్‌లో బాధితులకు సేవలందిస్తున్న సంభావనా క్లినిక్ ను నిర్వహిస్తున్న 'సంభావనా ట్రస్టు' వారికి పంపదలచుకున్నాం. మూల రచయితలు కూడా మొత్తం రాయల్టీలను సదరు ట్రస్టుకే అందజేస్తున్నారు. అసలు వాళ్లు రాయడానికి కారణం దాని ప్రధాన సంచాలకుడు, ట్రస్టు బోర్డు డైరెక్టర్ సతీనాథ్ సారంగీ విరాళాలను అడిగినందుకే. డొమినిక్ లాపియర్ నాకు ప్రత్యేకంగా రికార్డు చేసి పంపిన విడియో సందేశంలో ఇది ప్రతీ భారతీయుడూ తాను చదివి ఇతరులచేత చదివించి మరిన్ని భోపాల్ తరహా దుర్ఘటనలు పునరావృతం కాకుండా చూడాలని కోరాడు. ఈ పుస్తకాన్ని మీరు తప్పకుండా చదివి, ఇతరులచేత కూడా కొని చదివించి, తద్వారా మరికొందరిని చైతన్య పరచి కార్యాచరణ దిశగా ప్రోత్సహించగలరని నమ్ముతున్నాను. పుస్తకం గురించి మీరు తగినంత ప్రచారం ఇస్తే బాగుంటుంది. ఇది నా అభ్యర్థన. పుస్తకంవెల రు. 100. ఈ పుస్తకం హైదరాబాద్ నవోదయ బుక్ హౌస్, కాచిగూడ క్రాస్ రోడ్స్, దిశా పుస్తక కేంద్రంలోనూ దొరుకుతుంది.

**– కస్తూరి**
రావులపాలెం

గుంటూరు జిల్లా, పొన్నూరు లోని అంబేడ్కర్ కాలనీలో లుంబినీవనం స్థాపించి 'అంబేడ్కర్ రిసెర్చ్ సెంటర్' 'తెలుగు భాషా పరిశోధనా కేంద్రం' రూపొందించాం. ఇప్పటికి పదిహేను పుస్తకాలు ఉన్నాయి. ఎందరో పరిశోధకులు యూనివర్సిటీలు నుండి వచ్చి పుస్తకాలు ఉపయుక్తం చేసుకొంటున్నారు. మీ దగ్గర చరిత్ర, సంస్కృతి, ఆర్థిక శాస్త్రం, రాజకీయ శాస్త్రం, సాహిత్యం, కవిత్వం, కవితా విమర్శ, సైన్స్, టెక్నాలజీలకు సంబంధించిన ఏ పుస్తకాలు ఉన్నా మేము ఇక్కడ వాటిని వరుస క్రమంలో పెట్టి పరిశోధకులకు ఉపకరించేటట్లు చేస్తాం. తప్పక మీ దగ్గర ఉన్న గ్రంథాలను పార్సిల్ ద్వారా గాని, కొరియర్ ద్వారా గాని పంపగలరని ఆశిస్తున్నాము. ఈ గ్రంథాలయోద్యమానికి చేయూత నివ్వగలరు. పంపవలసిన అడ్రస్సు : కత్తి పద్మారావు, అంబేడ్కర్ రిసెర్చ్ సెంటర్, ఫౌండర్ & డైరెక్టర్, లుంబినీవనం, అంబేడ్కర్ కాలనీ, పొన్నూరు – 522 124, గుంటూరు జిల్లా.

**– డైరెక్టర్**
అంబేడ్కర్ రిసెర్చ్ సెంటర్
పొన్నూరు

మరోసారి బ్రద్దలయ్యేందుకు సిద్ధంగా ఉన్న తెలంగాణ అగ్నిపర్వతం పై కూర్చొని వి. హనుమంతరావు గారు రాసిన 'ప్రజలు పాల్గొనని ప్రత్యేక తెలంగాణ ఉద్యమం' అనే వ్యాసం చదివి ఈ నాలుగు మాటలు రాస్తున్నాను. మూడు దశాబ్దాల పైబడి సీనియర్ జర్నలిస్టుగా పనిచేసిన హనుమంతరావు గారు ఒక న్యాయమైన ప్రజా పోరాటంపై ఇంతటి అన్యాయమైన సూత్రీకరణ చేయటం బాధ కలిగించింది. తెలంగాణ అనగానే ఇవ్వాళ సమైక్యవాదులకు కెసిఆర్, టిఆర్ఎస్ మాత్రమే కనపడుతున్నారు. గత రెండున్నరేళ్లుగా కెసిఆర్, టిఆర్ఎస్ చేసిన తప్పులను (అందులో కొన్ని తప్పులు కూడా కాకపోవచ్చు) ఎత్తిచూపడం తద్వారా తెలంగాణ ఉద్యమం బలహీనపడిందని చంకలు గుద్దుకోవడం గత కొంతకాలంగా సమైక్యవాదులు విసుగూ విరామం లేకుండా చేస్తున్నపనే. ఇప్పుడు హనుమంతరావు గారు కూడా అదే బాట పట్టారు. అయితే ఇక్కడ అర్థం చేసుకోవలసిన విషయం ఒకటి ఉంది. కెసిఆర్ వంద తప్పులు చేసి ఉండవచ్చు గాక కానీ ఇవ్వాళ తెలంగాణ ఉద్యమ రథసారథిగా అతడిని తెలంగాణ ప్రజలు ఆదరిస్తూనే ఉంటారు. తెలంగాణ జెండా పట్టుకొంటే బారా ఖూన్ మాఫ్ అనే స్థితికి ఇవ్వాళ ప్రజలు వచ్చారంటేనే ప్రత్యేక రాష్ట్ర నినాదం వారి గుండెల్లో ఎంత బలంగా నాటుకుందో అర్థం చేసుకోవచ్చు. గత రెండున్నరేళ్లలో టిఆర్ఎస్ నేతలపై జరిగిన దుష్ప్రచారం (అబద్ధాలు, అర్ధ సత్యాలతో అల్లిన విషపూరిత దుష్ప్రచారం) మరే పార్టీ పైనైనా జరిగుంటే ఈ పాటికి సదరు పార్టీ సోదిలోకి లేకుండా పోయేది. అంతెందుకు ఆంధ్రజ్యోతి లాంటి పత్రికలు 'దగాపడ్డ తెలంగాణ' అంటూ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ముగిసినట్టేనని ఆర్నెల్ల కిందటే అబిచువరీలు రాసేశాయి. ఇప్పుడు ఏమయ్యింది? రాజీనామా అనంతరం కెసిఆర్‌కు తెలంగాణ జిల్లాల్లో ప్రజలు బ్రహ్మరథం పట్టారు. తప్పు చేసిన కానీ తప్పుడు పని జేయలేదు అని ఈ తెలంగాణ నేత లెంపలు వేసుకోగానే మళ్లీ భుజానికెత్తుకున్నారు. అవాకులు చెవాకులు పేలుతున్న ఇతర పార్టీల నాయకుల నోళ్లు మూయించడానికి రాజీనామా చేసి సవాల్ విసిరిన కెసిఆర్‌ను తెలంగాణ ప్రజలు తప్పక ఆశీర్వదిస్తారు. మొన్నటికి మొన్న నల్గొండ జిల్లా ఆలగడపలో జరిగిన ప్లెబిసైట్ ప్రజాభిప్రాయ సేకరణలో ఓటువేసిన 1089 మందిలో 1048 మంది తెలంగాణ కావాలనే కోరుకున్నారు. ఈ ప్రజాభిప్రాయ సేకరణ టిఆర్ఎస్ కానీ, తెలంగాణ మేధావులు కానీ జరిపింది కాదు. ఇది చూశాక హనుమంతరావు గారు నిజం ఏమిటో గ్రహిస్తారనుకుంటాను. తెలంగాణ ప్రజల దురదృష్టం ఏమిటంటే వారు అనేకసార్లు నాయకులను నమ్మి మోసపోయారు. బహుశా అందుకే వారు టిఆర్ఎస్‌కు సంపూర్ణంగా మద్దత్తివ్వకపోవచ్చు. కానీ ప్రతీ తెలంగాణ పౌరుడు ఇవ్వాళ ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరుకుంటున్నాడు.

స్వాతంత్ర్యోద్యమం ఎందుకు జరిగిందో నేను ఇవ్వాళ హనుమంతరావుగారికి కొత్తగా చెప్పవలసిన అవసరం లేదు. ఒకవేళ అభివృద్ధే కావాలనుకుంటే బ్రిటీష్ కాలనీగానే మనం ఎక్కువ అభివృద్ధి చెందే అవకాశం ఉండేదేమో. ఇవ్వాళ జరుగుతున్నది కూడా తెలంగాణ స్వాతంత్రోద్యమం. దీన్ని ఎదుర్కోవడానికి సమైక్యవాదులు 'అభివృద్ధి' నినాదం ముందుకు తెస్తున్నారు. కానీ ఒక్క విషయం అర్థం చేసుకోండి, తెలంగాణ ఉద్యమం ఉధృతంగా జరుగుతున్న రోజుల్లోనే 'గోదావరి నీళ్లు డెల్టాకు, కృష్ణా నీళ్లు రాయలసీమకు' అని ముఖ్యమంత్రి ధైర్యంగా అనగలిగాడంటే, ఓ పక్క నీళ్లు లేక మహబూబ్‌నగర్ నుండి వరంగల్ వరకూ, ఇంకోపక్క ఆదిలాబాద్ నుండి

*(మిగతా 46వ పేజీలో...)*

# కొత్తపుస్తకాలు










- **సమీర్ అమీన్ జీవితం - సైద్ధాంతిక కృషి** - డేవిడ్ రెన్‌టన్ - అనువాదం : డా॥ మానేపల్లి - లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 24 పేజీలు, 1/8 డెమీ, రు. 7. ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు - 522 002.
- **రాయలసీమ పూర్వాపరాలు కృష్ణాజలాలపై సీమహక్కులు** - కె. రామిరెడ్డి, ఐ.ఏ.ఎస్. (రిటైర్డ్), 70 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 1.
- **గవాయి** - సైబాబ 'జగనే కీ రాత్' చర్చ - సం. జిలుకర శ్రీనివాస, దళిత్-ముస్లిం పబ్లికేషన్స్ ప్రచురణ, 92 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : జిలుకర శ్రీనివాస్, 210, సుదర్శన్‌నగర్, హెచ్.సి.యు. బస్ స్టాప్ ఎదురుగా, శేరిలింగంపల్లి, హైదరాబాద్.
- **ది లిటల్ క్లే కార్ట్** - శూద్రకుని మృచ్ఛకటికం ఇంగ్లిషు అనువాదం - విద్వాన్ తెన్నేటి, ప్రజాహిత ప్రచురణలు, 129 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : ప్రజాహిత ప్రచురణలు, ఇ.నెం. 1-7-454, రెవెన్యూ కాలనీ, సుబేదారి, హనుమకొండ, వరంగల్, నీల్‌కమల్ పబ్లికేషన్స్, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.
- **మట్టి బంధం** - అనిశెట్టి రజిత కథలు - ప్రజాహిత ప్రచురణలు, 96 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : ప్రజాహిత ప్రచురణలు, ఇ.నెం. 1-7-454, రెవెన్యూ కాలనీ, సుబేదారీ, హనుమకొండ, వరంగల్.
- **మార్చి 8 చరిత్రావలోకనం** - మహిళా మార్గం ప్రచురణ - 58 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : బి. జ్యోతి, ఎడిటర్, మహిళా మార్గం, 3-6-779/6, వీధి నెం. 14, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 29, దిశ పుస్తక కేంద్రం, నవోదయ బుక్ హౌస్.
- **షహీద్-యే-ఆజమ్ - అష్ఫాఖుల్లా ఖాన్** - సయ్యద్ నశీర్ అహమ్మద్ - తెలుగు ఇస్మాతీక్ పబ్లికేషన్స్ ప్రచురణ - 72 పేజీలు - 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, సందేశ భవనం, లక్కడకోట్, చత్తాబజార్, హైదరాబాద్ - 2.
- **మైసూరు పులి - టిప్పూ సుల్తాన్** - సయ్యద్ నశీర్ అహమ్మద్ - తెలుగు ఇస్మాతీక్ పబ్లికేషన్స్ ప్రచురణ - 68 పేజీలు - 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, సందేశ భవనం, లక్కడకోట్, చత్తాబజార్, హైదరాబాద్ - 2.
- **కామ్రెడ్ పి. పురుషోత్తమ రాజు** - రచనలు మొదటి భాగం - కామ్రెడ్ పి. పురుషోత్తమ రాజు మెమోరియల్ ట్రస్ట్ ప్రచురణ - 294 పేజీలు - 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : సి.ఎచ్. వెంకటేశ్వర్లు, సెక్రటరి, కా. పి.పి. రాజు మెమోరియల్ ట్రస్ట్, 402, కీర్తి టవర్స్, 5/2, చంద్రమౌళినగర్, గుంటూరు. మైత్రి బుక్ హౌస్, దిశా పుస్తక కేంద్రం, సహచర బుక్ మార్క్, మణి బుక్ స్టాల్.
- **ఆ రోజు రాత్రి ఏం జరిగిందంటే** - (భోపాల్ నగరంలో విషవాయు విషాదం) - డొమినిక్ లాపెయిర్, జెవియర్ మోరో - తెలుగు అనువాదం : కస్తూరి - శ్రమజీవి ప్రచురణలు - 250 పేజీలు - 1/8 డెమీ - రు. 100, ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, విజయవాడ.









# ఎవరికి సంకేతాలు పంపడానికి అఫ్జల్‌ను ఉరితీయాలి?

**– కె. బాలగోపాల్**

ఇష్టమొచ్చిన పని చేసేసి, 'ప్రజలు కోరుకుంటున్నారు కాబట్టి చేసాను' అనడం తెలిసిందే. ఈ మధ్య న్యాయస్థానాలు కూడా కఠినమైన శిక్షలు వేసి 'ప్రజలు కోరుకుంటున్నారు' అనడం మొదలుపెట్టాయి. గాయపడ్డ భారత ప్రజల మానసిక ఆవేదనకు ఉపశమనం లభించాలంటే మహమ్మద్ అఫ్జల్‌ను ఉరితీయవలసిందేనని సుప్రీం కోర్టు ప్రకటించి అఫ్జల్‌కు కింది కోర్టు విధించిన మరణశిక్షను ధృవీకరించింది.

ఇది అర్థం లేనివాదన. భారత ప్రజల మనోభావాలు సుప్రీం కోర్టుకు ఎట్లా తెలుసన్న ప్రశ్నను పక్కన పెడదాం. అసలు అఫ్జల్ మీద ఉన్న నేరారోపణ ఏమిటో, దానికి మద్దతుగా ఏపాటి సాక్ష్యాలు పోలీసులు సేకరించారో భారత ప్రజానీకానికి తెలుసా? తెలియనప్పుడు అతనికి ఏం శిక్ష వేయాలన్న చర్చకు 'భారత ప్రజల' మనోభావాలతో ఏం సంబంధం ఉండగలదు? సగటు భారత పౌరులు మహమ్మద్ అఫ్జల్ ప్రత్యక్షంగా పార్లమెంట్‌పైన జరిగిన దాడిలో పాల్గొన్నాడనో, లేదా తానే వెనకుండి కుట్ర పన్ని నడిపించాడనో అనుకుంటుండవచ్చు. ఇది నిజం కాదని సుప్రీం కోర్టుకు అంతే తెలుసును.

13 డిసెంబర్ 2001 నాడు పార్లమెంట్‌పైన జరిగిన దాడిలో పాల్గొన్నవారందరూ అక్కడికక్కడే ఎదురు కాల్పులలో మరణించారు. ఆ తరువాత నేర విచారణ ఎదుర్కొన్న మహమ్మద్ అఫ్జల్, షౌకత్ హుస్సేన్ గురు, ఎస్.ఏ.ఆర్. గిలానీ, అఫ్సాన్‌గురులు దాడి జరిగిన సమయంలో అక్కడ ఉండి పాల్గొన్నారన్నది కాదు పోలీసుల అభియోగం–చనిపోయిన ఐదుగురు, ఈ నలుగురు, పాకిస్తాన్‌లో ఉన్న ఘాజీబాబా, మౌలానా మసూద్ అజర్, అబు జిహాదీ, తారిక్ అహమ్మద్ అనే వాళ్లంతా ఈ నేరానికి కుట్ర చేసారనీ, ఆ కుట్ర ఫలితమే చనిపోయిన ఐదుగురు చేసిన దాడి అనీ అభియోగం. వీరందరూ పాకిస్తాన్ కేంద్రంగా గల జైష్–ఇ–మహమ్మద్ అనే సాయుధ మతవాద సంస్థ సభ్యులనేది పోలీసు కథనం.

పార్లమెంట్‌పైన దాడి జైష్–ఇ–మహమ్మద్ పనేనని ఢిల్లీ పోలీసులు అభియోగ పత్రంలో ఆరోపించడమే కాక, ప్రసార మాధ్యమాలలో విస్తృతంగా ప్రచారం కూడా చేసారు. అయితే కేసు విచారణ సమయంలో దీనికి ఆధారంగా ఏ ఒక్క సాక్ష్యం చూపించలేదు. విశ్వసనీయ సాక్ష్యం కాదు, ఎటువంటి సాక్ష్యమైనా ఆవగింజంత కూడ చూపించలేదు. పాకిస్తాన్‌కు చెందిన జైష్–ఇ–మహమ్మద్ నాయకులు ఘాజీబాబా, మౌలానా మసూద్ అజర్‌లతో నేరవిచారణ ఎదుర్కొన్న నలుగురికీ సంబంధాలు ఉన్నాయన్న సాక్ష్యమేమైనా ప్రవేశపెట్టారా అంటే అదీ లేదు. ఉన్న సాక్ష్యమంతా ఏమిటంటే చనిపోయిన అయిదుగురి వద్దా, మహమ్మద్ అఫ్జల్ వద్ద స్వాధీనం చేసుకున్నట్టు చెప్తున్న సెల్‌ఫోన్‌ల ద్వారా పాకిస్తాన్‌కూ, సౌదీ అరేబియాకు చాలాసార్లు ఫోన్లు చేసినట్టు చూపించే ఆధారాలు. ఆ ఫోన్‌లు ఆదేశాలలో ఎవరికి చేసారన్న ఆధారాలు ఏమీలేవు. పాకిస్తాన్‌లో జైష్–ఇ–మహమ్మద్ కార్యకర్తలే కాక కొన్ని కోట్ల మంది వేరే ప్రజలున్నారు. భారత దేశవాసులకూ వారికీ సంబంధ బాంధవ్యాలున్నాయి. కాబట్టి ఎవరినైనా పట్టుకొని నీ సెల్‌ఫోన్ ద్వారా నువ్వు డజన్ సార్లు పాకిస్తాన్‌లో ఎవరితోనో మాట్లాడావంటే దానితో రుజువయ్యేదేమీ లేదు.

పోనీ దాడి చేసి చనిపోయిన అయిదుగురు జైష్–ఇ–మహమ్మద్ కార్యకర్తలన్న ఆధారాలేవయినా ఉన్నాయా అంటే వారి ఊరూ పేరూ కూడా లేదు. వారి పొడిపేర్లు మాత్రమే తెలుసు. ఒకరి పేరు మహమ్మద్ అంట. ప్రపంచంలో ప్రతీ రెండవ ముస్లిం పురుషుడి పేరూ మహమ్మదే. మరిద్దరు రాజా, రాణా. ఇవి ముస్లింల పేర్లే కానక్కర లేదు. మిగిలిన ఇద్దరు హంజు, హైదర్. ముందు పేరూ వెనక పేరూ ఊరి పేరూ తెలీదు. ఏ సంస్థకు చెందిన వారో తెలీదు. ఏ దేశస్తులో తెలీదు.

కాబట్టి పార్లమెంట్ పైన దాడి జైష్–ఇ–మహమ్మద్ పని అనడానికి ఆవగింజంత సాక్ష్యం కూడ లేదు. విశ్వసనీయమైన సాక్ష్యం కాదు, ఏ సాక్ష్యమూ లేదు.

ఇక మిగిలింది కుట్ర. అఫ్జల్ తదితరులు చనిపోయిన అయిదుగురు అనామకులతో కలిసి పార్లమెంట్ పైన దాడి చేయడానికి కుట్ర చేసారనడానికి ఏం ఆధారాలు చూపించారు? కుట్ర అంటే అర్థం ఉద్దేశ్యం, అంగీకారం అని న్యాయ సిద్ధాంతం అంటుంది. కుట్రదారులందరికీ ఫలానా (నిర్దిష్టమైన) లక్ష్యం సాధించాలన్న ఉద్దేశ్యం ఉండాలి. దాని సాధన కోసం పని చేయాలన్న అంగీకారం ఉండాలి.

అఫ్జల్ తదితరులకు పార్లమెంట్ పైన దాడి జరపాలన్న లక్ష్యం ఉన్నట్టుగానీ, చనిపోయిన అయిదుగురికి అటువంటి లక్ష్యం ఉండిందన్న విషయం తెలిసినట్టు గానీ ఏ సాక్ష్యమూ లేదు. విశ్వసనీయమైన సాక్ష్యం లేదనడం లేదని మళ్లీ చెప్పాలి. అసలు ఏ సాక్ష్యమూ లేదు.

ఉన్న సాక్ష్యమేమిటి? పోలీసులు అఫ్జల్ అద్దెకు తీసుకుని నివసిస్తున్న గది మీద దాడి చేసినప్పుడు అక్కడ పేలుడు పదార్థాలు దొరికాయని సాక్ష్యం ప్రవేశపెట్టారు. పేలుడు పదార్థాలను అనుమతి లేకుండా కలిగి ఉండటం నేరమేగాని, వాటిని పార్లమెంట్‌పైన దాడి చేయడానికి చేసిన కుట్రలో భాగంగా అఫ్జల్ తెచ్చి పెట్టుకున్నాడని నమ్మడానికి ఆధారమేమీ లేదు. దాడిలో చనిపోయిన మహమ్మద్ అని పేరు పెట్టబడ్డ అనామకుడు దాడికి కొద్ది సమయం ముందు తన సెల్‌ఫోన్ ద్వారా అఫ్జల్‌తో సంభాషించాడనీ, అతని దగ్గర దొరికిన ఒక కాగితం మీద అఫ్జల్ సెల్‌ఫోన్ నెంబర్ ఉందనీ, ఆధారాలు చూపించారు. అఫ్జల్ కొందరు వ్యక్తులతో తిరుగుతుండగా చూసామనీ, ఆ వ్యక్తులు పార్లమెంట్ పైన దాడి చేసిన వారని, వారి శవాల ఫోటోలను బట్టి గుర్తుపట్టామనీ కొందరు సాక్షులు చెప్పారు. అయితే ఈ రకమైన ఫోటో గుర్తింపు విశ్వసనీయమైనది కాదని కర్తార్‌సింగ్ కేసులో సుప్రీం కోర్టు ప్రకటించింది. శవం ఫోటో సంగతి పక్కన పెట్టండి, బతికున్నప్పటి ఫోటో ద్వారా మనిషిని గుర్తుపట్టే సాక్ష్యం సహితం విశ్వసనీయం కాదని

సుప్రీం కోర్టు అన్నది. ఫోటో గుర్తింపును సాక్ష్యంగా పరిగణించడాన్ని అనుమతించే 'టాడా' చట్టంలోని సెక్షన్ 22 చెల్లదని సుప్రీం కోర్టు కొట్టేసింది.

పోనీ ఈ సాక్ష్యమంతా నమ్మినా తేలేది ఏమిటంటే పార్లమెంట్ పైన దాడి చేసిన వ్యక్తులతో అఫ్జల్‌కు సంబంధం ఉండింది. వాళ్లతని సహాయం తీసుకున్నారు. అతను వారికి సహాయం చేసాడు. అంత మాత్రం చేత వారి నిర్దిష్ట లక్ష్యం (పార్లమెంట్ పైన దాడి చేసి పార్లమెంట్ సభ్యులను, కేంద్ర మంత్రి వర్గ సభ్యులను హతమార్చాలన్న లక్ష్యం) అతనికి తెలుసనీ అతను దానికోసం పని చేసాడనీ నిర్ధారించగలమా? కామన్ సెన్స్ ప్రకారం చూసినా అటువంటి లక్ష్యం గలవాళ్లు తమకు సహాయం అందిచ్చిన వారందరికీ తమ కార్యక్రమమంతా చెప్పరు. వారికి ఎంత తెలియాలో అంతే చెప్తారు. రహస్య సంస్థల పని తీరే అంత.

తన రాజకీయ లక్ష్యంలో భాగంగా ఒకరిని చంపడానికి పూనుకున్న ఒక రాజకీయ కార్యకర్తకు ఆ పని చేయడానికి మోటార్ సైకిల్ అవసరమయిందనుకోండి. ఒక గంటకోసం మోటార్ సైకిల్ ఇప్పించమని తన రాజకీయాల పట్ల సానుభూతి గల వ్యక్తిని అడిగాడనుకోండి, అతను ఇప్పిస్తాడు. ఇతను దాని మీద పోయి హత్య చేసి బండి వాపస్ ఇచ్చేస్తాడు. బండి ఇప్పించిన వ్యక్తి ఆ హత్యకు కుట్రదారుడని సాధారణ ఆలోచనారీతీ ఒప్పుకోదు, చట్టమూ ఒప్పుకోదు. అఫ్జల్‌కు వ్యతిరేకంగా పోలీసులు ప్రవేశపెట్టిన సాక్ష్యమంతా నమ్మినా అతని పాత్ర ఇంతకంటే ఎక్కువని నిర్ధారించడానికి ఏ ఆధారమూ లేదు. అతనికి శిక్ష అంటూ వేస్తే అనుమతి లేకుండా పేలుడు పదార్థాలు కలిగి ఉన్నందుకు శిక్ష వేయాలి. దానికి పేలుడు పదార్థాల చట్టం కింద శిక్ష ఐదు సంవత్సరాల నుండి జీవిత ఖైదు దాకా ఉండగలదు. ఆ నేరానికి జీవిత ఖైదు సాధారణంగా వేయరు. మరణదండన మాత్రం వేసే అవకాశం లేదు.

వాళ్ల లక్ష్యాలు తెలియకుండా అఫ్జల్ వాళ్లకు సహాయం ఎందుకు చేస్తాడు? అన్న సందేహం రావచ్చు. కాశ్మీరీల గురించి ఏ మాత్రం తెలిసినా అటువంటి సందేహం రావడానికి ఆస్కారం లేదు. కాశ్మీర్ కోసం భారత్ పదిహేడు సంవత్సరాలుగా చేస్తున్న యుద్ధంలో అరవై వేలకు పైగా ప్రాణాలు పోయాయి. భారత సైనిక జవాన్ల ప్రాణాలు కొన్ని, కాశ్మీర్ పండిట్ల ప్రాణాలు కొన్ని కాగా అత్యధిక భాగం అఫ్జల్, షౌకత్, గిలానీ, అఫ్సాన్‌ల వంటి సాధారణ కాశ్మీరీల ప్రాణాలే పోయాయి. చంపింది భారత ప్రశాసనమైనా, మిలిటెంట్లయినా చనిపోయింది కాశ్మీరీలే.

విధ్వంసమూ చాలా జరిగింది. అఫ్జల్ బారాముల్లాలోని సొపోర్‌కు చెందిన వాడు. అది ఆపిల్ వ్యాపారానికి కేంద్రం. వాణిజ్య కేంద్రమైన సొపోర్ చాలా అందమైన ఊరు. కానీ అది మిలిటెన్సీకి కూడ కేంద్రం. భారత సైన్యం ఆ ఊరిని మూడు సార్లు దాదాపు సంపూర్ణంగా అగ్నికి ఆహుతి చేసింది. ఒక్క సొపోర్‌నే కాదు, కాశ్మీర్ లోయలో అనేక గ్రామాలను, పట్టణాలనూ తగలబెట్టడం, నివాస స్థలాలను పేల్చివేయడం గత పదిహేడు సంవత్సరాలుగా జరిగింది. అటు మిలిటెంట్లు కూడ క్రమేపీ మరింత క్రూరంగా ప్రవరిస్తున్నారు. భారత ప్రభుత్వం పైన తాము చేస్తున్న పోరాటంలో సాధారణ పౌరుల ప్రాణాలు తీయడానికి వాళ్లివాళ వెనకాడటం లేదు.

తప్పెవరిది ఉన్నా, ఎందరిది ఉన్నా ఈ స్థితికి ప్రాథమిక బాధ్యత భారత ప్రభుత్వానిదేనన్న సగటు కాశ్మీరీల అభిప్రాయాన్ని తప్పుపట్టడం కష్టం. ఇక అఫ్జల్ మాటకొస్తే అతను కొంతకాలం మిలిటెంట్‌గా ఉండి ఆ తరువాత లొంగిపోయి, కొంతకాలం సరెండర్డ్ మిలిటెంట్‌గా ఉండి, స్పెషల్ టాస్క్‌ఫోర్స్‌తో పనిచేసి, ఆద్యంతం విపరీతంగా హింస అనుభవించాడు. అటువంటి వాళ్ల దగ్గరికి ఎవరైనా వచ్చి భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాం అని చెప్తే, వివరాలు అడగకుండ వారు ఏ సహాయం అడిగితే ఆ సహాయం ఇవ్వడం ఆశ్చర్యం కలిగించవలసిన విషయం కాదు.

ఈ సామాజిక, చారిత్రక విషయాలు కాకున్నా, చట్టపరమైన విషయాలు న్యాయమూర్తులకు అర్థంకాక పోలేదు. వాళ్లకు న్యాయ సిద్ధాంత పరిజ్ఞానం లేదని అనడం లేదు. ఆ పరిధిలోనే వివేచించినంత వరకు సహేతుకంగానే వ్యవహరించారు. ఇది 'పోటా' కింద పెట్టిన కేసు కాబట్టి ముద్దాయిలు పోలీసులకిచ్చిన ఒప్పుకోలును సాక్ష్యంగా స్వీకరించి ఉండవచ్చును. ట్రిబ్యునల్ కోర్టు అలానే చేసింది. హైకోర్టు, సుప్రీం కోర్టు ఒప్పుకోళ్లను తిరస్కరించాయి. 'పోలీసులు ఒప్పుకోళ్లు ఏ విధంగా తీసుకుంటారో మాకు తెలియక పోలేదులే' అని సుప్రీం కోర్టు చిన్న చురక కూడ వేసింది.

కానీ ఇటువంటి కేసులలో ఎక్కడో రాజకీయం ప్రవేశిస్తుంది. న్యాయస్థానాలు న్యాయ నిర్ణయం చేయడం ఆపేసి ఏవో రాజకీయ కర్తవ్యాలు మీద వేసుకుంటాయి. 'భారత ప్రజల మనోభావాలు' అన్నారు గానీ న్యాయస్థానాలు స్పందించింది దానికి కూడ కాదు. పాకిస్తాన్‌కు, ఇస్లాం పేరు మీద హింస చేసే సంస్థలకు, ఏదో సందేశం పంపడం అవసరం అని భావించారు. 'భారత దేశం ప్రజాస్వామ్యమని కదా మీకంతా ఇంత చులకన? ఇక్కడేం చేసినా సాగుతుందని కదా మీ అభిప్రాయం? ఆ ప్రజాస్వామ్య చిహ్నమైన పార్లమెంట్ పైనే దాడి చేసి భారత్‌ను వెక్కిరిద్దామనుకున్నారా? మీ వాడిని ఉరితీస్తాం చూడండి. మేము చేతకాని వాళ్లం కామని రుజువు చేస్తాం చూడండి'.

ఇదీ న్యాయస్థానాలతో సహా అన్నీ తెలిసిన, తెలిసి ఉండవలసిన భారతీయుల వైఖరి. దానికి ఏ పాపం ఎరుగని వాడు కాకున్నా, మరీఅంత పాపం ఎరుగని అఫ్జల్ బలి కావలసిందేనా అన్నది మనం వేసుకోవలసిన ప్రశ్న. ఇంకొంచెం ముందుకు పోయి, ఆ కొంచెం పాపం కూడ అతనిదా లేక అతనిని బోనెక్కించిన భారత సర్కార్‌దేనా అన్న ప్రశ్న కూడ మనం వేసుకోవలసిందే. కానీ దీనికి భారత్‌లో ఎంతమంది సిద్ధంగా ఉన్నారు?

*(కేసులో సాక్ష్యాధారాలు ఏమున్నాయి, ఏం లేవని నేనెట్లా చెప్పగలుగుతున్నానని నా అభిప్రాయాలతో విభేదించే వారెవరైనా ప్రశ్నించగలరు. సుప్రీం కోర్టు తీర్పు ఎక్కడయినా దొరుకుతుంది. దానిని ఎవరైనా చదవవచ్చు. కానీ నేను దాని మీద మాత్రమే ఆధారపడడం లేదు. షౌకత్ హుసేన్ గురుకు ట్రయల్ కోర్టులో న్యాయవాదిగా ఉన్న నిత్యారామకృష్ణన్ సీనియర్ న్యాయవాదిగా సహాయం చేయమని కన్నబిరాన్ గారిని కోరారు. కన్నబిరాన్ గారు విచారణ పూర్తయిన అనంతరం కేసు కాగితాలన్నీ నాకిచ్చి షౌకత్ తరఫున వాదనలు తయారు చేయమని అడిగారు. ఆ విధంగా సాక్ష్యాలు మొత్తం చూసే అవకాశం కలిగింది.)* ◆

# చేనేత సంక్షోభానికి కారణమైన జౌళి విధానాలు

- పులుగుజ్జు సురేష్

భారత ప్రభుత్వం చేనేత రంగాన్ని పరిరక్షించడానికి, ప్రోత్సహించడానికి జౌళి విధానంలో కీలక నిర్ణయాలు తీసుకున్నట్టు కనబడింది. ఎందుకంటే ఒక చేతితో నూలు వడకడం జాతీయవాదుల, స్వాతంత్ర యోధుల చరిత్రకు చిహ్నం కాబట్టి, మరొక విశేషమేమిటంటే సంస్కృతికి, సంప్రదాయానికి నిదర్శనం. 1947లో దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన రోజునుండి జౌళి రంగాన్ని వృద్ధిచేయడానికి భారత ప్రభుత్వం అనేక విధానాలు ప్రవేశపెట్టింది. వీటిలో కీలకమైనది గ్రామీణ స్థాయిలో చేనేత ప్రాథమిక సహకార సంఘాలను ఏర్పాటు చేయడం, ప్రభుత్వ పర్యవేక్షణలో వీటి ద్వారా చేనేత కార్మికులకు నిరంతరం ముడిసరుకు సరఫరా చేయడం, వస్త్ర ఉత్పత్తి చేయడం, అనంతరం మార్కెట్ చేయడం దీని ఉద్దేశం. ఇందులో ప్రభుత్వం చేనేత కార్మికుల పట్ల బాధ్యతపడుతుంది. వీరి సంక్షేమానికి, అభివృద్ధికి ప్రభుత్వమే కృషి చేస్తుంది. యిదొక రకంగా ఈ రంగానికి శుభ పరిణామమని అనుకోవచ్చు.

ఈ విధానల వలన దేశవ్యాప్తంగా గ్రామాలలో విస్తారంగా చేనేత సహకార సంఘాలు ఏర్పడ్డాయి. సహకార సంఘాల చట్టం ప్రకారం సభ్యులు వాటాధనం చెల్లించాలి. దీనిని చెల్లించడానికి ప్రభుత్వం కూడా సహకరించింది. కార్మికులు పస్తులుండి, 'పొగడలు' అమ్మి వాటాధనం చెల్లించారు. సంఘయాజమాన్యం, కార్మికుల కృషి ఫలితంగా సహకార సంఘాలు నిలబడ్డాయి.

ఆ తరువాత ప్రభుత్వ తీరులో మార్పువచ్చింది. 1985లో జాతీయ జౌళి విధానంను ముందుకు తెచ్చింది. ఈ విధానం జౌళి రంగంలో పెనుమార్పులకు కారణమయ్యింది. ఇది ఉత్పత్తి ప్రాతిపదికగా రూపొందించబడింది. కావున దీని స్వభావం సహజంగానే ఆధునిక యంత్రాలవైపు మొగ్గుచూపుతుంది. ఇక్కడకూడా అదే జరిగింది. దేశీయ వృత్తులుగానీ, పేదల జీవనోపాధి గురించి గానీ, ఇతర సామాజిక విషయాల గురించిగానీ ఈ విధానం పట్టించుకోలేదు.

1985 సంవత్సరం నుండి జౌళి రంగాన్ని సంస్కరించారు. సంస్కరణలు మొదలయింది ఈ సంవత్సంలోనే. జౌళి రంగంలో పవర్‌లూం అభివృద్ధికి పెద్దపీట వేసిన ప్రభుత్వం చేనేత రంగాన్ని ఆదుకునేందుకు గట్టిచర్యలు తీసుకుంటున్నట్టు పెద్ద నాటకమాడింది. ఈ నాటకంలో భాగమే నూలు మిల్లులు 50% చిలపల నూలును ఉత్పత్తి చేయాలని, 22 రకాలను కేవలం చేనేతరంగంలోనే ఉత్పత్తిచేయాలని, దీనిని పర్యవేక్షించడానికి నిఘా విభాగం ఏర్పాటు చేయడం జరిగింది. ఇదంతా కూడా చేనేత రంగాన్ని మభ్యపెట్టడానికే తప్ప ఈ రంగం అభివృద్ధికి మాత్రం కాదని రెండు దశాబ్దాల అనుభవం మన కళ్లముందున్నది. ఎందుకంటే రిజర్వేషన్ చట్టం గానీ, హ్యాంక్‌యార్న్ ఆబ్లిగేషన్ యాక్ట్ గానీ అమలునోచుకున్న దాఖలాలు లేవు. అంటే ప్రపంచీకరణలో భాగంగా తీసుకువచ్చిన సంస్కరణలు చేనేత రంగంలో కూడా మొదలయ్యాయి. 1985 జాతీయ జౌళి విధానంలో చేనేతకు ఉత్పత్తి, నూలు రిజర్వేషన్ ఏర్పాటు చెయ్యడం వధించడానికి సిద్ధం చేసిన పశువును అలంకరించినట్టుగా ఉంది.

నూతన జౌళి విధానం 2000ను ప్రవేశపెట్టారు. ఈ విధానం 1999లోని శ్రీ ఎస్.ఆర్. సత్యం కమిటీ నివేదిక ఆధారంగా రూపొందింది. ఈ నివేదికలో సత్యంగారు చేనేత రంగాన్ని నిర్వీర్యం చేయడానికి కంకణం కట్టుకున్నారనిపిస్తుంది. ఈ నివేదికలో ప్రభుత్వ విధానం ఏమిటో స్పష్టమయింది.

సత్యం కమిటీ వ్యాఖ్యలలో ముఖ్యమైనవి కొన్ని : చేనేతరంగం కొరకు ఏర్పాటు చేసిన నిర్దేశిత ఉత్పత్తుల రిజర్వేషన్‌ను తొలగించాలి (పేజి 320), మూడవ శ్రేణి చేనేత కార్మికులను మరమగ్గాలవైపు లేదా ఇతర వస్త్ర సంబంధ కార్యకలాపాలవైపు మళ్లించడం (పేజి 345), హ్యాంక్‌యార్న్ ఆబ్లిగేషన్ పథకాన్ని రద్దు చేయాలి (పేజి 312), చేనేత బడ్జెట్‌ను ప్రతి ఏటా తగ్గించాలి.

చేనేతరంగానికి ప్రత్యక్ష వ్యతిరేకమైన సత్యం కమిటీ ఆధారంగా రూపొందించిన నూతన జౌళి విధానం - 2000 ఈ రంగానికి గొడ్డలిపెట్టు. ఈ నివేదిక అపెరల్, టెక్స్‌టైల్ పార్కులను, పవర్‌లూం రంగం అభివృద్ధికి పెద్దపీట వేసింది. ఈ నివేదిక పుణ్యమా అని ప్రసిద్ధి చెందిన చేనేత కేంద్రాలు, ఆ ఊరిపేరు చెబితేనే ప్రపంచవ్యాప్త మార్కెట్ లభిస్తుందో అటువంటి చోట వ్యూహాత్మకంగా టెక్స్‌టైల్ పార్కుల నిర్మాణాన్ని ప్రభుత్వం చేపట్టింది. ఎగుమతి ఆధార వస్త్ర తయారీ అని చెబుతున్న ప్రభుత్వం చేనేత ఉనికికే ఎసరుపెట్టింది.

ఈ నివేదిక ప్రకారమే చేనేతకు అవసరమైన చిలపలనూలు ఆబ్లిగేషన్ యాక్ట్‌ను 40 శాతానికి కుదించారు. చేనేత ఉత్పత్తుల రిజర్వేషన్ చట్టం అమలు కాకుండా ఉండేందుకు నిఘా విభాగాన్ని నిర్వీర్యం చేసారు. చేనేత బడ్జెట్‌ను ప్రతిఏటా 5 శాతం కోత విధిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేనేత సమస్యల పట్ల నిపుణుల కమిటీని 17 జులై 2004న నియమించింది. ఈ కమిటీని చీరాల నియోజకవర్గం నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్న రాష్ట్ర ఆర్థిక మంత్రి కొణిజేటి రోశయ్య అధ్యక్షత వహించారు. ఈ కమిటీ చేనేత కొరకేనని తొలుత చెప్పినప్పటికీ అది కూడా జౌళి రంగానికే అంకితమయ్యింది. 'నేతకారుల సమస్యలపైన నిపుణుల కమిటీ' తన నివేదికను (రిపోర్ట్ ఆఫ్ ది ఎక్స్‌పర్ట్ కమిటీ ఆన్ వీవర్స్ ప్రాబ్లెమ్స్) జూలై 2005న రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించింది.

రోశయ్య కమిటీ రాష్ట్ర చేనేత వర్గంలో చాలా ఆశలు పెట్టింది. నివేదిక పేరులోనే వుంది. ఇది చేనేత కార్మికులది కాదు, నేతకారులదని, సత్యం కమిటీ కంటే దారుణంగా ఈ నివేదిక రచించబడింది. చేనేతరంగం పవర్‌లూం పోటీకి తట్టుకోలేదు. కావున చేనేత రంగంలోని యువకులను, మహిళలను, వృద్ధులను, చేనేత కార్మికులను ఇతర రంగాలలోకి మళ్లించాలని చెప్పారు. ఈ మాటను 1964 సంవత్సరం

లోనే కనుంగో నివేదక స్పష్టంగా చెప్పింది. ఈ మాట చెప్పడానికేనా రోశయ్య కమిటీ ఏర్పడింది. స్థూలంగా నివేదిక తాత్కాలిక ఉపశమనాన్ని కలిగించింది తప్ప, మౌలిక విషయాల జోలికి వెళ్లలేదు. చేనేత శాశ్వత అభివృద్ధికి చేయాల్సిన విధానాల వైపు పోలేదు.

కానీ ఈ కమిటీ ఆంధ్రప్రదేశ్ టెక్స్‌టైల్, అపెరల్ ప్రోత్సాహక విధానం 2005-10 రూపొందించింది. చేనేత కోసం అని చెప్పిన రాష్ట్ర ప్రభుత్వం, రోశయ్య కమిటీ నివేదికలో చేనేత వృత్తిదారులను ఇతర వృత్తుల వైపు మళ్లించాలని చెప్పింది. నివేదికను ప్రభుత్వం ఆమోదించక ముందే ఆంధ్రప్రదేశ్ టెక్స్‌టైల్, అపెరల్ ప్రోత్సాహక విధానం 2005-10 రూపొందడం వెనుక దాగివున్న పవర్‌లూం లాబీ, చేనేత రాజకీయుల శక్తి, ప్రభుత్వ చిత్తశుద్ధి, ప్రపంచబ్యాంకు విధానాలకు తలవంచిన ప్రభుత్వ విధానమేమిటో దీనిని బట్టి స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు.

ఈ మధ్యనే కేంద్ర ప్రభుత్వ చేనేత జాతీయ ముసాయిదా విధానం - 2006ను ప్రవేశపెట్టింది. జాతీయ చేనేత విధానం రూపకల్పన ప్రక్రియలోనే అనేక లోపాలున్నాయి. దీని రూపకల్పన కొరకు ఏర్పాటు చేసిన కమిటీలో సభ్యత్వం ప్రధానంగా అధికారులు, డిజైనర్లు, మార్కెట్ల కొరకు ఉత్పత్తి చేసే పెద్ద ఉత్పత్తిదారులకు మాత్రమే ఉన్నట్లు తెలియవస్తోంది. చేనేత కార్మిక సంఘ ప్రతినిధులకు గానీ, నేరుగా, చేనేత కార్మికులకు గానీ ఇందులో సభ్యత్వం కల్పించలేదు.

ఈ విధానంలో చేనేతరంగంగానీ ఈ రోజు వున్న తీవ్ర సంక్షోభాన్ని, దానికి దారితీసిన పరిణామాలు గానీ, కారణాలుగానీ గుర్తించలేదు. అటువంటి విశ్లేషణ కుడా లేకపోగా కేవలం సాధారణ, దశాబ్దాలుగా కొనసాగుతూ వస్తున్న సమస్యలను ప్రస్తావించటం ఈ ముసాయిదా తయారీలో వున్న విపరీత అవగాహన లోపం. ప్రపంచీకరణ నేపథ్యంలో వేగంగా మారతున్న విధానాలను, వాటి వలన చేనేతరంగం పై కలుగుతున్న దుష్ప్రభావాన్ని ప్రస్తావించని ముసాయిదా, చేనేతరంగ అభివృద్ధికి సరియైన ప్రణాళిక అని అనుకోవడం హాస్యాస్పదం.

ఈ ముసాయిదాలో సత్యం కమిటీ చేసిన కార్మికుల వర్గీకరణ ప్రస్తావించడం జరిగింది. సత్యం కమిటీ నివేదికను చేనేతరంగం పూర్తిగా తిరస్కరించినా, ఆ కమిటీ చేసిన వర్గీకరణ ఇందులో ఎందుకు ప్రస్తావించాల్సివచ్చిందో మనకర్థం కాదు. దానికి సంబంధించిన వివరణ కూడా లేదు. కానీ సత్యం కమిటీ చెప్పినట్టుగా 3వ శ్రేణిలోని చేనేత కార్మికులు ఇతర జీవనోపాధులు వెతుక్కోవాలని ఇందులో ప్రస్తావించడం ఆ కమిటీ సిఫారసులను ఆమోదించిట్లుగా కనపడుతుంది. ఒకవైపు చేనేత కార్మికులను ప్రపంచీకరణ దుష్ప్రభావం నుంచి పరిరక్షిస్తూ చేనేత అభివృద్ధి లక్ష్యంగా ప్రకటించిన ఈ ముసాయిదా విధానం చేనేత కార్మికులను ఇతర ఉపాధి రంగాలకు వలస వెళ్లాలని సూచించడం ఈ విధానంలో ఉన్న ద్వంద్వ పరిస్థితికి తార్కాణం.

చేనేత వ్యతిరేక విధానాలకు ప్రారంభంగా పరగణింపబడుతున్న నూతన జౌళి విధానం 1985, పరాకాష్టగా పరిగణింపబడుతున్న జాతీయ చేనేత విధానం - 2006 కూడా ఈ ముసాయిదా విధానంలో చేనేత అనుకూల విధానాలుగా ప్రస్తావించబడినాయి. అదే నిజమైతే జాతీయ చేనేత విధానం అవసరం ఎందుకు వచ్చిందో ఆ కమిటీ వివరణ ఇవ్వాల్సిన అవసరం ఉంది.

చేనేత రంగం చాలా విశాలమైనదని, ఇది ప్రాచీనమైనదని, భారత సంస్కృతికి, సంప్రదాయానికి చిహ్నమని, స్వాతంత్ర్య సమరానికి రాట్నం ఊపునిచ్చిందని, వ్యవసాయం తరువాత రెండవ అదిపెద్ద ఉపాధిరంగం చేనేత అని అధికారులు, ప్రణాళిక సంఘం మొదలుకొని రాజకీయ నాయకుల వరకు అందరూ చెబుతున్నారు. అయితే ఈ రోజు వరకు చేనేత రంగానికి, దాని అభివృద్ధికి ఒక విధానమంటూ లేకపోవడం విచారకరం. ◆

# సంస్కరణలకు బాబు కిటికీ మాత్రమే తెరిచాడా?

– వి. చలపతి రావు

చంద్రబాబునాయుడు ఇటీవల ఒక సందర్భంలో రాజశేఖర రెడ్డి పాలనా విధానాన్ని విమర్శిస్తూ ఒక మాట ఈ విధంగా అన్నాడు. 'నేను ఆర్థిక సంస్కరణలకు, ప్రైవేటీకరణకు కేవలం కిటికీ మాత్రం తెరిస్తే, రాజశేఖర రెడ్డి తలుపులు తెరిచాడు' అంటే తాను చేసింది చిన్న తప్పు అయితే, వైఎస్ చాలా పెద్ద తప్పు చేశాడని ఆయన చెప్పదలుచుకున్నాడు. కాని వాస్తవానికి ఆయన చేసింది చిన్న తప్పేమి కాదు, తెరిచింది కిటికి మాత్రం కాదు. ఆర్థిక సంస్కరణలకు, ప్రైవేటీకరణకు ముఖద్వారాన్ని బార్లా తెరిచాడు, పెద్దపీటే వేశాడు.

ఆయన తెలంగాణలో, నిజాం కాలంనాడు స్థాపించిన పబ్లిక్ రంగం పరిశ్రమలను వాటి స్థిర ఆస్తులను ప్రైవేటికరణ పేర తన అనుయాయులకు రియలస్టర్లకు అగ్గువసగ్గువ రేట్లకు అమ్మేశాడు. ఆయన పై విధంగా అమ్మిన వాటిలో, ఆల్విన్, రిపబ్లిక్ ఫోర్జ్, నిజాం షుగర్స్ అన్ని యూనిట్లు, రాష్ట్ర వ్యాప్తంగా (5) నూలు మిల్లులు, నాలుగు ప్రభుత్వ డిస్టలరీలు వగైరా కలవు. అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్లు ప్రభుత్వ ఆస్తులను తక్కువ ధరలకు అమ్మివేశాడు. ఇక వ్యవసాయ రంగంలో ఈయన చిన్న నీటి పారుదల వనరులను, ముఖ్యంగా తెలంగాణ ప్రాంతంలోగల చెరువు కుంటలను అనాది నుండి సైకిల్ సిస్టం పద్ధతిలో మరమ్మతు చేసే పద్ధతిని రద్దు పరిచాడు. ఇక పెద్ద నీటి పారుదల ప్రాజెక్టుల ప్రారంభం గాని ఇతర మరమ్మతులు చేయలేదు. పక్క రాష్ట్రమయిన కర్నాటక కృష్ణా నది పై ఆల్మటి ప్రాజెక్టు డ్యాం ఎత్తు పెంచితే దానిని ఆపటానికి గట్టి ప్రయత్నం చేయలేదు. ఇదంతా అయన వ్యవసాయం పై చూపిన నిర్లక్ష్యంలో భాగమే. వైఎస్ ప్రభుత్వం కూడ శ్రీరాం సాగర్ ప్రాజెక్టుకు, తద్వార తెలంగాణలో గల ఆయకట్టుకు ముప్పు వాటిల్లే బాబ్లి ప్రాజెక్టు నిర్మాణాన్ని ఆపటంలో కూడ అలాగే విఫలం అవుతున్నాది.

దేశ జనాభాలో ఇప్పటికీ 70 శాతం ప్రజలకు ఆధారంగా వుండి అన్నం పెట్టే వ్యవసాయం, చేనేత పరిశ్రమ, గ్రామీణ చేతి వృత్తులు హస్తకళలను బాబు తన హయాంలో పూర్తిగా నిర్లక్ష్యం చేశాడు. తన సర్వశక్తులన్ని ప్రపంచ బ్యాంక్ ఇతర అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలనుండి అప్పులు గుంజి తీసుకు రావటం హైదరాబాద్ లో ఫ్లై ఓవర్లు కట్టడం, రోడ్ల విస్తరణ చేయడం, స్టేడియంలు నిర్మించటం, హైటెక్ సిటీలాంటి నిర్మాణాల పై దృష్టి నిలపటం ఎక్కువ చేశాడు. విదేశీ పెట్టుబడులకు ఎర్రతివాచీ పరవటం, ఎల్లప్పుడూ విదేశీ మంత్రం వల్లించటం తప్ప స్వదేశీ బలాన్ని పూర్తిగా ఉపేక్షించటం జరిగింది. వ్యవసాయ రంగంలో అంతకుపూర్వం మండల విస్తరణాధికార్లు, గ్రామాభివృద్ధి అధికార్ల సహాయముతో వ్యవసాయ విస్తరణ కార్యకలాపాలు రైతులకు లాభదాయకంగా నడిచేవి. ప్రైవేటీకరణ పేర ప్రభుత్వం తరపున జరిగే ఆ ముఖ్య కార్యక్రమంను బలహీనపరిచారు. పురుగు మందులు అమ్మే, విత్తనాలు అమ్మే ప్రైవేట్ వ్యాపారస్తుల దయాదాక్షిణ్యాలకు రైతులను వదలటం జరిగింది. ఈ వ్యాపారుల కార్యకలాపాలపై ప్రభుత్వ పర్యవేక్షణ నియంత్రణలు పూర్తిగా మృగ్యమయి, వారు విచ్చలవిడిగా కల్తీ చేయబడిన నాసిరకం పురుగు మందులను, విత్తనాలను (ముఖ్యంగా పత్తి విత్తనాలను) మోసం చేసి అమాయక రైతులకు అమ్మి కోట్లకు పడగలెత్తారు. రైతులేమో మోసపోయి ఆ విత్తనాలు పురుగు మందులు వాడి విపరీతంగా పంటలలో నష్టపడి తెచ్చిన అప్పులు తీర్చలేక వేలాది మంది రైతులు గత ఐదారు సంవత్సరాల నుండి ఆత్మహత్యల పాలైన సంగతి తెలిసిందే. ఈ ఆత్మహత్యల పర్వం నేటికి కొనసాగుతున్నది. ఇన్నాళ్లు భారతదేశ రైతు బీదరికం అనుభవిస్తాడు, కలోగంజోతాగి ప్రాణాలను కాపాడుకుంటాడు గాని, ఇలా ప్రైవేటీకరణ ప్రక్రియలో ప్రభుత్వాలు పెంచిపోషించిన దగాకోరు కంపెనీలతో, వ్యాపారస్తులతో మోసపోయి ఆత్మహత్యలు చేసుకోలేదు. ఇదంతా బాబులాంటి, మన్మోహన్‌సింగ్ లాంటి ఆర్థిక సంస్కరణల కంకణదారుల పుణ్యమే. ఈ విధంగా కొనసాగుతున్నా రైతుల, చేనేత కార్మికుల ఆత్మహత్యల పర్వం రైతు ప్రధానమయిన మన దేశ చరిత్రలో కనీవిని ఎరుగని చీకటి అధ్యాయం. రైతుల పై ఆధారపడి బతికే కూలి జనం పని దొరకక డొక్కలు మాడ్చుకొని అష్టకష్టాల పాలయి, చివరకు బస్తీలకు నగరాలకు వలసలు పోయినారు. ఇలా పల్లెల నుండి వచ్చిన బీద కార్మికులు నగరాలలో రోడ్ల అంచున ఎలాంటి కనీస సౌకర్యాలు లేని మురికివాడలలో హీనస్థితిలో బతుకులు వెళ్లపోసుకుంటున్నారు. సోనియా గాంధీ అన్నట్లు 'హమ్ ఆమ్ ఆద్మీ కె వాస్తే క్యా కియె' అనే రాజకీయ నినాదానికి దర్పణంగా వీరు బతుకుతున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయాన్ని, గ్రామాలను ఈ స్థితికి దిగజార్చినది పూర్తిగా నూటికి నూరుపాళ్లు బూటకపు ఆర్థిక సంస్కరణలు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణల పుణ్యమే. ఇది సంస్కరణల చాంపియన్‌గా పేరుగాంచిన బాబు పుణ్యం కాదా! ఇంత జరిగిపోయాక నేను ఆర్థిక సంస్కరణలకు, ప్రైవేటీకరణకు కిటికీ మాత్రమే తెరిచానని అనటం చాలా మోసపూరితం కాక మరేమిటి?

ఆర్థిక సంస్కరణల్లో భాగంగా ఈయన విద్యుత్ సంస్కరణలను అమలు పరిచాడు. అంతవరకు డిపార్టుమెంట్ ఆధ్వర్యాన (బోర్డు) మేనేజ్‌మెంట్ లో ఉన్న విద్యుదీకరణ కార్యక్రమంను ట్రాన్స్‌కో జెన్‌కో అనే రెండు మూడు కార్పొరేషన్ సంస్థలను ఏర్పాటు చేసి ఈ సంస్కరణలను ఆ సంస్థలకు ఒప్పచెప్పాడు. 13 ప్రైవేట్ సంస్థలతో విద్యుత్ ఉత్పత్తి చేసి సప్లయి చేయుటకు ప్రభుత్వం ఈయన హయాంలో ఒప్పందం (ఎఒయు) చేసుకుంది. సంస్కరణల పేర ఇంతచేసినా రైతులకు వినియోగదారులకు కరెంటు కష్టాలు తప్పలేదు. మునుపటి కన్న ఇప్పుడు కరెంటు సప్లయి వ్యవసాయదార్లకు తగ్గింది. కనీసం 3,4 గంటలు కూడా కరెంటు సప్లయి కావటం లేదు. చదివిస్తె ఉన్నమతి పోయినట్లుగా వుంది. కడపకు సాగునీరు ఇవ్వటానికి ఉద్దేశించి వై.ఎస్. శ్రీశైలంలో విద్యుతుత్పత్తి స్థాయి తగ్గించాడు. రైతులు కరెంట్ సప్లయి తగ్గిందని

గగ్గోలు పెడుతుంటే, ఇతర రాష్ట్రాల నుండి కొనుగోలు చేసి సప్లయి చేస్తానని అంటాడు. ఇవి సంస్కరణలా లేదా కుసంస్కరణలా అర్థం కాదు. ఇలాంటి సంస్కరణలకు బాబు తన హయాంలో వేసిన బీజాలే ఇప్పుడు పెద్ద వృక్షాలయి, అవి ప్రజలకు నిరుద్యోగులకు బతుకుదెరువు చూపించటమెమోకాని, పాలకులకు మాత్రం కల్పవృక్షాల వలె నిలిచాయి. బాబు హయాంలో తాను ఒక కంపెనీ చీఫ్ ఎగ్జిగ్యూటివ్‌గా మిగతా మంత్రులంతా మేనేజర్లుగా పాలించి ప్రైవేట్ సెక్టర్‌కు మిత్రులుగా ఆపద్భంధువల వలె వ్యవహరించారు. ఇప్పుడు పాలకవర్గమంతా ప్రైవేటీకరణ మంత్రముచ్చరిస్తు ల్యాండ్ మాఫియాలుగా, ల్యాండ్ బ్రొకర్లుగా ప్రభుత్వ భూముల ఆక్రమణదారులుగా మారిపోతున్నారు. గొర్లతినే వాళ్లు పోతే బర్లతినే వాళ్లు వచ్చారన్నట్లుగా వుంది ప్రస్తుత పరిస్థితి. అందుకే ఆనాడు బాబు ప్రైవేటీకరణకు, ప్రపంచీకరణకు తెరిచింది చిన్న కిటికీ కాదు, తలుపులే తెరిచాడు. ఇప్పుడు వైఎస్ ఫ్లడ్ గేట్స్ తెరిచాడు. ప్రభుత్వ యంత్రాంగమంతా అవినీతిమయమయింది. ముఖ్యమంత్రి మారువేషము వేసికొని ఏ ప్రభుత్వ ఆఫీసుకు పోయి నిఘా చేసినా అక్కడ సిబ్బంది ఏ విధంగా పని చేస్తున్నది, అవినీతి స్థాయి ఎంతవరకు పెరిగిందో తెలుస్తుంది.

జాతిపిత మహాత్మా గాంధీ సూచించిన గ్రామ స్వరాజ్ భావననుండి మన గ్రామాలను ఈ ఘన రాజకీయులు ఎంతో దూరం తీసుక వెళ్లి గ్రామాలు పూర్తిగా పై విధంగా రైతులను మోసం చేసి కంపెనీల పై, వ్యాపారులపై ఆధారపడేటట్లుగా తయారు చేశారు. గ్రామాలకు రేషన్ బియ్యం ఇతర సరుకులు పొనిదే వారి పొట్టలు నిండని పరిస్థితి తీసుకవచ్చారు. వీరి ఇందిరమ్మ పథకాలని, రాజీవ్ పథకాలని, జన్మభూమి కార్యక్రమాలని గ్రామాలను పట్టణాలలోని మురికివాడలను రాజకీయులకు ఓటు బ్యాంకులుగా తయారు చేయటానికె గాని, వాటిని స్వయం సమృద్ధం చేద్దామనే ఉద్దేశ్యం లేదు. 1991కు పూర్వం కాంగ్రెస్ ప్రభుత్వాలు గ్రామాలను బలహీన పరిచాయంటే, దాని తర్వాత బాబులాంటి ప్రపంచ బ్యాంకు ఏజెంట్లు, ప్రైవేటీకరణ చాంపియన్లు పట్టణీకరణ ప్రక్రియను పెద్ద ఎత్తున చేబట్టి గ్రామాల నడ్డిని పూర్తిగా విరగగొట్టారు. రాజీవ్ గాంధీ హయాంలో తీసిక వచ్చిన 73,74వ రాజ్యాంగ సవరణల ప్రకారం పంచాయితీరాజ్ వ్యవస్థలను బలోపేతం చేయటానికి బదులు వాటిని బలహీనపరిచి, ఆ సంస్థలపై రాష్ట్ర ప్రభుత్వం అత్త పెత్తనం ఎక్కువ చేశారు. బాబు హయాంలో పంచాయితీరాజ్ సంస్థలలో ఎం.పి.టి.సి., జడ్.పి.టి.సి. లను కొత్త పదవులను సృష్టించి తద్వారా గ్రామాలలో తన పార్టీ ఆర్గనైజేషన్ విస్తృత పరచటానికి ప్రయత్నం చేశాడు. ఈ పనిని గ్రామాలలో తన పార్టీ క్యాడర్‌ను పెంచుకోవటానికే గాని, గ్రామాల ఆర్థికపుష్టిని పెంచటానికి కాదు. గ్రామ పంచాయతీల కార్యాలయాలు పేర్లు మార్చి గ్రామ సచివాలయాలని పేర్లు పెట్టి వాటిని రాష్ట్ర సచివాలయమునకు గ్రామ చాప్టర్లుగా మార్చడు. గ్రామ పంచాయతీల రాజ్యాంగ ప్రతిపత్తిని కాలరాయటమే కాక వాటిపై రాష్ట్ర ప్రభుత్వ పెత్తనం ఎక్కువ చేయడమయినది.

ప్రపంచ బ్యాంక్ నిధులతో గ్రామాలలో నాసిరకం సిమెంటు రోడ్లు వేశారు. అలా వేసిన రోడ్ల ఎస్టిమేట్లలో 40 శాతం కూడా రోడ్లపై ఖర్చు చేయక మిగతా డబ్బును ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు, బాబు సృష్టించిన ఎం.పి.టి.సి.లు, జడ్.పి.టి.సి.లు, సర్పంచులు వగైరా కలిసి పంచుకున్నారు. ఈ అవినీతి పంపిణి యజ్ఞం ఇప్పుడు ఇంకా ఎక్కువ స్థాయిలో నడుస్తున్నది. ఇదంతా ఆర్థిక సంస్కరణల ఫలితమే. బాబు ప్రవేశపెట్టిన ప్రైవేటీకరణ ప్రక్రియ ఇప్పుడు ఇంకా ముదురు పాకానపడి, వై.ఎస్. హయాంలో జూలు విదిల్చి వికృత రూపం దాల్చింది. జలయజ్ఞం పేర ప్రాజెక్ట్ పనులన్నిటిని టెండర్ విధానాన్ని పక్కకు పెట్టి తమ అనుయాయులకు ఒప్పచెప్పారు. ఎస్టిమేట్ డబ్బులో పది శాతం డబ్బును మెబిలైజేషన్ ఎడ్వాన్సులుగా ఇచ్చి పనులు చేయిస్తున్నారు. ఇలా ఇచ్చిన వేలాది కోట్ల మెబిలైజన్స్ అడ్వాన్సులు, కాంట్రాక్టర్లు, అధికార్లు, రాజకీయులు పంచుకొని రియల్ ఎస్టేట్ వ్యాపారంలో పెట్టుబడులు పెట్టి హైదరాబాద్ చుట్టూ ముఖ్యంగా ఔటర్ రింగ్ రోడ్డుకు అనుకొని వున్న భూములు కొంటున్నారని బలమయిన అభియోగం. ఇలా వీరు కొన్న భూములు ఔటర్ రింగు రోడ్డు కింద పోకుండా సదరు రోడ్డు అలైన్‌మెంట్‌లు మాటి మాటికి మార్చారని అభియోగం పై ముఖ్యమంత్రి సి.బి.ఐ. విచారణకు కేంద్రాన్ని ఇటీవల కోరారు. ఇక్కడ పెద్ద జోక్ ఏమిటంటే, ఇలా ప్రజా ధనాన్ని దొడ్డి మార్గాన అవినీతితో పంచుకొని కొన్న భూముల వ్యవహారంను దృష్టిలో పెట్టుకొని రాయలసీమ ఐక్యవేదిక కన్వీనర్ వెంకటేశ్, ఒక ప్రైవేట్ టి.వి. ఇంటర్వ్యూలో మాట్లాడుతూ, మావాళ్లు వేలాది కోట్ల రూపాయలు హైదరాబాద్ చుట్టు పక్కల గల భూములపై పెట్టుబడులు పెడుతున్నారు, కనుక ప్రత్యేక తెలంగాణ అయినప్పటికి హైదరాబాద్‌ను మాత్రం మాకివ్వండి అని వాదించాడు. అంటే సమైక్య వాదులకు హైదరాబాద్ నగరం పైననే కన్ను తప్ప తెలంగాణ అభివృద్ధి గురించి వారికి ఎన్నడు పట్టింపు లేదన్నమాట.

బాబు హయాంలో ఆర్థిక సంస్కరణల్లో భాగంగా పాలనా సంస్కరణలను ప్రవేశ పెట్టడమయినది. ఈ సంస్కరణల ఉద్దేశం ప్రజలకు సుపరిపాలన అందించటం అని చెప్పారు. కాని ఈ సుపరిపాలన జాడలు ఎక్కడా కనబడటంలేదు. ఉదాహరణకు సహకార రంగం తీసుకుందాం. గ్రామీణ పరపతి సంఘాలు పూర్తిగా చతికిలబడి పొంయాయి. దానికి కారణం రాజకీయ పలుకుబడి ఉన్న మెంబరు తీసుకున్న అప్పులు తిరిగి చెల్లించకపోవటం. పెద్ద నాయకుణ్ని చూచి కార్యకర్తలు కూడా తీసుకున్న అప్పులను తీర్చగలిగే సత్తా ఉండి తీర్చకపోవటం. అధికార్లు అవినీతి పరులయి ప్రేక్షకపాత్ర వహించటం వలన గ్రామీణ సహకార పరపతి సంఘాలు పూర్తిగా నిర్వీర్యమయిపోయినవి. అలాగే అర్బన్ కో–ఆపరేటివ్ బ్యాంకుల డైరక్టర్లు, మేనెజింగ్ డైరక్టర్లు కలిసి డిపాజిటర్ల నిధులను అప్పుల రూపంలో తీసుకుని కాజేశారు. అలా వారు డిపాజిటర్ల నిధులను కాజేసి ఉడాయిస్తుంటే సహకారశాఖ అధికార్లు, మంత్రులు తోడు దొంగలవలె వ్యవహరించారు, కాని ఆ దొంగ డైరక్టర్లను మేనెజింగ్ డైరక్టర్లను చట్టానికి ఒప్పచెప్పే చర్యలు తీసుకోలేదు. ప్రస్తుత ప్రభుత్వ హయాంలో కూడ కన్యకాపరమేశ్వరీ అర్బన్ కో–ఆపరేటివ్ బ్యాంక్ ఎం.డి. డిపాజిటర్ల నిధులను కాజేస్తే ఈ ప్రభుత్వం కూడ తగిన చర్య వెంటనే తీసుకోలేదు. తత్ఫలితంగా ఎందరో సామాన్య మధ్యతరగతి డిపాజిటర్ల బతుకులు బజార్ల పాలయినాయి. కొందరు డిపాజిటర్లు ఈ బ్యాంకుల పాలకుల సహకారంతో చేసిన మోసాలకు తట్టుకోలేక ఆత్మహత్యలు కూడ చేసుకున్నారు.

ఇక వ్యవసాయ శాఖ నిర్వాకం తెలిసిందే. విత్తనాల, పురుగు మందుల వ్యాపారులు, కంపెనీలు నాసిరకం విత్తనాలు పురుగుమందులను మోసపూరితంగా అమ్ముతుంటే ఈ శాఖ అధికార్లు ఇలాంటి దొంగవ్యాపార్లను ఎక్కడా ప్రాసిక్యూట్ చేసి శిక్షించిన దాఖలాలు లేవు. వరంగల్ జిల్లాలో ఇలా మోసపోయిన రైతులు సదరు దుకాణాలపై పెద్దఎత్తున రెచ్చిపోయి దాడి చేశారు. అయినా సదరు దొంగ వ్యాపారులు చట్టం నుండి తప్పించుకున్నారు. వారికి శిక్షలు పడలేదు. ఇన్ని రంగాలలో అంటే వ్యవసాయ రంగంలో, చేనేత రంగంలో, సహకార రంగంలో, ప్రభుత్వ పెన్షనర్ల తో సహా (బాబు పెన్షన్ బకాయిలు చాలాకాలం నిలిపి వుంచినందున ఖమ్మంలో ఒక ప్రభుత్వ పెన్షనర్ మరొకరిద్దరు ఇతర జిల్లాలలో ఆత్మహత్యలు చేసుకున్న వార్తలొచ్చాయి) ఎందరో ఆత్మహత్యలు చేసుకుంటే, అయినా ఆనాడు బాబు ఆంధ్రప్రదేశ్‌లో పాలనా సంస్కరణలు, విద్యుత్ సంస్కరణలు ఇంకా ఏవేవో సంస్కరణలు ఆర్థిక సంస్కరణల్లో భాగంగా ప్రవేశ పెడుతున్నాడని ప్రపంచబ్యాంకు ఇతర అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు ఈయనకు పెద్ద కితాబు ఇవ్వటమే కాక పెద్ద సంస్కరణకర్త అని అంతర్జాతీయంగా పబ్లిసిటి ఇచ్చినవి. ఇలాంటి పబ్లిసిటి ఇవ్వటంలో ఈ సంస్థల అంతరార్థమును గుర్తించవచ్చును. ఇప్పుడు అదే ప్రపంచ బ్యాంకు ఆర్థికవేత్తల టీం తమ 'ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి రిపోర్టు 2006'లో ఆంధ్రప్రదేశ్‌లో గ్రామాలు చాలా దీనావస్థలో, నేపాల్ గ్రామాల వలె ఉన్నాయని మొసలి కన్నీరు కార్చారు. ఈ రిపోర్టు గురించి ఇటీవల అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్‌కాలేజ్‌లో జరిగిన ఒక సమావేశంలో వెల్లడించారు. వారి అభిప్రాయాలలో గ్రామాలు పూర్తిగా నిర్లక్ష్యానికి గురి అయినవని, ఈ సంస్కరణల కాలంలో పాలకులు పూర్తిగా పట్టణీకరణ పైననే ఎక్కువ ధ్యాస పెట్టారని. ప్రపంచ బ్యాంక్ రుణాలన్ని ఎక్కువగా పట్టణాల అభివృద్ధికే ఖర్చు చేశారని తెలిపారు. ఈ సంస్కరణల వల్ల దేశంలో 70 శాతం ప్రజలు నివసించే గ్రామాలు పూర్తిగా నిర్లక్ష్యానికి గురి అయినాయని వారు స్వయంగా ఒప్పుకొనటాన్ని ప్రతి భారతీయ పౌరుడు ముఖ్యంగా రాజకీయులు, ఆర్థిక వేత్తలు విచారించవలసిన విషయం. బహుశా బాబు సదరు ప్రపంచబ్యాంక్ రిపోర్ట్ చదివే పశ్చాత్తాప్పడి 'నేను ఆర్థిక సంస్కరణలకు కిటికీ మాత్రమే తెరిచానని' అని వుంటాడు.

బాబు వల్లించిన ప్రైవేటీకరణ మంత్ర బలంతో ప్రైవేట్, కార్పొరేట్ విద్యా సంస్థలు బాగా బలపడి అధిక ఫీజులు గుంజుతూ మధ్యతరగతి పేదలను దోచుకుంటున్నారు. ఇంకొకవైపు ప్రభుత్వ పాఠశాలలు కాలేజీలు బలహీనపడినవి. అదే విధంగా ప్రైవేట్ హాస్పిటళ్లు కార్పొరేట్ హాస్పిటళ్లు బాగా బలం పుంజుకున్నవి. ప్రభుత్వ వైద్యశాలలో మందులు కరువు, డాక్టర్లు వుండరు, వున్నవారు పేషెంట్లను చూడరు, వీటి నిర్వహణ పై ఉన్నతాధికార్లు, జిల్లా అధికార్లు నియంత్రణ లోపించింది. తత్ఫలితంగా బీద ప్రజలు ముఖ్యంగా పల్లెప్రాంతాలలో గిరిజన ప్రాంతాలలో వైద్య సహాయం మృగ్యమయి చాలా ఇబ్బందుల పాలయినారు. బాబు హయాంలో ఆదిలాబాద్ ఇతర గిరిజన ప్రాంతాలలో విష జ్వరాలొచ్చి వందలాది గిరిజన ప్రజలు ప్రాణాలు కోల్పోయినారు. సర్కారి దవాఖానాలలో ఈ పరిస్థితి ఇంకా కొనసాగుతోది. కొన్ని ప్రాంతాలలో పరిస్థితి మరింత అధ్వాన్నముగా ఉన్నది. ఇది బాబు కాలం నుండి నేటివరకు కొనసాగుతున్న దుస్థితి.

బాబు కాలంలో ముఖ్యమయిన డిపార్టుమెంట్‌లలో కన్సల్టెంట్లు ప్రవేశించారు. వీరిపై ప్రభుత్వం కోట్లాది రూపాయలు ఖర్చు చేసినట్లు అపవాదు కలదు. కన్సల్టెంట్ల నియమించటం అనేది ప్రపంచబ్యాంకు సూచనల మేరకె జరుగుచున్నది. ఇరిగేషన్ డిపార్టుమెంట్‌లో సుమారు ఒక దశాబ్దని కింద నియమించబడిన సలహాదారు సీతాపతి రావు, ఆ డిపార్టుమెంట్‌లోని ప్రిన్సిపల్ సెక్రటరిని కూడ లెక్క చేయక పాలనా ప్రక్రియలో ప్రత్యక్షంగా కలగించుకొని జీ.ఒ.లు కూడ జారి చేయిస్తున్నారు. తెలంగాణ ప్రాంతంకు నష్టం కలిగించే పోతిరెడ్డిపాడు పాడ్ రెగ్యులేటర్ సామర్థ్యం పెంచుటకు వరుసగా జారి అయిన రెండు మూడు జీ.ఒ.ల వెనుక ఈయన హస్తం ఉంది. అలాగే పోలవరం పనులను కూడ కేంద్రం అనుమతి లేకుండ కాలువ తవ్వకాల వెనుక ఈయన సలహా సంప్రదింపులు ఉన్నాయి. ఈయన ఆంధ్రప్రదేశ్‌లో ఒక రాజ్యాంగేతర శక్తిగా బాబు హయాం నుండి నేటివరకు చలామణి అవుతున్నాడు. ఇక ఐ.పి.ఎస్. ఆఫీసర్లు రాజ్యాంగ చట్టం ఇతర చట్టాల అమలు విషయంలో ప్రభుత్వానికి సరిఅయిన విధంగానే గైడ్ చేయటం, రాత పూర్వకం సలహాలు ఇవ్వటం మాని ప్రభుత్వంను ఏలే పాలకుల చేతిలో కీలుబొమ్మలుగా మారినారు. మేము ఆలిండియా సర్వీసెస్‌కు సంబంధించిన ఉద్యోగులం మాకు ఒక ప్రత్యేక స్టేటస్, ప్రత్యేక భాద్యతలు, రక్షణలు గలవు అనే స్పృహ వీరికి లేకుండా పోతున్నది. ఇది బాబుగారు ప్రవేశ పెట్టిన పాలనా సంస్కరణల ఫలితం కాదా?

ఇక రెవిన్యూ పాలన సరేసరి. ఈ రాష్ట్రంలో భూ సంస్కరణల చట్టం 1972 అమలు లో వుంది. ఈ చట్టం ప్రకారం ఒక వ్యక్తి లేదా ఒక కుటుంబానికి (భార్య భర్త మైనర్ పిల్లలు కలిసి) 54 ఎకరాల మెట్ట సాగు భూమి (ఒక కమతం) కన్న ఎక్కువ వుండటానికి వీలు లేదు. అదే ప్రభుత్వ నీటివనరు నుండి నీటిపారుదల సౌకర్యం వున్న భూమి అయితే ఒక కుటుంబానికి 16 ఎకరాల కన్న ఎక్కువ వుండటానికి వీలు లేదు. హైదరాబాద్‌లో అర్బన్ సీలింగ్ చట్టం 1976 (సెంట్రల్ ఆక్ట్) అమలులో వుంది. దీని ప్రకారం హైదరాబాద్‌లో గాని హైదరాబాద్ చుట్టూ ఉన్న అర్బన్ అగ్లమరేషన్ ఏరియాలో 1000 చదరపు మీటర్ల ఇంటి స్థలం కన్నా ఎక్కువ కలిగి ఒక వ్యక్తి ఉండటానికి వీలు లేదు. మరి ఈ రెండు చట్టాలకు తోడుగా ప్రభుత్వ భూముల అసైన్‌మెంట్ రూల్స్ కూడా ఉన్నవి. ఈ మూడు నాలుగు చట్టాలకు అతీతంగా ఎలా కొందరు వ్యక్తులు, వ్యాపార సంస్థల చేతులలో వేలాది ఎకరాలు కేంద్రీకృతమయి వున్నాయి? ముఖ్యంగా ఎక్కువ కొనుగోలు శక్తి గల ఆంధ్రావ్యాపార సంస్థలు ఇలా చట్టాలను ధిక్కరించి, అక్రమంగా వేలాది ఎకరాల వ్యవసాయం భూములను సేకరించి తమ కబ్జాలలో పెట్టుకున్నారు. ఇలా అక్రమంగా భూములు సేకరించినవారి లిస్టు ఒకటి మావోయిస్టులతో ప్రభుత్వం చర్చలు జరిపిన సందర్భంలో మావోయిస్టుల ప్రతినిధులు ప్రకటించారు. ఇలా అక్రమంగా వేలాది ఎకరాల వ్యవసాయ భూములను కబ్జా చేసికొని ఉన్న వారిపై చర్య తీసుకోలేదు సరికదా, అసలు మావోయిస్టులతోనే చర్చలను రద్దు చేశారు. ఇలా అక్రమంగా భూకబ్జా చేసిన వీరిలో అధికారంలో ఉన్న రాజకీయులు కూడ ఉన్నారు. కనుకనే ప్రభుత్వం వారిపై చర్య తీసుకోలేదు. ఇప్పుడు రాజశేఖరరెడ్డి ప్రభుత్వం అసైన్డ్ ల్యాండ్స్‌ను మరల ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటానికి,

ఆర్డినెన్స్ తీసుకరావటానికి క్యాబినెట్ నిర్ణయం చేసింది. టి.డి.పి. పార్టీ వారు ఔటర్ రింగ్ రోడ్డు వ్యవహారంలో కాంగ్రెస్ వారి కొన్ని అక్రమాలు తవ్వి తీస్తునందుకు, ప్రతిగా తీసుకొన్న నిర్ణయమెకాని చిత్తశుద్ధితో మాత్రం కాదు. ఇలా ప్రభుత్వ భూములు, ప్రైవేట్ వ్యవసాయ భూములను పై చట్టాలకు వ్యతిరేకంగా దురాక్రమణ చేయటంలో ఈ రెండు పార్టీల వారు దొందూ దొందే. ఇదంతా ప్రైవేటీకరణ ప్రభావమే, రాజ్యాంగ చట్టంలో పొందు పరిచిన సోషలిస్టు విధానానికి తిలోదకాలిచ్చారు.

మొన్న నైనీతాల్‌లో జరిగిన కాంగ్రెస్ ముఖ్యమంత్రుల సమావేశం సందర్భంగా వై.ఎస్. నక్సల్స్ సమస్య సాంఘిక, ఆర్థిక సమస్యగానె పరిగణిస్తామని చెప్పాడు. కాని ఆ దిశలో చర్యలు తీసుకోవటంలేదు. పశ్చిమ బెంగాల్‌లో నక్సలిజం పుట్టినప్పటికి ఇప్పుడు అక్కడ నక్సలైట్ల కార్యకలాపాలు ఆంధ్రప్రదేశ్‌లోవలే లేవు. దానికి కారణం అక్కడి ప్రభుత్వం భూసంస్కరణల చట్టాన్ని చిత్తశుద్ధితో అమలు పరచటమే. ఇది అందరు పరిశీలకులు రాజకీయులు ఒప్పుకుంటున్నారు. కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాత్రం భూసంస్కరణల చట్టంను అమలుపరుచుటకు సిద్ధంగా లేదు. ఇప్పటికీ ఆంధ్ర రాయలసీమ ప్రాంతాలలో వందలఎకరాలు గల భూస్వాములున్నారు. తెలంగాణ ప్రాంతములో సదరు భూ సంస్కరణల చట్టం (1972) చాలా వరకు అమలు జరిగింది. ఇప్పుడు తెలంగాణ గ్రామాలలో 50 ఎకరాలు గల రైతులు లేరు. అందుకే నక్సలిజం తెలంగాణ ప్రాంతాలనుండి క్రమంగా ఆంధ్ర ప్రాంతంనకు పాకింది. అసలు నక్సల్స్ ప్రభావం తగ్గించటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూసంస్కరణల చట్టాన్ని చిత్తశుద్ధి అమలు పరచి, పెద్ద ఎత్తున భూమి కొందరి చేతులలో కేంద్రీకరించబడటం నివారించవచ్చు గదా! ల్యాండ్ మాఫియాల ఆగడాలకు అడ్డుకట్ట వేయవచ్చు కదా! మార్కెట్ ఎకానమి పేద, చిన్న రైతుల భూములను బలవంతంగా అగ్గువ ధరలకు సేకరించి మల్టీనేషనల్ కంపెనీలకు ధారాదత్తం చేయటం న్యాయమా? ఈ విధానమే పెద్ద ఎత్తున సాంఘిక అసమానతలకు దారి తీయుట లేదా?

గోదావరి బేసిన్ ఏరియాలో గల ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ ఖమ్మం జిల్లాలలో గల ఏజెన్సీ ప్రాంతాలలో గల గిరిజనుల లక్షలాది ఎకరాల భూములను ట్రైబల్ ప్రొటెక్షన్ చట్టాలకు వ్యతిరేకంగా కోస్తా ఆంధ్ర జమీందార్లు ఆక్రమించి అనుభవిస్తూంటే, బాబు 1/70 రెగ్యులేషన్ రద్దు పరిచి ఆక్రమణదారులకు పట్టాలు ఇప్పించటానికి ప్రయత్నించాడు. అదృష్టవశాత్తు బాబు ప్రయత్నాన్ని కేంద్ర ప్రభుత్వం అడ్డుకుంది. అది వేరు సంగతి ఇక్కడ తేల్చవలసిన విషయంమేమిటంటే, ఇప్పుడు మరల ముఖ్యమంత్రి కావలనే కలలు కంటున్న బాబు ఆంధ్రప్రదేశ్‌లో ప్రపంచబ్యాంక్ మార్కు ఆర్థిక సంస్కరణలకు ప్రపంచీకరణకు, ప్రైవేటీకరణకు నాంది పలకలేదా? అభివృద్ధి చెందిన యూరప్ అమెరికా దేశాల ఉత్పత్తులకు భారతదేశాన్ని వినిమయదారుల మార్కెటుగా మార్చటానికి ప్రయత్నం చేసిన ప్రముఖ మార్కెటు ఎకానమి ఛాంపియన్ ఎవరు? చంద్రబాబునాయుడు కాదా? ఇప్పుడు ఏమి ఎరుగని బుద్ధిపూసవలె 'నేను ఆర్థిక సంస్కరణలకు, ప్రైవేటీకరణ ప్రక్రియలకు కిటికీలు మాత్రం తెరిచాను' అంటే ఎవరయిన నమ్మగలరా? అయితే వైఎస్ పాలన ఇందుకు అతీతం ఏమి కాదు. పబ్లిక్ ఆస్తులను ముఖ్యంగా ప్రభుత్వ భూములను మల్టీనేషనల్ కంపెనీలకు అప్పచెప్పటంలో ఆయన అడుగుజాడలోనే నడుస్తున్నాడు. దొందూ దొందే. వీరిరువురి పాలనా కాలములలో ప్రపంచబ్యాంకు ఇతర అంతర్జాతీయ ఆర్థిక సంస్థల అప్పులు వడ్డీతో సహా సుమారు ఒక లక్ష వేల కోట్ల రుపాయలకు పెరిగివుంది. ఇలా ఇంత పెద్ద మొత్తం అప్పు ప్రజల నెత్తిన రుద్దినందుకు ప్రజలు వీరిరువురికి బుద్ధిచెప్పక మానరు. ◆

# తెలంగాణ చరిత్రంతా ప్రజాపోరాటాల చరిత్రే

- చిక్కుడు ప్రభాకర్

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు జరుగుతున్న పోరాటం నేటిది కాదు. 50 సంవత్సరాల క్రితం ఈ ప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో కాదు, భారతదేశంలోనే ఒక భాగం కాదు. ఇది వాస్తవం. స్వాతంత్ర్యానికి ముందే తెలంగాణ ప్రాంతంలో భారత కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో మార్క్సిజం - లెనినిజం అవగాహనతో సాయుధ రైతాంగ పోరాటం ఉధృతంగా కొనసాగింది. మొత్తంగా దేశాన్ని విముక్తిచేయాలనే లక్ష్యంతో సాగిన పోరాటం భారతప్రభుత్వం, నిజాం నవాబు సైన్యాలచే అణచివేతకు గురికాగా, ఆ ఉద్యమ నాయకత్వ ద్రోహ ఫలితంగా 1948 సెప్టెంబర్ 17నాడు భారతప్రభుత్వం ఈ ప్రాంత నిజాం నవాబుతో ఒప్పందం కుదుర్చుకుని ఈ సంస్థానాన్ని స్థానిక ప్రజల మనోభావాలకు విరుద్ధంగా భారతదేశంలో విలీనం చేసుకున్నది. నాటి నుండి తన స్వతంత్ర భూభాగం కాపాడుకునేందుకు, తన అస్తిత్వం నిలుపుకునేందుకు, తన వనరులను దోపిడికి గురికాకుండా కాపాడుకోవడం కొరకు పోరాటం జరుపుతూనే ఉంది.

భౌగోళికంగా విస్తారంగా వున్న నదులు, బొగ్గు, ఇతర సహజ సంపదలు ఇక్కడి ప్రజల జీవన విధానానికి కొంత దోహదపడేవి. భారతదేశంలో విలీనం తర్వాత దేశంలో మొదటిసారి జరిగిన జనరల్ ఎన్నికలలో నుండే ఈ ప్రాంత ప్రజలకు తమ సంస్థానం భారతదేశంలో విలీనం కావడంపై అయిష్టత పెరిగింది. నిజాం నవాబు, అంతకుముందు ఈ ప్రాంతంలో పాలన చేసిన కాకతీయుల కాలంలో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలే తప్ప, అంతకంటే ఈ ప్రభుత్వాల ఆధ్వర్యంలో జరిగిన అభివృద్ధి ఏమీలేదు. వ్యవసాయానికి సంబంధించిన మౌలిక రంగాలయిన నీటిపారుదల రంగం, విద్యుత్‌రంగాలు అభివృద్ధి చెందకపోగా, ఈ ప్రాంతంలో అప్పటికే విస్తృతంగా బొగ్గును వెలికి తీస్తున్న కంపెనీలు కూడ ఈ ప్రాంత ప్రజల మౌలిక సమస్యల పరిష్కారం కొరకు ఒక స్పష్టమైన అభివృద్ధి నమూన అమలు చేయలేదు.

1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడుతున్నపుడు, అంతకు ముందే (1954లో) రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ మొదటి కమిటీ (ఫస్ట్ స్టేట్స్ రీఆర్గనైజింగ్ కమిటీ) ఫజల్ అలీ ఆధ్వర్యంలో వేసినపుడు కూడా తెలంగాణ ప్రాంతం ఒక రాష్ట్రంగా ఉండాలని ఈ ప్రాంత ప్రజలు తమ ఆకాంక్షను వెలిబుచ్చారు. ఇందులో భాగంగానే రాష్ట్రాల పునర్ వ్యవస్థీకరణ మొదటి కమిటీ కూడ తెలంగాణ ప్రాంతం ఒక రాష్ట్రంగా ఉండాలని సూచిస్తూ ఒక ప్రాంత ప్రజలు ఒక రాష్ట్రంగా ఉండాలని కోరుకునేందుకు కావలసిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, భౌగోళిక, భాషాపరమయిన అన్ని అంశాలు తెలంగాణ ప్రాంతానికి ఉన్నాయని సూచించింది. కానీ ఈ ప్రాంత వనరుల మీద కన్నేసిన కోస్తాంధ్ర పాలకవర్గాలు, వ్యాపార, భూస్వామ్య, పారిశ్రామిక వర్గాలు తెలంగాణ ప్రాంతం ఒక రాష్ట్రంగా ఉండడానికి ఏమాత్రం ఒప్పుకోక ఈ ప్రాంత ప్రజల ఆకాంక్షలకు విరుద్ధంగా భాషాప్రయుక్త రాష్ట్రాల పేరుతో ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పరచారు. కేవలం తెలుగుభాష మాట్లాడే ప్రజలు మాత్రం ఆంధ్రప్రదేశ్‌గా వుండాలని కోస్తాంధ్ర పాలక వర్గం నిర్ణయించింది. తెలంగాణ, ఆంధ్ర, రాయలసీమ ప్రాంత ప్రజల సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, భాషలోని మాండలికం, ఆచారవ్యవహారాలను స్థూలంగా పరిశీలిస్తే ఈ మూడు ప్రాంతాలు భిన్నంగానే వున్నాయి. కేవలం ఈ ప్రాంతంలోని విశాల సంపదను కోస్తాంధ్రకు తరలించేందుకే ఈ కుట్ర జరిగిందనేది వాస్తవం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటు జరిగిన పన్నెండు సంవత్సరాలలో కోస్తాంధ్ర పాలకవర్గం చేస్తున్న దోపిడిని ప్రత్యక్షంగా అనుభవించిన తెలంగాణ ప్రజల కోపం కట్టలు తెంచుకొని (1968 నుండి 1971) తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు కావలసిందేనంటూ ఉద్యమించారు. ఈ ప్రాంత విద్యార్థి, యువజన, రైతాంగం, స్త్రీలు, మధ్యతరగతి ప్రజానీకం ఉప్పెనలా లేచింది. ఈ పోరాటం తెలంగాణ ప్రాంత పట్టణ, గ్రామాలలోని నడివీథులలో వీరోచితంగా నడుస్తున్న క్రమంలో ఉద్యమాన్ని అణచివేసేందుకు ప్రభుత్వం అనుసరించిన పాశవిక దాడి ఫలితంగా 370 మంది విద్యార్థి, యువజన, రైతాంగం అసువులు బాసారు. ఆ తర్వాత 1971లో జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో ఈ ఉద్యమానికి నాయకత్వం వహించిన దళారీ బూర్జువా పాలక వర్గం 'తెలంగాణ ప్రజాసమితి' పేరుతో ఎన్నికలలో పాల్గొనగా ఈ ప్రాంతంలోని మొత్తం పార్లమెంటుస్థానాలను బ్రహ్మాండమైన మెజారిటితో గెలుచుకోగలిగింది. కాసు బ్రహ్మానందారెడ్డి అనే కోస్తాంధ్ర భూస్వామి ముఖ్యమంత్రిగా వుండి, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమాన్ని పాశవికంగా అణచివేసి వందలాది పోరాటకారులను కాల్చిచంపినా, ప్రజలు ఎన్నికల రూపంలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్షను వెలిబుచ్చారు. ఈ ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేసిన బ్రహ్మానందరెడ్డి రాజీనామా చేయగా, తెలంగాణ ప్రాంత వ్యక్తి అయిన మాజీ ప్రధానమంత్రి పి.వి. నరసింహారావు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమకారుల శవాలమీద ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయ్యారు. తెలంగాణ ప్రజాసమితి పార్లమెంట్ సభ్యులు తెలంగాణ ఏర్పాటును గాలికొదిలి, తమ రాజకీయ అధికారం కొరకు కోస్తాంధ్ర పాలకవర్గానికి అమ్ముడుపోయి చెన్నారెడ్డి నాయకత్వంలో పరమనియంత అయిన ఇందిరా కాంగ్రెస్ పార్టీలోకి ఫిరాయించారు. ఈ ప్రాంత ప్రజల చిరకాలపు ఆకాంక్షయిన తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుపై నీళ్లు చల్లారు. తెలంగాణలోని ఉత్తర, దక్షిణ ప్రాంతాలు సాగునీరుకు నోచుకోక ప్రజలు కరువు, కాటకాలతో విలవిలలాడగా, కోస్తాంధ్ర ప్రాంతంలో మాత్రం తాము ఉపయోగించుకోనే నీరు ఉపయోగించుకుని, మిగతా నీరు సముద్రంలోకి వదిలివేసిన కోస్తాంధ్ర భూస్వామ్యవర్గం పంటలు సమృద్ధిగా పండించుకుంటున్నారు. కోస్తాంధ్ర వ్యవసాయంలో సిరులు పండుచుండగా, వస్తున్న ఆదాయాన్ని వ్యాపారరంగంలో పెట్టుబడులుగా పెట్టి కుబేరులయ్యారు.

గత ఐదు దశాబ్దాలుగా తెలంగాణ ప్రాంతానికి సాగునీరందించే చిన్న, మధ్యతరగతి, భారీ నీటి పథకాలు లేక వ్యవసాయం 'పడావు' పెట్టి వలసలుపోగా, మిగిలిన ప్రజానీకం కరువుతో అలమటిస్తున్నారు. తెలంగాణ ప్రజానీకంలో దాదాపు ఎనభైశాతం ప్రధానంగా వ్యవసాయం పైననే ఆధారపడి జీవిస్తుండగా, వారి నోట్లో మన్నుకొట్టిన దళారీ పాలకవర్గం నాటి కాకతీయుల, నిజాం పాలకుల సమయంలో నిర్మించిన చెరువులు, కుంటలు, కాలువల్లో కనీసం పూడికను కూడ తీయలేదు. నేటికీ తెలంగాణ ప్రాంతంలోని చిన్ననీటి వనరులయిన చెరువులు, కుంటలు, కాల్వలు పూడికతో నిండిపోయి వర్షాకాలంలో తొందరగా నిండిపోయి వాటి కట్టలు తెగుచుండగా, ప్రతి సంవత్సరం నవంబర్, డిసెంబర్‌ల నాటికి ఆయాగ్రామాల ప్రజలకు సాగునీరు మాట గాలికొదిలి, కనీసం తాగునీరు కూడ లభించడం లేదు. విద్య, వైద్యం, ఉద్యోగ, పారిశ్రామిక, వ్యాపారరంగాలలోని తెలంగాణ ప్రజలు దగాపడగా, హైదరాబాద్ నగరానికి, అలాగే సాగునీరు లభించే తెలంగాణ ప్రాంతంలోని కొన్ని ప్రాంతాలకు కోస్తాంధ్ర ప్రజల వలస పెరిగిపోయింది. హైదరాబాద్ నగరంలో ఒకప్పుడు మెజారిటీగా వున్న ముస్లిం మైనారిటీ ప్రజలు వర్తక, పారిశ్రామిక, చేతి వృత్తులు, చిన్న, చితక వ్యాపారాలు, ఇరాని హోటల్‌లు, నిర్మాణరంగాలలో తమ శ్రమను ధారపోస్తూ బతికేవారు. కాని కోస్తాంధ్ర ప్రజల వలస నగరానికి పెరిగిన తరువాత నేడు కేవలం కొన్ని రంగాలకే పరిమితమై, జీవన ప్రమాణాలు తరిగిపోయి బొంబాయి, దుబాయ్, సౌది అరేబియా లాంటి ప్రాంతాలకు వలసలు పోతుండగా, అక్కడ కూడ అంతర్జాతీయ పోలీసు వత్తిడి పెరిగిపోయి, ప్రతి ముస్లిం పౌరున్నీ తీవ్రవాదిగా ముద్రవేస్తూ నేరస్తులను చూసినట్లు చూస్తూ వారి జీవితాలు ఛిద్రం చేస్తున్నారు. అలాగే పనులులేక, మూడు పూటలు తిండి దొరకక ముస్లిం ప్రజలు నేడు తమ మైనారిటీ తీరని బాలికలను సౌది, దుబాయ్, ఓమన్, కువైట్‌లాంటి ప్రాంతాలలోని కురువృద్ధులకు ఇచ్చి పెళ్లిళ్లు చేయిస్తూ తమ జీవనం గడుపుతున్నారు. హైదరాబాద్ లో కోస్తాంధ్ర వలస వాదం పెరగడం వలన ఇక్కడి ముస్లిం జీవన పటం ఛిద్రం అయ్యింది. హైదరాబాద్ నగరం ఇలావుండగా, తెలంగాణ, ఆంధ్రప్రాంత పల్లెలకు, చిన్నచిన్న పట్టణాలకు మధ్య గతకొద్ది సంవత్సరాలుగా చాల తీవ్రమయిన అసమానతలు పెరిగిపోయాయి.

ఈ ప్రాంతంలో లభిస్తున్న బొగ్గు, నీరు, విద్యుత్, ఇతర వనరులు యథేచ్ఛగా ఆంధ్ర ప్రాంతానికి చెందిన పాలకవర్గాలకు, వారికి వెన్నుదన్నుగా వున్న భూస్వామ్య, వ్యాపార, పారిశ్రామిక వర్గాలకు ప్రధాన వనరులయ్యాయి. తెలంగాణలోని విద్య, వైద్యంకు సంబంధించిన రంగాలలో కూడ గణాంకాలు పరిశీలిస్తే ఈ ప్రాంతానికి జరిగిన అన్యాయం ఇట్టె తెలిసిపోతుంది. మొత్తం రాష్ట్ర జనాభాలో నలభై రెండు శాతంగా వున్న తెలంగాణ ప్రాంతం జనాభా ప్రాతిపదికగా ఈ ప్రాంతానికి దక్కాల్సిన వాటాలో కనీసం అరవై శాతం కూడ నేడు ఉద్యోగులు లేరు. ఎన్ని ప్రజా ఉద్యమాలు వచ్చినా ప్రభుత్వం ఈ ఉద్యమాలను ఖాతరు చేయకుండా తమ నరనరాన జీర్ణించుకున్న ఆంధ్ర ప్రాంత పక్షపాతాన్ని చాటుకుంటున్నది. ప్రపంచీకరణలో భాగంగా మన ప్రభుత్వాలు నూతన ఆర్థిక సంస్కరణల పేరుతో ప్రపంచ బ్యాంకు విధానాలను అమలుపరుస్తుండగా, సమాజంలో అసమానతలు విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఈ పదిహేను సంవత్సరాలకాలంలో తెలంగాణ, ఆంధ్రప్రాంత ప్రజల మౌలిక సమస్యల పరిష్కారంలో వ్యత్యాసం పెరిగి రెండు ప్రాంతాలకు విపరీతమైన తేడ వచ్చింది. తెలంగాణ ఎడారిగా మారుతుండగా, కోస్తాంధ్ర మరింత పచ్చబారుతూ మూడుపంటలు పండించుకునేందుకు, తొంభైశాతం భూమి సాగు చేసుకునే దిశగా ఉరకలేస్తున్నది.

1990 సంవత్సరం తరువాత మరల తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు అవసరం అనే భావన ప్రజలలోనానుతుండగా, ఇది కార్యరూపంగా అంటే ఉద్యమ రూపంగా 1997 నుండి బయట పడుతూ తెలంగాణ ప్రజల ఆకాంక్షగా రూపుదిద్దుకుంది. గత మూడు దశాబ్దాలుగా తెలంగాణ ప్రాంత ప్రజల జీవితంలో కలిసివున్న నక్సలైట్ ఉద్యమం, ప్రజలలో నిగూఢంగా ఉన్న తెలంగాణ ఆకాంక్షను తట్టి లేపింది. లక్షలాది ప్రజలు సభలు, సమావేశాలు పెట్టి తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకై వీధులలోకివచ్చి గొంతెత్తి అరిచారు. తెలంగాణ ప్రాంతంలో మళ్లీ ఉద్యమం ఊపు అందుకుని రాష్ట్ర ఏర్పాటు కోసం విద్యార్థులు, మేధావులు, ఉద్యోగులతో కూడిన వివిధ ప్రజాస్వామిక సంస్థలు ఏర్పడ్డాయి. ఈ సంస్థలు రాష్ట్ర సాధనే ఏకైక నినాదంగా, తెలంగాణ ప్రాంతంలోని వనరుల దోపిడిని అడ్డుకునే విధంగా ప్రజలను చైతన్యం చేయనారంభించాయి. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు నినాదమే కాక, ఈ ప్రాంతంలోని అన్ని రకాల దోపిడిని వ్యతిరేకిస్తూ సభలు, సమావేశాలు, వివిధ రూపాలలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు నినాదం ప్రతి పల్లెకు, ప్రతి గడపకు చేరుకునే విధంగా తమ ప్రయత్నాలు ప్రారంభించాయి. అధికారం కొరకు తెలంగాణ రాష్ట్ర సమస్యను ముందుకు తెచ్చి, అధికారం దక్కగానే రాష్ట్ర ఏర్పాటును గాలికొదిలేసే ఈ ప్రాంత పాలకవర్గ పార్టీలు మళ్లీ సహజంగానే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సమస్యను అందుకున్నాయి. వరంగల్ డిక్లరేషన్ పేరుతో 1997 డిసెంబర్ 30, 31వ తేదీలలో హన్మకొండలో జరిగిన పెద్ద బహిరంగసభ పాలక పార్టీలలో గుబులు రేపింది. అధికారానికి దూరంగావున్న కాంగ్రెస్, బి.జె.పి.లు తాము అధికారంలోకి వస్తే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు చేస్తామని ప్రకటించాయి. 1998లో కాకినాడలో జరిగిన బి.జె.పి. జాతీయ కార్యవర్గంలో 'ఒక్క ఓటు–రెండు రాష్ట్రాలు' అంటూ తీర్మానం చేసి, కేంద్రంలో తాము అధికారంలోకి వస్తే తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తామని ప్రకటించింది. అదే విధంగా తెలంగాణలోని కాంగ్రెస్ పార్టీ నాయకులు తమకు ప్రత్యేక తెలంగాణ ప్రాంతీయ పార్టీ కమిటీ కావాలని అధినాయకత్వానికి మొరపెట్టుకున్నారు. 1999 చివరలో జరిగిన ఎన్నికలలో కేంద్రంలో ఎన్.డి.ఎ. ప్రభుత్వం బి.జె.పి. సారథ్యంలో ఏర్పడింది. కాని, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఎజెండాలో లేదని ప్రకటించింది. అప్పటి రాష్ట్ర శాసనసభలో 90 మంది కాంగ్రెస్ ఎం.ఎల్.ఏ.లుండగా ఇందులోని దాదాపు 42 మంది తెలంగాణ ప్రాంత ఎం.ఎల్.ఏ. లు తమ ప్రత్యేక తెలంగాణ ప్రాంతీయ కాంగ్రెసు కమిటి (టి.ఆర్.సి.సి) ని ప్రకటించుకున్నారు. రాబోయే ఎన్నికలలో తమ పార్టీ అధికారంలోకి వస్తే బి.జె.పి. లాగ ప్రజలకిచ్చిన హామిని గాలికొదలకుండా తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తామని ప్రకటించారు నాటి కాంగ్రెస్ శాసనసభ

పార్టీ నాయకునిగా వున్న వై.ఎస్. రాజశేఖర్‌రెడ్డి, ఈ పరిణామాలను పరిశీలిస్తూ, తెలంగాణ ప్రాంత ప్రజల అభీష్ఠం మేరకు టి.ఆర్.సి.సి. నడుచుకుంటుందని ప్రకటించారు.

తెలంగాణ రాష్ట్ర సాధన కొరకు ఏర్పడిన తెలంగాణ జనసభ, తెలంగాణ మహాసభ, తెలంగాణ ఐక్యవేదికల్లాంటి సంస్థలు బలంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును ప్రచారం చేస్తూనే, తెలంగాణ రాష్ట్రం ఏర్పడినా పీడిత ప్రజల సమస్యలకు శాశ్వత పరిష్కారం లభించాలనే ఉద్దేశ్యంతో-భౌగోళిక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు మాత్రమే కాకుండా భూస్వామ్య, బహుళజాతి సంస్థల దోపిడిలేని, ప్రజల ప్రజాస్వామిక హక్కులు అమలుజరిగే ప్రజాస్వామిక తెలంగాణ కావాలని తమ పోరాటాన్ని ముమ్మరం చేశాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ప్రపంచబ్యాంక్‌కు తాకట్టుపెట్టిన చంద్రబాబు ప్రభుత్వం విస్తారంగా వనరులు కలిగిన తెలంగాణ ప్రాంతాన్ని, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల వనరులను బహుళజాతి సంస్థలకు, సామ్రాజ్యవాదులకు ధారాదత్తం చేయడానికి అనువుగా వున్న 'రాష్ట్రాన్ని రెండు రాష్ట్రాలుగా చేసే ప్రసక్తి లేదని' ప్రకటించింది. తెలంగాణ కొరకు పోరాడుతున్న సంస్థల నాయకులను, కార్యకర్తలను బుటకపు ఎదురుకాల్పులలో చంపడం, నక్సలైట్ ఉద్యమంతో ఈ సంస్థలకు సంబంధాలు అంటగట్టి, విచక్షణారహిత హింసను ఈ సంస్థల బాధ్యులమీద ప్రయోగించింది. ఈ సంస్థల నాయకులను పదుల సంఖ్యలో ఇండ్ల నుండి, పని చేసే స్థలాల దగ్గర నుండి ఎత్తుకెళ్లి ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చి చంపడంతో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర నినాదం మరింతగా ప్రజలలో మారుమోగింది. ప్రభుత్వం చేపట్టిన పాశవిక దాడి వలన తెలంగాణ రాష్ట్రం కొరకు పోరాడుతున్న ఈ సంస్థల నాయకత్వం నుండి అనివార్యంగా ఉద్యమం బూర్జువా నాయకుల చేతిలోకి వచ్చింది. ఈ సంస్థల ఉద్యమం కొంత మేరకు వెనక్కు తగ్గింది.

అప్పటికే రెండవసారి అధికారంలోకి వచ్చిన తెలుగుదేశం ప్రభుత్వంలో మంత్రి పదవి దక్కనందుకు అసంతృప్తితో రగులుతున్న కె. చంద్రశేఖరరావు తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు కొరకు తెలుగుదేశం పార్టీకి రాజీనామాచేసి, 2001 ఏప్రిల్‌లో తెలంగాణ రాష్ట్ర సమితిని ఏర్పాటు చేసి – జూన్‌లో వచ్చిన స్థానికసంస్థల ఎన్నికలలో పోటిచేసారు. ఈ ఎన్నికలలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు డిమాండ్‌ను అణగదొక్కేందుకు తెలుగు దేశం- బిజెపి పార్టీలు ప్రజలలో విపరీతమైన డబ్బు, మద్యం, కండబలం ఉపయోగించినా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కొరకు ఏర్పడిన తెరాసను, దానికి మద్దతువలికిన కాంగ్రెస్ పార్టీలను ఓడించలేకపోయాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు ద్వారా మాత్రమే ఈ ప్రాంత పలుదీర్ఘకాలిక సమస్యల పరిష్కారం అవుతాయని, తెలంగాణ రాష్ట్రం ఏర్పాటే తమ ఏకైక ధ్యేయమని ప్రకటించి అందుకోసం కలిసి వచ్చే ప్రతి వ్యక్తిని, శక్తిని కలుపుకోని రాష్ట్ర సాధన కొరకు పోరాడతామని ఆ పార్టీ అధ్యక్షుడు ప్రకటించాడు. అప్పటి బి.జె.పి. నాయకత్వంలోని ఎన్.డి.ఏ. ప్రభుత్వంలో చోటుదక్కని మెదక్ పార్లమెంట్ సభ్యుడు, ఆర్.ఎస్.ఎస్. సభ్యుడయిన కె. నరేంద్ర స్థాపించిన తెలంగాణ సాధన సమితిని తెలంగాణ రాష్ట్ర సమితిలో విలీనం చేసుకున్నాడు.

ప్రధానంగా ఈ ప్రాంతంలోని నక్సలైట్ పార్టీలు అయిన సి.పి.ఐ. (ఎం.ఎల్) (పీపుల్స్‌వార్), సి.పి.ఐ.(ఎం.ఎల్) జనశక్తి, ఇతర ఎం.ఎల్ పార్టీలు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు మీద తమ వైఖరి ప్రకటించాయి. వివిధ సందర్భాలలో ఏర్పడి రాష్ట్ర ఏర్పాటుకై పోరాడుతున్న సంస్థలకు తమ మద్దతు ప్రకటించి, ఆ ఉద్యమాలకు వెన్నుదన్నుగా వుండగా, తెలుగుదేశం, బి.జె.పి., సి.పి.ఐ., సి.పి.ఎం.లు తాము తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు వ్యతిరేకమని ప్రకటించాయి.

పార్లమెంట్, అసెంబ్లీ సీట్ల కొరకు కొన్ని పట్టువిడుపులకు పాల్పడిన కాంగ్రెస్, టి.ఆర్.ఎస్. ఐక్యకూటమి తాము కేంద్రంలో, రాష్ట్రంలో అధికారంలోకి వస్తే తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తామని ఎన్నికల బరిలోకి దిగాయి. తెలుగుదేశం, బి.జె.పి. కూటమిగా ఏర్పడినా బి.జె.పి. నయవంచనను ప్రజలు అర్థం చేసుకున్నారు. ఇక ఆ కూటమిలోని తెలుగుదేశం పార్టీకి ప్రజల నుండి మద్దతు లభించలేదు. మీడియా, పారిశ్రామిక, ఇతర దోపిడి వర్గాలు, ముఖ్యంగా కోస్తాంధ్ర దోపిడి వర్గాల మద్దతు పుష్కలంగా లభిస్తున్నదనే భ్రమలో పడిన తెలుగుదేశం ఎన్నికలలో సమైక్య రాష్ట్రం - నక్సల్ అణచివేత - సంస్కరణలను తమ పార్టీకి రెఫరెండమ్ అని ప్రకటించి ప్రజలలోకి పోయింది. కాని కనీస మద్దతు కూడ ఆకూటమికి లభించక పోగా, పూర్తిగా డీలాపడిపోయింది. మొత్తంగా తెలంగాణలో 107 అసెంబ్లీ సీట్లు, 16 పార్లమెంట్ సీట్లు వుంటే కేవలం 12 అసెంబ్లీ సీట్లు, 1 పార్లమెంట్ సీటు గెలుచుకుని తన నినాదాలను ప్రజలు తిరస్కరించటంతో ఆపార్టీల్లోని తెలంగాణ నాయకుల్లో అంతర్మధనం మొదలయ్యింది. కాంగ్రెస్-టి.ఆర్.ఎస్. కూటమికి విపరీతమయిన మద్దతు లభించింది. దాదాపుగా ఎనభై అయిదుశాతం సీట్లు గెలుచుకున్నది. ఎన్నికల ముందు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును పూర్తిగా సమర్ధిస్తూ, పల్లె, పల్లెకు పోయిన కాంగ్రెస్ పార్టీ, టి.ఆర్.ఎస్. కు కేంద్రంలోను, రాష్ట్రంలోను తనమంత్రివర్గంలో చోటు కల్పించింది.

అధికారం చేపట్టిన మూడునెలలోనే కాంగ్రెస్ పార్టీ తన వైఖరి మార్చుకున్నది. వెనుకబడిన ప్రాంతమయిన తెలంగాణ ప్రాంతానికి అధికనిధులు కెటాయించి తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ను ప్రజలలో లేకుండా చేస్తామని, గతంలో తెలుగుదేశం చేసిన ప్రచారాన్ని చేపట్టింది. అధికారంలోకి వచ్చిన నాటినుండే తెలంగాణ కాంగ్రెస్ నాయకత్వం మంత్రివర్గంలో చోటుకు, అభివృద్ధి పేర వస్తున్న ప్రపంచబ్యాంక్ నిధులు దక్కించుకునేందుకు గుంటనక్కల్లా కాచుకునే వున్నారు. ఎన్నికలముందు ప్రజలకిచ్చిన హామీలు మొత్తం విఫలం చేస్తున్న కాంగ్రెస్ పార్టీ నాయకత్వాన్ని కనీసం తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు, నక్సల్ ఉద్యమంతో చర్చలు, సంపూర్ణమద్య నిషేధం వంటి అతి ప్రధానమైన ఆకాంక్షలకు తూట్లు పొడిచి, ప్రపంచబ్యాంక్ కనుసన్నలలో ముందుకుపోతూ కోస్తాంధ్ర పాలకుల అభిరుచి, సామ్రాజ్యవాదుల ఆదేశాల మేరకు ప్రజా ఉద్యమాలపై విచక్షణా రహిత హింస కొనసాగిస్తూ, అధికారమే పరమావధిగా పాలన సాగిస్తున్నా, టి.ఆర్.సి.సి. నాయకులు ఇదేమిటని తమ నాయకత్వాన్ని ప్రశ్నించడంలేదు. ఇంకా ముందుకెళ్ళి ఈ ప్రభుత్వంలో తెలంగాణ అభివృద్ధి చెందుతున్నదని ప్రకటిస్తున్నారు.

అటు కేంద్రంలోను, ఇటు రాష్ట్రంలోను అధికారంలో చోటు సంపాదించుకున్న తెలంగాణ రాష్ట్రసమితి రాజశేఖరరెడ్డి నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం తెలంగాణ ప్రాంతానికి చేస్తున్న అన్యాయాన్ని ప్రశ్నించకుండా కేవలం యుపిఏ లో భాగస్వామ్యమని ప్రకటించుకుని ఈ ప్రాంత వనరులు యదేచ్ఛగా తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో కంటే కాంగ్రెస్ హయాంలోనే మరింత దోపిడీకి గురవుతున్నా, తెరాస ఏమి మాట్లాడలేదు. ప్రజల ఆకాంక్షలకు వ్యతిరేకంగా తెలంగాణ ప్రాంతంలో జరుగుతున్న రాజ్యహింస ప్రజాస్వామికవాదులను, మేధావులను తీవ్రమయిన ఆందోళనకు గురిచేసింది. ఈ సందర్భంలో తెరాస మీద ప్రజల వత్తిడి పెరిగిపోగా కాంగ్రెస్ ప్రభుత్వ వైఖరికి నిరసనగా రాష్ట్రంలో మంత్రివర్గం నుండి వైదొలగారు. యు.పి.ఏ. ప్రభుత్వం ఏర్పడిన తర్వాత తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కొరకు వేసిన మంత్రివర్గం ఉపసంఘం నివేదిక అతి త్వరలో రాబోతుందని, ఈ నివేదిక అందిన తర్వాత రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ మొదలవుతుందని తెరాస ప్రకటించింది. దేశంలోని వివిధ పార్టీల ఆధ్వర్యంలో వున్న యునైటెడ్ ప్రోగ్రెస్సివ్ అలయెన్స్ (యు.పి.ఏ) మద్దతుకొరకు తాము లాబీయింగ్ చేస్తున్నామని ప్రకటించి, కాంగ్రెస్ అధ్యక్షురాలు మీద పూర్తి నమ్మకం ప్రదర్శించుకున్నది. ప్రభుత్వం జలయజ్ఞం పేరుతో తెలంగాణ ప్రాంతానికి పూర్తిగా అన్యాయం చేయడం మొదలు పెట్టింది. కాంగ్రెస్ ప్రభుత్వం తెలంగాణ ప్రాంతాన్ని అన్ని రంగాలలో మోసం చేస్తూనే అభివృద్ధికి అంకితమవుతున్నామని గోబెల్స్ ప్రచారం మొదలు పెట్టింది. వాస్తవంగా తెలంగాణ ప్రాంతంలోని దీర్ఘకాలికంగా జరుగుతున్న వనరుల దోపిడీకి పునరంకితమయిన కాంగ్రెస్ పార్టీ గతంలో కృష్ణానదిమీద కట్టిన నాగార్జున సాగర్ ప్రాజెక్ట్, ప్రకాశం బ్యారేజిలద్వార కోస్తాంధ్రకు నీరందించి దక్షిణ తెలంగాణను ఎడారిగా మార్చారు. నేడు గోదావరి నదిమీద పోలవరం ప్రాజెక్ట్ కట్టి కోస్తాంధ్ర భూస్వామ్యవర్గానికి, బహుళజాతి సంస్థలకు నీరందించడం, లిఫ్టు ద్వారా రాయలసీమకు నీరందించడం లాంటి బృహత్ పథకాలను వేసి యుద్ధ ప్రాతిపదిక మీద పనులు ప్రారంభించింది. మొత్తం గోదావరి, కృష్ణానదులలో ఆంధ్రప్రదేశ్‌కు లభిస్తున్న నీరులో ఎనభై శాతం కోస్తాంధ్రకు తరలించేందుకు కాంగ్రెస్ ప్రభుత్వం కుట్రపన్నుతున్నది. తెలంగాణ ప్రాంతాన్ని ముంపుకు గురిచేసి, ఆంధ్రప్రాంతానికి నీరందించే పులిచింతల నిర్మాణం కూడా యుద్ధప్రాతిపదికగానే కొనసాగుతున్నది. ప్రతిపక్షంలో వుండగా 610 జి.వోను అమలు పరచాలని గోడవపెట్టిన కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన మరుక్షణం నుండి ఆ విషయం గూర్చి మాట్లాడడం మానేసింది. విద్య, వైద్య రంగాలలో తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయం గూర్చి మాట్లాడలేని స్థితికి ఇటు టి.ఆర్.సి.సి., అటు తెలంగాణ రాష్ట్ర సమితిలు చెరుకున్నాయి. ఫలితంగానే ప్రతిరంగంలో కోస్తాంధ్ర దోపిడి ఎక్కువయి పోయింది.

ఇంకొకవైపు తెలంగాణలోని నాలుగు జిల్లాల్లోవున్న అపారమైన బొగ్గు గనులలో పనిచేస్తున్న లక్షలాది మంది కార్మికుల పొట్టకొట్టి, ఆ పనులను ప్రైవేటీకరించి కోస్తాంధ్ర కాంట్రాక్టర్లకు దోచిపెట్టేందుకు కంకణం కట్టుకున్న తెలుగుదేశం ప్రభుత్వంలాగే కాంగ్రెస్ ప్రభుత్వం ప్రైవేటీకరణకు అంకురార్పణచేసింది. ఓపెన్‌కాస్ట్ గనులపేర గ్రామాలకు, గ్రామాలు ఖాళీ చేయించి లక్షలాది ఆదివాసీ, ఆదివాసేతర ప్రజలను నిర్వాసితులను చేస్తున్నది. హైదరాబాద్ నగరాన్ని, దాని చుట్టుపక్కల ప్రాంతాలయిన రంగారెడ్డి, మహబూబ్‌నగర్, నల్లగొండ, మెదక్ జిల్లాలను కోస్తాంధ్ర పారిశ్రామిక వర్గాలకు కబ్జానిచ్చిన గత, నేటి ప్రభుత్వాలు అక్కడ వున్న బీద, బిక్కి జనాన్ని తరిమికొడుతూ ఆ ప్రజల జీవితాలతో ఆడుకుంటున్నాయి.

తెలంగాణ ప్రాంతంలోని ప్రతి పల్లెకు కోస్తాంధ్ర చేస్తున్న అన్యాయం తెలుస్తున్న నేపథ్యంలో ప్రజా ఉద్యమాల, వివిధ నక్సలైట్ పార్టీల వత్తిడి పెరుగుతుంటే కూడ తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయలైన పోలవరం, పులిచింతల, రింగ్‌రోడ్డు నిర్మాణాలను అడ్డుకోకపోవడం, జి.వో 610ని అమలు పర్చడం, సింగరేణి ప్రైవేటీకరణ జరగకుండ అడ్డుకోకపోవడం, రైతుల-కార్మికుల ఆత్మహత్యల గూర్చి పట్టించుకోకపోవడం, మిగతా పాలక పార్టీలలాగే అధికారం అనుభవిస్తూ లాబీయింగ్ ద్వారా మాత్రమే తెలంగాణ రాష్ట్రం ఏర్పడుతుందని ఆ లాబీయింగే తాము చేస్తున్నామని,కోస్తాంధ్ర, వై.ఎస్.లాబీకి తలఒగ్గకుండా సోనియా తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తుందని ప్రజలను భ్రమింపచేసి తెలంగాణ రాష్ట్ర సమితి తన ప్రాథమిక లక్ష్యాన్ని కూడ మరచిపోయింది.

దేశంలోని వివిధ ప్రాంతాల పాలక పార్టీలు తెలంగాణ ప్రాంతానికి మద్దతు పలుకుతున్నాయని, క్షేత్రస్థాయిలో ఉద్యమం అవసరంలేదని భావించిన తె.రా.స. ప్రతిజిల్లాలో అంతకుముందున్న తన నిర్మాణాన్ని రద్దుచేసుకున్నది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గూర్చి అభిలాషవున్న కొన్ని శక్తులు అధినాయకత్వం అనుసరిస్తున్న వైఖరికి నిరసనగా వివిధ ప్రజా ఉద్యమాలలో చేరగా, మిగతా అవకాశవాదశక్తులు ఇతర పాలకవర్గ పార్టీలలో చేరిపోయారు. గత రెండు సంవత్సరాల తె.రా.స కార్యచరణ వలన ప్రజలలో ఆ పార్టీకి విశ్వాసం లేకుండ పోయింది. మరొకసారి మోసపోతున్నామని ప్రజలు గ్రహించారు. ఈ పరిణామాలలో మున్సిపాలిటి, స్థానిక సంస్థల ఎన్నికలు రాగ ఆ ఎన్నికలలో తెరాస ఘోరంగా ఓడిపోయింది. తెరాస ఓడిపోయింది కాబట్టి, ప్రజలలో తెలంగాణ రాష్ట్ర డిమాండ్ సన్నగిల్లిందని కాంగ్రెస్ ప్రభుత్వం ప్రచారం జోరు అందుకున్నది. మళ్లీ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సమస్య ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుండగా, గతంలో ఈ ప్రాంతానికి జరిగిన అన్యాయానికి కొనసాగింపుగా మరింత అన్యాయానికి నేడు గురవుతున్నదని ప్రజలు, ప్రజాస్వామికవాదులు ఐక్య పోరాటాలతో ఉద్యమం కొనసాగిస్తున్న తరుణంలో తన అస్తిత్వానికి ముప్పు వస్తుందని గ్రహించిన తెరాస అధినాయకత్వం కేంద్రమంత్రివర్గం నుండి రాజీనామా చేశారు. రాజీనామా చేసిన మరుక్షణమే మళ్లీ ఎన్నికలొస్తే తెలంగాణలో అన్నిసీట్లు గెలుచుకుంటామని ప్రకటించారు. కె.సి.ఆర్. లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామాచేసి, తెలంగాణ సెంటిమెంట్‌ను కరీంనగర్ లోక్‌సభ స్థానం ఉపఎన్నికతో ముడిపెట్టిన తెరాస తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు, తెలంగాణ ప్రాంతంలో అన్యాయానికి ఎన్నికలకు ముడిపెడుతున్న ప్రక్రియకు ఇప్పటికైనా ముంగింపు పలకాల్సిన అవసరం ఉంది. ఈ ప్రాంత వనరుల దోపిడీకి వ్యతిరేకంగా, రాష్ట్ర ఏర్పాటు సాధనకు విశాల ప్రజానీకాన్ని కలుపుకొని ఉద్యమం చేయాల్సిన తక్షణ అవసరం తెలంగాణ రాష్ట్ర సమితికేకాక ఈ ప్రాంతంలోని ప్రతి పౌరునికి,

మేధావికి, ప్రజాస్వామికవాదికి, ఉద్యోగికి, రైతుకు, వ్యాపార, పారిశ్రామిక వర్గాలకు, ప్రజాప్రతినిధులకున్నది. గత యాభై సంవత్సరాలుగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కొరకు జరిగిన పోరాటమంతా ప్రజాపునాదితో త్యాగాలతో జరుగగా, అధికారం కొరకు దళారీబూర్జువా పాలకవర్గం ఆ ఉద్యమాలను హైజాక్ చేసి తమ పబ్బంగడుపుకోవడమే జరిగింది. ప్రజల త్యాగాల వలన వీరుగద్దెనెక్కి కోస్తాంధ్ర పాలక వర్గానికి దాసోహంగా మారడమే జరిగిందే తప్ప,ఈ ప్రాంత వనరులు దోపిడీకి గురికాకుండా అడ్డుకోలేదు. రాష్ట్ర ఏర్పాటుకు త్యాగంతో ముందుకుపోలేదు.

ఇప్పటికైనా తెలంగాణ రాష్ట్ర వనరుల దోపిడీని అడ్డుకునేందుకు, రాష్ట్ర ఏర్పాటు కొరకు పాలక పార్టీల, పార్లమెంటరీ రాజకీయాలకతీతంగా విశాలమైన, విస్తృతమైన ఉద్యమం నిర్మించాలి : పాలకవర్గ పార్టీలన్నీ కోస్తాంధ్రపాలకవర్గాలు, పారిశ్రామిక వర్గాలు, వ్యాపారవర్గాలు తమమీద పెట్టుకున్న ఆశలను వమ్ముచేయడం లేదు. ఆ వర్గాలకు నమ్మకంగా సేవ చేయడమే తమ విధిగా పెట్టుకుని తెలంగాణ ప్రాంత ప్రజలకు అన్యాయం చేస్తున్నారు. పాలకవర్గ పార్టీల గత చరిత్రను దృష్టిలో పెట్టుకుని పార్లమెంటరీ రాజకీయ పార్టీలకు అతీతంగా ఉద్యమాన్ని నిర్మించాలి.

ఉద్యమరూపాలు ఎన్నుకునే ముందు ప్రజలందరికీ తెలంగాణ ప్రాంతానికి జరిగిన అన్యాయాన్ని గ్రామ, గ్రామాన సభలు, సమావేశాలు పెట్టి వివరించాలి. గ్రామ, గ్రామానికి ఉద్యమం చేరేముందు ప్రాంతాల, జిల్లాల వారిగా సదస్సులు, సభలకు ప్రజలను కదిలించాలి. ప్రతి సదస్సు, సభలలో సాంస్కృతిక కార్యక్రమలతో తెలంగాణకు జరుగుచున్న అన్యాయాన్ని, ప్రాజెక్టుల ద్వారా లక్షలాది ఆదివాసులు మునిగిపోతున్న విధానాన్ని, ఉద్యోగ, పారిశ్రామిక రంగంలో, ఇతర రంగాలలో జరుగుతున్న వివక్షను పాటలు, నాటికలు, వివిధ కళారూపాల ద్వారా వివరించాలి. పోలవరం, పులిచింతల, పోతిరెడ్డిపాడు హెడ్‌రెగ్యులేటర్ నిర్మాణాలు ఆగకపోతే తెలంగాణ మొత్తం ఎలా ఎడారిగా మారబోతుందో ప్రజలకు అర్థం చేయించాలి. సింగరేణి ప్రైవేటీకరణ ఆగకపోతే ఉత్తర తెలంగాణలోని కార్మిక వర్గం తమ బతుకుదెరువు ఏ విధంగా కోల్పోతారో తెలియచేయాలి. రింగ్‌రోడ్డు నిర్మాణం, హైదరాబాద్ నగరంలో ఆంధ్రవలసవాదం సృష్టిస్తున్న విధ్వంసం ఆగకపోతే హైదరాబాద్ చుట్టు పక్కల వున్న పల్లె ప్రాంతాలు బహుళజాతి సంస్థల పాలవుతాయని, నగరంలోని ముస్లిం జనాభాజీవితం మరింత విధ్వంసానికి గురవుతుందని చెప్పాలి. తెలంగాణ ప్రాంతంలో జరిగిన, జరుగుతున్న పోరాటాలను విశ్లేషించి నిర్లిప్తత, నిరాశగావున్న సెక్షన్‌కు కూడా అర్థం చేయించి పోరాటంలో భాగం చేయాలి.

ఉద్యమం ఎన్నుకునే పోరాట రూపాలు: ప్రథమ దశలో సదస్సులు, సభల ద్వారా, నిజాయితీ గల, పటిష్టమైన నాయకత్వాన్ని రాష్ట్రస్థాయిలో దాదాపు వంద నుండి నూటయాభై మంది వరకు ఉద్యమాకారులను పూర్తికాలం పనిచేసే విధంగా నిర్మాణాలలోకి తెచ్చుకోవాలి. మొదటి దశలో మండల స్థాయి నుండి రాష్ట్రస్థాయి వరకు విశాల ప్రజానీకాన్ని కలుపుకొని కమిటీలు వేయాలి. రెండవ దశలో గ్రామస్థాయి వరకు కమిటీలు వేయాలి. ఈ కమిటీలు తెలంగాణలో జరుగుతున్న కోస్తాంధ్ర దోపిడీకి వ్యతిరేకంగా చివర వరకు పోరాడుతామని ప్రతిజ్ఞ చేయించాలి. ఈ నాయకత్వం ఆధ్వర్యంలో ప్రజలు విస్తృతంగా ఉద్యమంలో పాల్గొనే స్థాయి వచ్చిన తరువాత, న్యాయమైన జలపంపిణీ, భూమి పంపిణి, ఇతర వనరుల పంపిణీ, 610 జి.వో. అమలుకోసం ర్యాలీలు జిల్లాస్థాయి, మండలస్థాయిలలో జరగాలి. అటు తరువాత రోడ్డు రోకో, రైలురోకోలలో విస్తృతంగా ప్రజలు పాల్గొనేటట్లు ఏర్పాటు చేసుకోవాలి. అటుతరువాత ఎవరైతే తెలంగాణాను ఉద్దేశపూర్వకంగా వ్యతిరేకిస్తున్నారో వారి ఆస్తులమీద, వారి ఆర్థిక కార్యకలాపాలను స్థంభింపచేసేందుకు వివిధ పోరాట రూపాలు ఏర్పాటుచేసుకుని ముందుకు పోవాలి. తెలంగాణ వనరుల దోపిడిలో భాగంగా నిర్మాణం జరుగుతున్న నీటి, గనుల ప్రాజెక్టుల దగ్గరకు పోయి ఆ నిర్మాణాలు ఆపాలి. ప్రభుత్వ కార్యాకలాపాలను అడ్డుకోవాలి. తెలంగాణ ప్రాంతాన్ని ఆర్థిక దిగ్బంధం చేయాలి. ఈ ఉద్యమంలోన అన్ని రాజకీయ పార్టీల కార్యకర్తలను, నాయకులను కలుపుకునేందుకు ప్రయత్నించాలి. వారందరూ ఉద్యమంలో పాల్గొనేటట్లు చేయాలి. అలాగే ఈ కార్యక్రమాలు నిర్ణయించి అమలు జరిగేటపుడు కావలసిన ఆర్థిక, ఇతర ఏర్పాట్లు పూర్తిగా ప్రజల నుండి సేకరించుకోవాలి.. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయకుంటే మేము తెలంగాణా వీధులల్లో తిరగలేం అనే స్థాయికి పాలకవర్గాలు దిగిరావాలి. ప్రజా ఉద్యమం విస్తృత స్థాయికి చేరుకున్నపుడు అనివార్యంగా పాలకవర్గం రాష్ట్ర అసెంబ్లీలో తీర్మానం చేస్తుంది. ఆ తీర్మానం ద్వారా కేంద్ర ప్రభుత్వం తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేస్తుంది. అలాగే ఈ సుదీర్ఘ ప్రక్రియకు కొంతకాలం పడుతుంది. ఆకాలం సంవత్సరం కావచ్చు, రెండు సంవత్సరాలు కావచ్చు. పది సంవత్సరాలు కావచ్చు. అందుకు ఉద్యమ నాయకత్వం ఓపికగా ఉద్యమస్థాయిని పెంచి, ఉద్యమంలో వచ్చే ఎన్నో రకాలయిన ధోరణులను సామరస్య పూర్వకంగా పరిష్కరించుకుని ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి. అపుడు మాత్రమే తెలంగాణ రాష్ట్ర వనరుల దోపిడి ఆగడం, అంతిమంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సాధ్యం అవుతుంది. ◆

# ఐదేళ్ల డిగ్రీ కోర్సు ఎవరికోసం?

- స్ఫూర్తి

2005 డిసెంబర్ నెల.... నాలుగేళ్ల డిగ్రీ కోర్సు ప్రవేశపెట్టాలని వీసీల సమావేశం నిర్ణయం...

2006 జూన్ 3 : మూడు సంవత్సరాలు, రెండేళ్ల పిజి కలిపి ఐదేళ్ల డిగ్రీ కోర్సును 'గురుకులం' పేరుతో ప్రవేశపెట్టాలని వీసీల సమావేశం నిర్ణయం... అవసరం అయితే మూడు సంవత్సరాలలో విరమించుకునే వారికి సాధారణ డిగ్రీ పట్టాను, నాలుగు సంవత్సరాలలో విరమించుకునే వారికి ఆనర్స్ డిగ్రీని ప్రదానం చేస్తామని ప్రకటన.

2006 జూలై మొదటివారం : ఐదు సంవత్సరాలు తప్పకుండా చదవాలి, ప్రపంచంలో ఎక్కడా ఐదేళ్ల డిగ్రీని మధ్యలో విరమించుకునేందుకు అనుమతించడం లేదు. ప్రస్తుతం విద్యాసంవత్సరంలో ఇందుకోసం ప్రత్యేక ప్రవేశపరీక్ష ఉంటుంది. వచ్చే సంవత్సరం నుంచి ఎంసెట్ పరీక్షలో వచ్చిన ర్యాంకు ఆధారంగానే దీనిలోనూ ప్రవేశముంటుంది.

ఇలాంటి వేరు వేరు ప్రకటనలు చేసింది వేరు వేరు సంస్థలు కానీ, ఒకదానికొకటి సంబంధంలేని సమావేశాలు కానీ కావు. పై మూడూ ఉన్నత విద్యామండలి అధ్యక్షతన జరిగిన సమావేశాలే.... మూడూ ఉన్నత విద్యామండలి చేసిన ప్రకటనలే. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మన విద్యారంగం మరడంలేదని, అందుకే డిగ్రీలు పనికిమాలినవిగా మారిపోతున్నాయని, మన విద్యావ్యవస్థ నైపుణ్యాలను అందించటంలేదని, తద్వారా నిపుణుల కొరత ఏర్పడుతోందని ఇలా సవాలక్ష సమస్యలను నిరంతరం ప్రస్తావిస్తూ.... ఉన్నత విద్యారంగాన్ని సంస్కరించాలని ప్రయత్నిస్తున్న ఉన్నత విద్యామండలికే వీటిపట్ల సరియైన అవగాహన, దీర్ఘదృష్టి లేవని దాని భిన్న ప్రకటనలే తెలుపుతున్నాయి. నిజంగా విద్యావ్యవస్థను సంస్కరించాలని చిత్తశుద్ధి ఉంటే విద్యార్థులతో, ఉపాధ్యాయులతో, విద్యార్థి సంఘాలు, మేధావులతో మొదట చర్చలు జరిపి, మన విద్యావ్యవస్థను పట్టిపీడిస్తున్న సమస్యలను సంస్కరించే పని నిజంగా ఉన్నత విద్యామండలి చేయదలిస్తే అంతకన్నా విద్యావేత్తలకు, తల్లితండ్రులకు కావాల్సిందేముంటుంది? ఇంత హడావుడిగా ఎందుకు ఈ సంస్కరణలకు ఉన్నత విద్యామండలి పూనుకుంటున్నట్టు? అసలు యూనివర్సిటీల స్వయంప్రతిపత్తికి భంగం కలిగించే విధంగా ప్రతీ విధాన నిర్ణయాలలో మండలి జోక్యం చేసుకోవాల్సిన అవసరం ఏమొచ్చింది?

ఐదేళ్ల డిగ్రీని ప్రవేశపెట్టాలని నిర్ణయిస్తూ.. ఇందుకు గల కొన్ని కారణాలను ఉన్నత విద్యామండలి పేర్కొంటున్నది. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా మన విద్యావ్యవస్థ మారటం లేదని, తద్వారా నిపుణుల కొరత ఏర్పడుతున్నదని, ప్రపంచీకరణ పరిస్థితులలో అంతర్జాతీయంగా వస్తున్న అవకాశాలను అందిపుచ్చుకునేందుకు ఉన్నత విద్యారంగంలో సంస్కరణలు అనివార్యం అనేది ప్రభుత్వ వాదన. మన విద్యావ్యవస్థ మారాలని చాలాకాలంగా విద్యాభిమానులు, విద్యావేత్తలు, విద్యార్థి సంఘాలు కోరుతున్నాయి. ఇందుకోసం ఉద్యమిస్తున్నారు. అయితే ఇక్కడ సమస్యంతా ఈ పరిస్థితులను మార్చేందుకు ప్రభుత్వం ఎన్నుకుంటున్న విధానాలు, అనుసరిస్తున్న పద్ధతుల గురించే! ఇవి మరింతగా విద్యావ్యవస్థను,అకడమిక్ వాతావరణాన్ని దెబ్బతీస్తున్నాయనేదే ప్రజాస్వామిక, విద్యావేత్తల, సంఘాల ఆందోళన.

మన విద్యావ్యవస్థ సక్రమంగా లేదనేది వాస్తవమే. అయితే దీనిని సంస్కరించాలనుకుంటున్నప్పుడు ముందుగా విస్తృతంగా చర్చ జరపాల్సిన అవసరం ఉంది. అయితే ఈ పనేది ప్రభుత్వం చేయటం లేదు. ఇక్కడే ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించాల్సి వస్తోంది. ఎందుకంటే ఈ చర్చ లోతుల్లోకి వెళితే విద్యారంగానికి తగ్గుతున్న ప్రభుత్వ కేటాయింపులు, ఉపాధ్యాయుల, మౌలిక సదుపాయాల కొరత, కార్పొరేట్, ప్రైవేట్ విద్యాసంస్థలను అనుమతించడం, తద్వారా విద్యారంగాన్ని ప్రైవేట్ పరం చేయదల్చుకున్న ప్రభుత్వ కుటిలనీతి ముందుకు వస్తుందనే భయం. అందుకే ప్రభుత్వం విస్తృత చర్చలకు సిద్ధపడటం లేదని భావించాల్సి వస్తోంది. దీనిని కప్పిపుచ్చుకునేందుకు ఆదరాబాదరాగా ప్రకటనలు చేయడం, కొన్ని రోజులు అయిన తర్వాత మళ్లీ కొత్త ప్రకటనలు... ఇలా ప్రభుత్వం ఇష్టారాజ్యంగా, ప్రజలను ఆందోళనకు గురిచేసే విధంగా ప్రయత్నిస్తున్నది తప్ప, నిజంగా సమస్య పరిష్కారదిశగా అడుగులు వేయడం లేదు. ఐదేళ్ల డిగ్రీకి సంబంధించిన సమాచారమేదీ యూనివర్శిటీలకు తెలియడం లేదు. వాటి పాఠ్యాంశాల రూపకల్పనలో సంబంధిత ప్రొఫెసర్ల పాత్ర కూడా ఉండటం లేదు. నిజంగా విద్యారంగాన్ని సంస్కరించాలని ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉంటే ముందుగా పాఠ్యాంశాల ప్రాథమిక విద్యను బలోపేతం చేస్తూ.... విద్యారంగానికి నిధులను పెంచి, స్థానిక అవసరాలకు అనుగుణంగా పాఠ్యాంశాల తయారీ తదితర చర్యలను తీసుకోవాల్సిన అవసరం ఉంది. ఇప్పటికే సరిపోయినంత మంది లెక్చరర్లు లేక, సౌకర్యాలు లేక డిగ్రీ కాలేజీలు సతమతమవుతున్నాయి. ఇలాంటి పరిస్థితిని ఏ మాత్రం మార్చకుండా ఉన్న వసతిలోనే ఐదేళ్ల డిగ్రీకోర్సు ప్రవేశపెడితే పరిస్థితి ఎలా వుంటుందో ఊహించవచ్చు. ఐదేళ్ల డిగ్రీ ఆడపిల్లలను చదివించేందుకు అసలు చాల కుటుంబాలు ముందుకు వచ్చే పరిస్థితి ఉండదు. వీటన్నింటిని ముందుగా చర్చించకుండా హడావుడిగా ఐదేళ్ల డిగ్రీ కోర్సును ప్రభుత్వం పెట్టాలనుకోవడం కొండనాలుకకు మందేస్తే ఉన్న నాలుక ఊడిందన్న సామెత గుర్తొస్తున్నది.

ఐదేళ్ల డిగ్రీ విద్యావిధానంలో ప్రవేశపెట్టే కోర్సులన్నీ సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సులే కావడం గమనార్హం. ఒక్కో ఏడాది ఫీజు సుమారు 12 వేల పైమాటే. అంటే వీటిని సాధారణ విద్యార్థులు అభ్యసించలేరు. ఇప్పటికే ఉన్నత విద్యను కేవలం 8 శాతం మంది మాత్రమే అభ్యసిస్తున్నారు. ఈ శాతాన్ని మరింత పెంచాలంటే ఉన్నతవిద్యను పేద విద్యార్థుల దరికి చేరేలా చర్యలు చేపట్టాలి. తద్భిన్నంగా ప్రభుత్వం వ్యవహరించడం

# పాలకుల 'అభివృద్ధి' అందని చెంచుల జీవన విధానం

– పాణి

చెంచుల కోసం ఇంతవరకు ప్రభుత్వాలు చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాల్లో వ్యవసాయం, గృహ నిర్మాణం, విద్య, వైద్యాలు ప్రధానమైనవి. నిజానికివి అభివృద్ధి చట్రంలో విధిగా ఉండాల్సిన అంశాలే. చెంచుల గురించి బ్రిటీష్ పాలకులైనా, నిజాం ప్రభుత్వమైనా 1947 తరువాత వచ్చిన అన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలైనా వీటిమీదనే ప్రధానంగా కేంద్రీకరించాయి. ఈ వివరాలు తెలుసుకోవడం చాలా తేలికే గానీ, వీటి అమలు క్రమంలో ఎదురైన అనుభవాలు ముఖ్యంగా చెంచుల ప్రతిస్పందనను, వాళ్ల జీవితాల్లో తలెత్తిన వైపరీత్యాలను అర్థం చేసుకోవడం అంత సులభమేమీ కాదు. దేనికంటే ప్రభుత్వాలు అభివృద్ధి కార్యక్రమాలుగా భావించి అమలు చేసిన ప్రణాళికలు, వాటిని రూపొందించడానికి స్ఫూర్తిగా నిలిచిన అభివృద్ధి నిర్వచనాలు అన్నీ చెంచుల దగ్గర విఫలమౌతూ వచ్చాయి.

ఈ సమస్య ఆదివాసీ తెగలన్నింటి విషయంలో ఉండేదే అయినా చెంచుల దగ్గర మరింత క్లిష్టంగా, నగ్నంగా బయటపడింది. కొంచెం వెనుక్కు వెళ్లితే 1882లో మద్రాసు ప్రభుత్వం అటవీ చట్టం తీసుకొచ్చాక, అధికారులు మొట్టమొదటిసారి చెంచులవద్దకెళ్లినట్లు బ్రిటీష్ మాన్యువల్స్ చెప్తాయి. ఒక రకంగా అప్పటిదాకా చెంచులకు, బైటి సమాజానికి, రాజ్యానికి మధ్య దాదాపుగా సంబంధాలు లేనట్టే. ఉన్నా ప్రభావాలు ఉండకపోవచ్చని నమ్మవచ్చు. ఈ స్థితి మద్రాసు ప్రభుత్వం కిందనున్న గుంటూరు, ప్రకాశం, కర్నూలు జిల్లాల అటవీ ప్రాంతంలో ఉంటే 1894లో నైజాం పాలకులు ఫారెస్టు రిజర్వ్ చట్టం తీసుకొచ్చారు. ఇంచుమించు ఒకేసారి నల్లమల చెంచులవద్దకు ప్రభుత్వాలు వెళ్లాయి.

దీనివల్ల అంతకుముందు చెంచుల జీవనశైలిలో ఏ మార్పులు చోటు చేసుకున్నాయో చెప్పడం చాలా కష్టం. ప్రభుత్వ రికార్డుల మీద హెమెన్‌డార్ఫ్, వెన్నెలకంటి రాఘవయ్యవంటి వారి రచనలపై ఆధారపడి కొన్ని విశ్లేషణలు ఇవ్వొచ్చు. అయితే ఒక్కమాట మాత్రం స్పష్టంగా చెప్పవచ్చు. అప్పటినుండి ప్రభుత్వం చెంచుల సంక్షేమం కోసం అనేక రకాల చర్యలు చేపట్టింది.

ఉదాహరణకు 1880లలోనే అటవీ అధికారుల మీద చెంచులు తిరగబడ్డంవల్ల అటవీ ఉత్పత్తులు సేకరించుకునే హక్కును ప్రభుత్వం చెంచులకు ప్రసాదించింది. తరతరాలుగా అడవిలో స్వేచ్ఛా జీవనం సాగిస్తూ ఆహార సేకరణమీద, అటవీ ఫలసాయాన్ని సేకరించుకోవడం

---

శోచనీయం. ఇంతింత ఫీజులను చెల్లించలేక పేద, మధ్యతరగతి విద్యార్థులు మరింతగా ఉన్నత విద్యకు దూరం చేయబడతారు. ప్రస్తుతం ఉన్న సమస్యను పరిష్కరించే బదులుగా మరో కొత్త సమస్యను సృష్టించనుంది.

విద్యాసంస్థలపై రాజకీయ జోక్యం పెరగడం, వాటి స్వయం ప్రతిపత్తిని దెబ్బతీసే ప్రయత్నం జరుగుతోంది. యూనివర్శిటీల స్వయం ప్రతిపత్తిని దెబ్బతీసే విధంగా ఇవాళ ఉన్నత విద్యామండలి ప్రవర్తిస్తోంది. ప్రభుత్వ విధానాలను డైరెక్టుగా విశ్వవిద్యాలయాలపై రుద్దుతున్నది. ఆయా పరిస్థితులకు అనుగుణంగా విశ్వవిద్యాలయాలు సిలబస్ తయారీ మొదలుకొని కోర్సుల చేర్పు వరకు ప్రతీ విషయంలో ఉన్నత విద్యామండలి జోక్యం చేసుకుంటోంది. గాట్స్ ఒప్పందం మేరకు ఉన్నత విద్యారంగాన్ని బహుళజాతి సంస్థలకు అప్పగించాలనే ప్రభుత్వ కుట్రకు మండలి పావుగా ఉపయోగపడుతోంది. అందుకే తనకు నమ్మినబంటు, బంధువు అయిన వ్యక్తినే ముఖ్యమంత్రి దీనికి ఛైర్మన్‌గా నియమించుకున్నారు.

నిపుణుల కొరత ఉంటుందని ప్రభుత్వం వాదిస్తోంది. ఇంతకీ నిపుణులు అంటే ఎవరు? భారతదేశం వ్యవసాయక దేశం. మన వ్యవసాయరంగంలో సంక్షోభం నెలకొని ఉంది. వేల సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. చిన్నతరహా పరిశ్రమలు మూతపడుతున్నాయి. అదేవిధంగా పారిశ్రామికరంగంలోనూ స్తబ్దత నెలకొని ఉంది. వీటిని పరిష్కరించే నిపుణులు కావాలనుకుంటే దీనికనుగుణంగా పాఠ్యాంశాలు, కోర్సుల రూపకల్పన చేస్తే సరిపోతుంది. కానీ ప్రభుత్వ ఉద్దేశ్యం అదికాదు. కార్పొరేట్, బహుళజాతి సంస్థల్లో పనిచేసే ఉద్యోగులనే ఇక్కడ నిపుణులని అంటోంది. ఈ సంస్థలు నిపుణుల(?) కొరతను ఎదుర్కొంటున్నాయి. ఇక్కడ నిపుణులు అంటే డాటా ఆపరేటర్లే. కాబట్టి ఇందుకు అనుగుణంగా విద్యావ్యవస్థలో మార్పులు చేసి, వాటికి అవసరమైన డాటా ఆపరేటర్లను తయారుచేసే ఉద్దేశ్యంతోనే ప్రభుత్వం కొత్త కోర్సుల రూపకల్పన చేస్తోంది.

గాట్స్ ఒప్పందంలో విద్యను చేర్చేందుకు ప్రభుత్వం అంగీకారం తెలిపింది. కేంద్రప్రభుత్వం 'విదేశీయూనివర్శిటీల' వచ్చే సంవత్సరం మార్చినెలలో బిల్లును తేబోతుంది. అంతలోపే ఇక్కడి ప్రభుత్వ, ఎయిడెడ్ విద్యను నాశనం చేసేందుకు గవర్నమెంట్ కంకణం కట్టుకుంది. వాటికి నిధులను నిలిపివేయడం, స్కాలర్‌షిప్‌లకు ఎగనామం, సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సుల సంఖ్య పెంచడం తదితర చర్యలను తీసుకుంటోంది. ప్రతి ఏటా విద్యారంగానికి నిధుల కేటాయింపులు తగ్గుతున్నాయి. ఎయిడెడ్ విద్య అవసరం లేదని ప్రభుత్వమే స్వయంగా ప్రకటించింది. విద్యార్థులను ఇక్కడి ప్రభుత్వ, ఎయిడెడ్ విద్యాసంస్థలకు దూరం చేసి రానున్న విదేశీ యూనివర్శిటీలల్లో చేరే విధంగా ప్రభుత్వం ఒక వాతావరణాన్ని సృష్టించదలచుకుందని అర్థమవుతోంది. విదేశీ యూనివర్శిటీలలో పరిశోధన కోర్సులకు ప్రాధాన్యత ఉంటుంది. అందువల్ల వాటికి విద్యార్థులను సరఫరా చేసే పనిని ఇప్పుడు ప్రారంభించిందన్నమాట. అంటే భవిష్యత్తులో రాబోయే ప్రైవేట్ యూనివర్శిటీల కోసం ప్రభుత్వం ఇప్పటి నుంచే భూమికను సిద్ధం చేస్తోంది. ఈ ప్రయోగానికి మన రాష్ట్రం ముందంజలో ఉండటం మరీ సిగ్గుచేటు ! ◆

మీద ఆధారపడిన చెంచులకు కొత్తగా ప్రభుత్వం దాన్నొక 'హక్కుగా' ఇచ్చింది. అటవీ ఫలసాయాన్ని ఫారెస్టు డిపార్ట్‌మెంట్ కొన్నే ఏర్పాట్లేవో చేశారు. అవి ఎంత సజావుగా జరిగి ఉంటాయో ఊహించడం పెద్ద కష్టమేమీ కాదు. ఎందుకంటే నూరేళ్ల తరువాత ఇప్పుడూ అలాంటి విధానాలే అమలౌతున్నాయి. అవి చెంచులకు ఎంత ఆలంబనగా ఉన్నాయో అందరికీ తెలిసిందే.

ఆ తరువాత చెంచుల అభ్యున్నతి కోసం వాళ్లకు పని కల్పించాలని, అప్పట్లో ప్రభుత్వం అనుకొని బొంగులు కొట్టడంలాంటి పనులు చేపట్టింది. ఇవేవీ పెద్దగా ఫలితాలివ్వలేదని చెబుతూ, చెంచుల్లో నేర ప్రవృత్తి ఉందని, దాన్ని నివారించవలసి ఉందని బ్రిటీష్ అధికారులు అభిప్రాయపడ్డారు. ఈ క్రమంలోనే విద్యా, వ్యవసాయ సంబంధమైన సంస్కరణలను ప్రారంభించారు.

1916లో మొట్టమొదటిసారిగా కర్నూలు జిల్లా పెచ్చెరువు చెంచుగూడెంలో స్కూలు ఏర్పాటు చేశారని ప్రముఖంగా చెప్పుకుంటారు. ఈ ప్రాంతంలో చెంచు పాఠశాలల గురించి(నాగలూటి, బైర్లూటి గూడాల్లో) హెమెండార్ఫ్ కూడా ప్రస్తావించారు. మరికొద్ది కాలానికి ఒక్క కర్నూలు జిల్లాలోనే 6141 ఎకరాల భూమిని చెంచుల గృహ నిర్మాణానికి, వ్యవసాయానికి కేటాయించారు. భూమిని సాగులోకి తీసుకురావడానికి వేల రూపాయల అప్పుగా కూడా ఇచ్చారు. కానీ ఆ భూమిని సర్వే చేయడంగాని, దానిపై చెంచులు స్థిరపడటంగాని జరగలేదని పాత రికార్డులు చెబుతున్నాయి. పాతికదాకా చెంచు గూడాల్లో ఇళ్లను నిర్మించి, ఇంతపెద్ద ఎత్తున భూమినిచ్చి చెంచులను వ్యవసాయంలోకి దించే ప్రయత్నాలు ప్రకాశం జిల్లాలో కూడా చాలా జరిగాయి. అయితే ఇంచుమించు అన్ని చోట్ల 90లదాకా భూమి సర్వేకూడా జరగలేదు. ఈ మధ్యలో తెల్లవాళ్లు పోయారు. నల్లవాళ్లు అధికారంలోకి వచ్చారు. అనేక గిరిజన చట్టాలు, సంస్కరణలు అమల్లోకి వచ్చాయి. గిరిజనుల సమగ్ర అభివృద్ధి కోసం- ముఖ్యంగా 1975-76నుండి ఐదు జిల్లాల్లో చెంచుల అభివృద్ధికి ఒక ఐటిడిఏ ఏర్పాటైంది. చెంచులకోసం ప్రభుత్వం కోట్ల రూపాయలను కేటాయించినట్లుగా లెక్కలు తేలుతున్నాయి. గిరిజన అభివృద్ధి విధానాన్ని స్వీకరించినప్పటినుండి ఐదు పంచవర్ష ప్రణాళికలు, 43,400 లక్షల కేటాయింపులద్వారా ఆరువేల మంది చెంచులు, ఆరో ప్రణాళికలో 50,690 లక్షలతో 5,160 చెంచులు, ఆ తరువాత 428.87 లక్షలతో 9,473 మంది 'అభివృద్ధి' చెందినట్లు లెక్కలు కన్పిస్తాయి. ఇళ్లు కట్టించినట్లు, వ్యవసాయానికి భూములిచ్చినట్లు, ఎద్దులు, మేకలు సమకూర్చినట్లు, పాఠశాలలు, హాస్టళ్లు నడుపుతున్నట్లు, హాస్పిటళ్లు కూడా పెట్టినట్లు వీటిలో ఉంటాయి. కాని 1991 లెక్కల ప్రకారం నల్లమలలో 40 వేల చెంచు జనాభా ఉంది. అది ఇంకా తగ్గిపోయి ఉండొచ్చు. ఇన్ని కోట్ల రూపాయల సుదీర్ఘకాల అభివృద్ధి ఛాయలు కూడా చెంచుల్లో కన్పించవు. ఈ అభివృద్ధి చట్రానికి-చెంచుల జీవన మూలాలకు ఎక్కడ వైరుధ్యముందనేది ప్రశ్నగానే మిగిలిపోతోంది. దీనికి అధికారగణంలో చిత్తశుద్ధి లేకపోవడం, అవినీతి మాత్రమే ఏకైక కారణం కాజాలదు. లోతుగా పరిశీలిస్తే ఈ అభివృద్ధి వ్యూహం చెంచుల జీవితాలకు అతికేది కాదని అర్థమౌతుంది. అందువల్లనే అభివృద్ధి పేరుతో చేపట్టిన సంస్కరణలు వాళ్లకు కొన్ని తక్షణ అవసరాలేమైనా తీర్చి ఉండొచ్చుగానీ, దానితోపాటే సంక్షోభాన్ని తీసుకొచ్చింది.

మొట్టమొదట సెటిల్‌మెంట్ల గురించి చెప్పుకోవాలి. గత 20 ఏళ్ల కాలంలో చాలా చెంచు గూడాలను అడవి అంచులోని పల్లెలకు తరలించారు. చెంచులను అభివృద్ధి చేయడం అనే పేరుతో టైగర్ ప్రాజెక్టు పేరుతోకూడా కొన్ని గూడాలను అడవి లోపలనుండి తరలించారు. టైగర్ ప్రాజెక్టుగా నిర్ణయించిన ప్రాంతంలో అన్ని జిల్లాల్లోనూ ఇది చూడవచ్చు. ఉదాహరణకు కర్నూలు జిల్లాలో టైగర్ ప్రాజెక్టు కోర్ ఏరియాలో ఉన్న పెచ్చెరువు గూడాన్ని 1980 ప్రారంభంలో కొట్టాల చెరువుకు తరలించారు. ఈ గ్రామం అడవి బయట ఉంటుంది. ఇక్కడ ఇళ్లు కట్టించి, వ్యవసాయ భూములను కూడా చూపించారు. అంతవరకు అడవి లోతట్టు ప్రాంతంలో, అడవిపై ఆధారపడి ఆహారసేకరణతో బతుకుతున్న వాళ్లకు కొట్టాల చెరువు పునరావాసం, సంక్షోభాన్ని తీసుకొచ్చింది. వ్యవసాయం అలవాటుగాక, వ్యవసాయ పనులు చేయలేక-పూర్వంవలె ఆహారసేకరణ కోసం, అటవీ ఫలసాయం కోసం వెళ్లాలంటే అడవి దూరమై పోయి నానా ఇబ్బందులు పడ్డారు. కొట్టాల చెరువుకు వచ్చాక చాలా మంది చనిపోయారు. కొద్దికాలానికే అక్కడ ఉండలేని వాళ్లు కొందరు తిరిగి అడవి సరిహద్దులోకి వెళ్లిపోయి గుడిసెలు వేసుకుంటే, ఇంకొందరు ఎటూగాక చెల్లా చెదరైపోయారు.

చెంచుల పునరావాస విధ్వంసాన్ని అధ్యయనం చేయడానికి పెచ్చెరువు, కొట్టాల చెరువు ప్రయాణం మంచి నమూనా. అసలు పాత రోజుల్లో అయితే అడవి లోతట్టులో ఉండే పెచ్చెరువు గూడెంను చెంచుల రాజధానిగా చెప్పుకునే వాళ్లట. ఇటు మహబూబ్‌నగర్, అటు ప్రకాశం జిల్లాలకు చెంచు గూడాలకు పెచ్చెరువు కేంద్రంగా ఉంటుంది. విచిత్రమేమంటే పులుల స్థావరం కూడా అదే. పులులు, చెంచులు కలిసి బతికిన ప్రాంతమది. ఎవరివల్ల ఎవరికీ ఏ నష్టం జరగలేదు. కానీ ప్రభుత్వానికి పులులమీదనున్న ప్రేమ చెంచులమీద లేకపోయింది. పులిని అడవిలోనే ఉంచాలనుకోవడం మంచిదే కావచ్చు. పులి ప్రాకృతికంగా బతకాలనే నిర్ణయం కోసం అడవిలో, అడవిమీద ఆధారపడి జీవించే వందల, వేల ఏళ్ల వారసత్వమున్న చెంచులను మాత్రం (పులి స్వేచ్ఛా జీవనం కోసం) బయటకు తరలించారు. కొట్టాల చెరువు అడవి సరిహద్దుల్లో ఉన్నా వాళ్లకు అలవాటైన జీవితం కరువై ఇబ్బందులపాలయ్యారు.

అలాంటిదే రుద్రకోడూరు పునరావాసం. ఇక్కడ టైగర్ ప్రాజెక్టు గొడవ లేకపోయినా చెంచులకు కాలనీ కట్టించి, భూములిచ్చి, వ్యవసాయం చేయించి అభివృద్ధి చేయాలనే ప్రణాళికలో భాగంగా ఈ ప్రాంతంలోనున్న రెండు గూడాల వారికి నల్లకాలువ గ్రామం బయట పునరావాసం కల్పించారు. ఆ గ్రామస్తులు ఏమంటారంటే ఇరవై ఏళ్ల కింద చెంచులు ఈ గ్రామానికి వచ్చినప్పుడు నలభై కుటుంబాలు ఉండేవి. ఇప్పుడు నలభై మంది కూడా కన్పించరు అని, మిగతావాళ్లలో చాలమంది చనిపోయారు. కొంతమంది దిక్కుతోచక, ఆకలికి తట్టుకోలేక, బిచ్చమెత్తుకుంటూనో ఊళ్లలో తిరుగుతూ చిన్నచిన్న పనులు చేసుకుంటూనో కాలం వెళ్లదీస్తున్నారు. ప్రభుత్వం ఇచ్చిన భూములు

ఏమయ్యాయి, ఎద్దులు, మేకలు ఏమయ్యాయి, రుణాలు ఏమయ్యాయో అనేవి ఎన్నటికీ లెక్కల్లో తేలని గడ్డు ప్రశ్నలు.

ఈ పునరావాసంలో చెంచుల సంస్కృతీ విధ్వంసం గురించి అదే ఒక ప్రత్యేక విషయంగా చర్చించాల్సి ఉంటుంది. మిగతా విషయాలు ఎలా ఉన్నా ఒక ఆసక్తికరమైన విషయం తప్పకుండా చెప్పుకోవాలి. సెటిల్‌మెంట్లలోకి వచ్చిన చెంచుల అకాల మరణాలగురించి ఆరాతీస్తే బైటతిండి, అదీ వాళ్లకు అలవాటైన తిండి దొరక్క పోవడంతోపాటు అనారోగ్యం ఒక ముఖ్య కారణంగా కన్పిస్తుంది. చెంచులకు సారాయి కాచుకోవడం, తాగడం మొదటినుండి ఉన్న అలవాటు. సారాయి బహుశా వాళ్లకు అన్నపానాల్లో విడదీయడానికి వీల్లేనిదిగా ఉంటూ వచ్చింది. అడవిలో ఉన్నప్పడైతే విప్పపుల్ల సారాయి కాచుకుని పెండ్లాం, బిడ్డలతో కలిసి రోజంతా తాగడం అలవాటు. బయట ఇప్పసారా దొరకడం కష్టం. సెటిల్‌మెంట్ల ఉండే గ్రామస్తులేమంటారటే 'రాత్రింబవళ్లు అంతుపొంతూ లేకుండా సారాయి తాగితే రోగాలొచ్చి చావకుండా ఎందుకుంటారు' అని. అసలు విషయం ఏమంటే–అడవిలో విప్పసారా తాగేవాళ్లు బయట దొరికే నానా రకాల నాటుసారాయి తాగడంవల్ల నిజంగా ఆరోగ్యాలు పాడై పోతున్నాయి. అసలు ఈ తరం చెంచులకు(బయటకు వచ్చిన వాళ్లకు) విప్పసారా కాచడం ఎట్లాగో తెలియదట.

ఇక ఇండ్ల విషయానికొస్తే బయటకు తరలించిన గూడాల్లో ఇంచుమించు అందరికి ఇండ్లు కట్టించినట్లే అడవిలోఉన్న గూడాల్లో కూడా చాలా చోట్ల ప్రభుత్వ పక్కా ఇండ్లు కన్పిస్తాయి. అయితే అడవిలోనే కాదు, సెటిల్‌మెంటు కాలనీల్లో కూడా చెంచులు రాత్రిళ్లు ఇళ్లలో పడుకోరు. బయటకు వచ్చిన వాళ్లకు కొంచెం అలవాటైనా అడవిలోఉన్నవాళ్లయితే జనవరి నెలలో దట్టంగా మంచు కురుస్తున్నా సరే గుడిసె బయట నేగడు వెలిగించుకుని పడుకోవాల్సిందే. ఒకపక్క కుక్క, ఇంకో పక్క పిల్లా పాపలతో చెంచులు మధ్యలో నేగడు. చెంచులకు గడ్డితో కప్పిన చుట్టు గుడిసెమీదనున్న నమ్మకం, సిమెంటు, కాంక్రీటు మిద్దెలమీద ఉండదు. ఏ ఆధారం లేకుండా ఉన్న పైకప్పు కూలిపోతుందని భయం. అసలు వర్షాకాలం తప్ప మిగతా అన్ని కాలాల్లో ఆరుబయట స్వేచ్ఛగా ఉంటూ అడవిలో తిరుగుతూ ఉంటారు కాబట్టి మన ఇళ్లు అనుకునే నాలుగు గోడలు, పైకప్పు ఉండే ఇళ్లు వాళ్లకు అవసరం చాలా తక్కువ. సెటిల్‌మెంట్లలో వాళ్లకు వచ్చిన ఇబ్బంది అదే. విచిత్రమేమిటంటే కాంక్రీటు ఇళ్లు కూలిపోతాయనే చెంచుల నమ్మకాన్ని మన అధికారులు, ఇంజనీర్లు అవినీతికి పాల్పడి అప్పుడప్పుడు నిజం చేస్తుంటారు. దీనివల్ల కూడా అడవిలోనున్న గూడాల్లోనైతే ప్రతి కాంక్రీటు ఇంటిపక్కన చుట్టు గుడిసె తప్పక కన్పిస్తుంది.

చెంచుల అభివృద్ధి కోసం ప్రభుత్వం వ్యవసాయాన్ని మౌలిక విషయంగా తీసుకున్నట్లు కన్పిస్తుంది. మొదటినుండి వ్యవసాయేతర భూములను చూపించి, మిగతా సౌకర్యాలు కల్పించే లక్ష్యం ఉంటూ వచ్చింది. దీని అమలులో జరిగిన అవకతవకలు చర్చనీయాంశమే అయినా, చెంచులు వ్యవసాయంలోకి రాలేకపోవడానికి కారణాలను వాళ్ల వైపునుండి కూడా అన్వేషించడం చాలా అవసరం. అధికారులకు శ్రద్ధ, చిత్తశుద్ధి లేకపోవడంవల్ల కాగితాల మీద కన్పించే రాతలకు, ఆచరణకు మధ్య కన్పించే అంతరం చెంచుల్లాంటి నోరులేని తెగల విషయంలో సహజంగానే మరింత ఎక్కువ ఉంటుంది. అదలా ఉంచి, ప్రయత్నాలు జరిగిన మేరకైనా ఫలితాలు ఉండాలి కదా! అని పరిశీలిస్తే చిన్న చిన్న మినహాయింపులతో చెంచులు వ్యవసాయానికి దూరంగా ఉన్నారనే చెప్పాలి.

చెంచులతో సారాయి మాన్పించాలని, వ్యవసాయంలోకి తీసుకురావాలని మహబూబ్‌నగర్, ప్రకాశం, కర్నూలు జిల్లాల్లో నక్సలైట్లు గత 15 ఏళ్లుగా చేసిన ప్రయత్నాలు కూడా పెద్ద ఫలించలేదు. సీజన్లో పక్క గ్రామాల రైతుల సాయంతో పొలాలు దున్నుకునేలా చేసి విత్తనాలు చల్లించితే పంట చేతికొచ్చేలోగా అవసరానుగుణంగా సేద్యం పనులు చేయడం చెంచులవల్ల అయ్యేది కాదు. పెద్ద యంత్రాంగం హంగామా ఉన్న ఐటిడిఎకు కూడా చాలా చోట్ల ఇలాంటి అనుభవాలే ఎదురయ్యాయి. రుతువులను గమనించి పంటలో వస్తున్న మార్పులకు, అవసరాలకు తగినట్లు వ్యవహరించడం, దానికోసం దీక్షగా కనిపెట్టుకుని ఉండటం చెంచులకు అలవాటు కావడంలేదు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆహార సేకరణద్వారా జీవించడం తప్ప ఉత్పత్తిలో పాల్గొని దానికవసరమైన ప్రకృతి పరిశీలన, నైపుణ్యం, శ్రమ చేయడం చెంచులకు ఇంకా అలవాటు కాలేదు. పొద్దున నిద్రలేవగానే భార్యతోసహా కుక్కను వెంటబెట్టుకుని ఉడుములు, తొండలు వేటాడ్డం, నీళ్లున్న చోట చేపలు పట్టడం, తేనె, సారెపప్పు సేకరించుకుని రాత్రికి ఇంటికి వస్తూ ఇంతవేట, ఇన్ని గింజలు తెచ్చుకుని తిని, సారాయి తాగి పడుకోవడం అనే దశనుండి–ప్రకృతి పరిజ్ఞానం పెంచుకుని కనీసం ఆర్నెల్లపాటు ఎదురుచూసి పంటను కంటికి రెప్పలా కాపాడుకుని ఒక్కసారి వచ్చిన పంటను ధాన్యం రూపంలోనో, డబ్బు రూపంలోనో దాచుకోవడం అనే దశకు ఎదగకపోవడం ప్రధానమైన సమస్య. దీనివల్లనే ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా ఆశించిన మేరకు చెంచులు వ్యవసాయానికి మళ్లలేక పోతున్నారు. ప్రకాశం జిల్లాలో అక్కడ కూడా భూములు సాగుచేస్తున్నా అది వాళ్ల జీవితంలో చాలా చిన్న భాగమే. పూర్తిగా వ్యవసాయంమీద ఆధారపడే రైతు మనస్తత్వంలోకి మారలేకపోయారు.

ఆర్నెల్లు, ఏడ్నెల్లు కష్టపడి వ్యవసాయం చేయలేకపోవడం ఒక్కటే సమస్యకాదు. వ్యవసాయ పనుల్లో ఉండాల్సిన నైపుణ్యం, శ్రద్ధ కూడా తక్కువే. కొన్ని గూడాల్లో చెంచులు పక్కనే ఉన్న గ్రామాల్లోని రైతులకు కూలిపనికి వెళుతుంటారు. అది కూడా కరువువల్ల అడవిలో తేనె, సారె పప్పులాంటివి దొరక్కపోవడంతో తప్పని సరైందనే చెప్పాలి. ఆ రైతులు చెంచుల పనిగురించి ఏమంటారంటే 'చెంచులు ఏ పనీ కష్టపడి చెయ్యలేరు' అని. నైపుణ్యంగా చేయలేకపోవడం, ఆ పని పూర్తికావడానికి అవసరమైన శ్రమ చేయలేకపోవడం అనే అర్థం ఇందులో ఉంది.

చెంచులకు నైపుణ్యం లేదా అంటే? ఆహార సేకరణలోని అన్ని పనుల్లో వారి నైపుణ్యం అద్భుతంగా కన్పిస్తుంది. ఉదాహరణకు విల్లంబుల తయారీలో, చివరకు బాణం బద్ద రెండు చివరలను కలిపే అల్లె కూడా వెదురునుంచే తయారు చేస్తారు. అది ఎంత బలంగా లాగినా విరిగిపోదు. దాన్ని రెండు చివరులు ఒద్ది చివర్లకు కట్టడానికి ఏదో జంతు నరాన్ని వాడతారు. బాణాల చివర్లో ఇనుముతోనూ, వెదురుతోనూ చేస్తారు. వాటి తయారీలో చాలా సున్నితత్వం ఉంటుంది. అట్లాగే తేనెపట్టు దించడంలో కనబరిచే నైపుణ్యాన్ని చూసిన వాళ్లు గొప్పగా వర్ణిస్తారు.

బహుశా, చెంచుల నైపుణ్యానికి ఉన్న ఈ పరిమితివల్లనే చదువులోనూ ఎక్కిరావడంలేదు. బ్రిటీష్ కాలంనుండి ఇప్పటి ఐటిడిఎదాకా ఈ అయిదు జిల్లాల్లో చాలా స్కూళ్లు నడుపుతూ వచ్చారు. కనీసం వందకుపైగానే స్కూళ్లు, హాస్టళ్లున్నాయి. సున్నిపెంటలో చెంచులకు జూనియర్ కాలేజ్ కూడా ఉంది. ఇప్పటికీ హైస్కూలు పూర్తిచేసిన వాళ్లు చాలా తక్కువగా కన్పిస్తారు. ఇటీవల సర్వశిక్షా అభియాన్ తరఫున ఆదివాసీ తెగల భాషల్లో, యాసల్లో వాచకాలను తయారు చేసే ప్రణాళిక ఏదో నడుస్తున్నది. చెంచులు తెలుగే మాట్లాడతారు కాబట్టి, కొన్ని తెగల్లాగ ప్రత్యేక వాచకమొకటే చదువు సమస్యను పరిష్కరించకపోవచ్చు. చెంచులమాటలో ఉన్న యాస సమస్యను కొన్ని ప్రత్యేక పదాల సమస్యను మాత్రమే ఇది పరిష్కరిస్తుంది. ప్రభుత్వం లెక్కల ప్రకారమే చెంచుల్లో అక్షరాలు వచ్చిన వాళ్లు ఐదు శాతం కూడా లేరు. నాలుగు గోడల మధ్య కూర్చోబెట్టి చదువు చెప్పే పద్ధతి చెంచులకు పనికిరాకపోవచ్చు. అడవిలో స్వేచ్ఛగా తిరిగే అలవాటున్న చెంచు పిల్లలకు పొద్దుటినుండి సాయంత్రందాకా విధిగా కూచోని పలకలు, పుస్తకాలద్వారా చదువు నేర్చుకోవడం అనే ప్రక్రియ అలవాటు కావడం కష్టమే.

చెంచుల జీవన విధానంలో ఈ ప్రత్యేకతలు ఉన్నందువల్లనే వాళ్లను 'ప్రిమిటివ్ ట్రైబ్స్'గా గుర్తించారు. ఇంతవరకు బాగానే ఉంది. ఈ దశలో ఉన్నవాళ్లను అభివృద్ధి చేయడమంటే ఏమిటి? అనేది చిక్కు ప్రశ్న. పైకి చాలా సరళంగా ఉన్నట్లు కన్పించే చెంచుల జీవితం వాస్తవానికి చాలా సంక్లిష్టమైనది.

నేటికీ ఆహారసేకరణ ప్రధానంగా అడవిమీద ఆధారపడిన జీవితాల్లో అభివృద్ధి పేరుతో ఏ చిన్న మార్పు చేయదల్చుకున్న చాలా జాగ్రత్తగా, బాధ్యతగా వ్యవహరించాల్సి ఉంటుంది. ఆహారసేకరణ ఒక ఆదిమ జీవిత విశేషం కావొచ్చుగానీ వందల వేల ఏళ్ల జీవన ప్రయాణంవల్ల అనివార్యంగా కొత్త సామాజిక దశల లక్షణాలు కూడా చెంచుల్లో చోటు చేసుకున్నాయి. ఆహార సేకరణ అనే విధానం పైకి కన్పించినంత సరళమైనది కాదు. లోతుగా పరిశీలిస్తే అది వాళ్ల జీవన మూలమని కూడా అర్థమౌతుంది. ప్రభుత్వం చేపడుతున్న అభివృద్ధిలో ఈ స్పృహ లేకపోవడంవల్లనే అడవిలో ఆహార సేకరణ చేసుకుంటూ వెనుకబడిపోయారు. కాబట్టి వాళ్లకు భూములిస్తే, ఇళ్లు కట్టిస్తే చదువు చెబితే అభివృద్ధి అయిపోతారని అనుకున్నది. ఇవి అడవిలో సాధ్యం కాదనుకున్న చోట బయటకు తరలించే ప్రయత్నం కూడా చేసింది. చెంచులు ఈ అభివృద్ధిని అందుకోలేకపోగా కల్లోలానికి, విధ్వంసానికి గురయ్యారు.

చెంచుల్లో ఒకరిద్దరు కొద్దిగా చదువుకోవచ్చు, కొన్నిచోట్ల అడపాదడపా వ్యవసాయం చేస్తూ ఉండవచ్చు, అటవీ ఫలసాయాన్ని గిరిజన డిపోలకు అమ్ముకొని తిండి తిప్పలు చూసుకోవచ్చు గాని, అడవిలో ఆహారసేకరణ అనే అలవాటు వెనుకనున్న ఒకానొక సామాజిక దశలోని జీవన మూలాలు వాళ్ల ఆలోచన రీతులను, సంస్కృతిని అభివృద్ధి పేరుతో పరిచయం అవుతున్న దాని చేతిలో ఓటమిని నిర్దేశిస్తున్నాయి. ప్రభుత్వం అందిస్తున్న చేయూతను అందుకోలేకపోతున్నట్లు బయటకు కన్పించే దానిలో ఈ సంఘర్షణ దాగి ఉంది, ఓటమి దాగి ఉంది. దీన్ని పరిష్కరించడం ఎలా అనేదానికంటే ముందు దీన్ని ఎలా అర్థం చేసుకోవాలనేది చాలా ముఖ్యం. చెంచుల కుటుంబ సంబంధాల్లో, సంసార జీవనంలో పితృస్వామ్యం కన్పిస్తుంది. కానీ తరచి చూశామంటే మాతృస్వామ్య ఛాయలు, ధోరణులు స్పష్టంగా కన్పిస్తాయి. ఆదివాసీ తెగలన్నింటికీ ఇలాంటి నిర్దిష్టమైన ప్రత్యేకతలుంటాయి. మామూలుగా సమాజ పరిణామం గురించి మనకు తెలిసిన, మనం విశ్లేషించుకోగలిగిన క్రమాలకంటే భిన్నమైన క్రమం ఆదివాసీ తెగలకు ఉంటాయి. చెంచువంటి ప్రిమిటివ్ తెగగా చెప్పుకోగలిగిన వాళ్లలో అది మరీ నిర్దిష్ట క్రమంగా ఉంటుంది. చెంచులు ఇప్పుడెలా ఉన్నారు? అనే ప్రశ్న ఇప్పుడిలా ఉండటానికి వాళ్లు చేసిన ప్రయాణం ఎలాంటిది? అనే విస్తృత రూపంలో మన ముందుకు వస్తుంది.

విషాదమేమంటే మన సామాజిక అభివృద్ధి చట్రంలో ఆదివాసీల చర్చకు తగినచోటు ఎన్నడూ దొరకలేదు. అభివృద్ధి చీకటి కోణాల అన్వేషణ, ప్రాంతాలు, కులాలు, వర్గాలు, పల్లెలు, పట్టణాలు ప్రమేయంగా సాగినట్టే ఆదివాసీ తెగలవైపునుండి కూడా చూడగలిగినప్పుడే సార్థకమౌతుంది. అభివృద్ధికి సమగ్రమైన, సమర్థవంతమైన నిర్వచనం ఇచ్చుకోవాలంటే-అందులో ఆదివాసీలకు దొరికే చోటు ఎంత? అనేది కీలకమైన ప్రమాణంగా ఉండాలి. ఈ చోటు సవ్యంగా, తగినంత ఉండాలంటే ఆదివాసీ జీవన మూలాల గురించి, జీవన క్రమం గురించి సామాజిక చారిత్రక, మానవ శాస్త్ర దృక్పథం ఉండాలి. పాలకుల అభివృద్ధి భావజాలంలో ఇవేవీ ఉండవు కాబట్టి. అభివృద్ధి ప్రణాళికలవల్ల చిన్నచిన్న ప్రయోజనాలు కన్పించవచ్చు కానీ, అవే విధ్వంసానికి కూడా కారణమౌతుంటాయి. ఈ సమస్య మిగతా అన్ని జీవన అస్థిత్వాల్లో కన్పించిన దానికంటే విషాదకరంగా ఆదివాసీల్లో కన్పిస్తుంది. దానికి చెంచుల జీవితమే ఉదాహరణ. రాష్ట్రంలోని మిగతా ఆదివాసీ తెగలు కూడా ఈ సమస్యను ఎదర్కొన్నాయిగానీ, కనీసం గోండులు, కొలాములు, సంతాల్‌లు సుదీర్ఘకాలంపాటు తమ పోరాటాలవల్ల త్యాగాలవల్ల తమనుతాము రాజకీయ రంగంలో, ఆలోచనా రంగంలో నిలబెట్టుకుంటూ వచ్చారు. ఆ మేరకు ఆదివాసీ-మైదాన ప్రాంతాల సంఘర్షణ గురించి మాట్లాడేటప్పుడు చెంచుల ప్రస్తావన తక్కువనే చెప్పాలి. దీనివల్లకూడా చరిత్ర క్రమంలో చెంచుల జీవన పరిణామాన్ని తక్కువగా పట్టించుకోవడంతో ప్రభుత్వ విధానాలు మరీ అన్యాయంగా తయారయ్యాయి. ◆

## రచయితలకు సూచన

**ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడ అంతే. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.**

– సంపాదకులు

# పంట భూములకు సెగపెడుతున్న సెజ్‌లు

– వి. హనుమంతరావు

గొర్రెల మంద మనస్తత్వం మన రాష్ట్రంలో ఎక్కువగా ఉందేమోననిపిస్తుంది. గ్రెనైట్, చేపల చెరువులు, సిమెంటు పరిశ్రమలు అందుకు ఉదాహరణలు. ఎవరో ఒకరిద్దరు ప్రారంభించి లాభాలు చేసుకోవటంతో, అందరూ ఆ పరిశ్రమ మీద పడిపోతారు. మంద ఎక్కువైతే మజ్జిగ పల్చనవుతుంది అన్నట్లు, ఇంతమంది ప్రవేశించటంతో, ఆ ఉత్పత్తులకు అంత మార్కెట్ ఉండకపోవటంతో, లేక మరే ఇతర కారణాల వల్లనో లాభాలు రాక ఉత్సాహం సన్నగిల్లుతుంది.

ప్రస్తుతం ప్రత్యేక ఆర్థిక మండళ్లు (సెజ్ అని పిలుద్దాం) స్థాపనలకోసం దేశం అంతటా వేలం వెర్రిగా వెనకాలపడుతుంటే, పై అనుభవం గుర్తుకు వస్తోంది. ప్రస్తుతం సెజ్‌ల భవిష్యత్తు అంతా పచ్చగా కనపడుతుంది. రాష్ట్రంలో గ్రెనైట్ పరిశ్రమ కూడా ప్రారంభంలో అలాగే అనిపించింది. ఇప్పుడు దాని ఊసే వినపడటం లేదు. సెజ్‌లు కూడా అదే బాటలో పయనిస్తాయా? లేక, సిమెంటు పరిశ్రమలా మూడు పువ్వులు, ఆరు కాయలుగా విస్తరిస్తాయేమో. ప్రపంచీకరణతో పోటీ ఎక్కువైంది. మన ఉత్పత్తులు ప్రపంచ విపణిలో పోటీ పడాల్సి వస్తోంది. నాణ్యత, మన్నిక, ధరవరల విషయంలో, ఎగుమతులు చేసేటపుడు, అభివృద్ధి చెందిన, అలాగే వర్ధమాన దేశాలతో పోటీపడాలి. ఈ లక్ష్యంతోనే దేశంలోని పారిశ్రామికవేత్తలకు కొంత వెసులుబాటు కలిగించే ఉద్దేశంతో ఎగుమతుల ప్రోత్సాహక మండళ్లను (ఇపిజడ్) ఏర్పాటు చేసింది. కొన్ని సౌలభ్యాలను అందచేసి, పోటీకి అనువైన పరిస్తితులు కల్పించింది. కాని ఈ ప్రయాత్నం పేలలేదు. మొత్తం ఎగుమతుల్లో ఈ మండళ్లు చేసిన ఎగుమతుల శాతం 2003–04లో అయిదు శాతం మాత్రమే; వాటిలో పెట్టిన పెట్టుబడి మొత్తం ఫ్యాక్టరీలలో పెట్టుబడుల్లో 0.32 శాతం మాత్రమే. ఈ మండళ్లు స్థాపించినపుడు కూడా ఇప్పటిలాగే ఇల్లెక్కి అరిచారు. సెజ్‌ల విజయావకాశాల గురించి ఊహాగానాలు చేసినపుడు ఈ అనుభవాన్ని గుర్తుంచుకోవాలి.

సెజ్‌కు సంబంధించిన బిల్లు 2005 పార్లమెంట్‌లో చట్టంగా రూపొందినా, దేశంలో అంతకుముందు నుంచే అక్కడక్కడ పని చేయటం ప్రారంభించాయి. చట్టంగా రూపొందిన తర్వాత ఊపందుకోవటం ప్రారంభమైంది. కాని సెజ్‌లు త్వరలోనే స్థాపించబడతాయని ఉప్పందుకొన్న బడా పారిశ్రామిక వేత్తలు వేలకు వేల హెక్టార్ల భూమి కొనుగోలు ప్రారంభించారు. అంచనాలు 2000 సంవత్సరంలోనే పదివేల హెక్టార్ల భూమిని ముంబై పరిసరాల్లో సేకరించి ఎనభై శాతం కొనుగోలు పూర్తి చేశారు. ఆ వ్యాపార సంస్థ ప్రతినిధి ఒకరు మాట్లాడుతూ ఈ సెజ్‌లో మూడు లక్షల కోట్లు పెట్టుబడులు వస్తాయని, రెండు వందల మంది విదేశీ పెట్టుబడిదారులు క్యూలో నిల్చొన్నారని చెప్పారు. కేంద్ర ప్రభుత్వంలో అంచనాలకు ఉన్న పలుకుబడి ఏమిటో ఇది తెలియజేస్తుంది. మహారాష్ట్ర ప్రభుత్వమే పద్నాలుగు వేల హెక్టార్లు సేకరించటాన్ని అక్కడి రైతులు జీర్ణించుకోలేకపోతున్నారు. 'మాకు భూమి బదులు ఉద్యోగాలు అవసరం లేదు. మా భూమి, మా చెట్లు, మాసముద్రం మాకున్నాయి. మేము కడుపు నిండాతింటున్నాం. మాకిదే చాలు' అని రైతులు అంటున్నారు. పంజాబ్‌లో వ్యవసాయం లేకుండా ఒక్క సెంటు భూమి కూడా ఉండదు. అలాంటి రాష్ట్రంలో ఆ ముఖ్యమంత్రి సెజ్‌లు ఏర్పాటు చేయాల్సిందే అంటున్నారు. సెజ్‌లు ఏర్పాటు చేయాలంటే పంట భూమినేకదా స్వాధీనం చేసుకొనేది. అబ్బే, మేము ఎందుకూ పనికిరాని ఏర్ర భూములే స్వాధీనం చేసుకొంటున్నాం అని అధికారులంటున్నారు. అలాంటి భూముల్లో భూ గర్భ జలాలుండవుకదా. లక్షలు, కోట్లు ఖర్చు చేసి పెట్టుబడులు పేట్టేవారు అలాంటి భూములు తీసుకొంటారా? దేశం మొత్తం మీద ఒక లక్ష హెక్టార్లలో సెజ్‌లు వెలుస్తాయని ప్రస్తుత అంచనా. ఎంత పంట నష్టం అవుతుంది? ఎంతమంది నిరాశ్రయులవుతారు? స్వాధీనం చేసుకొనేవి పంట పండని భూములంటున్నారు. అంటే పంట పండని భూముల్లో రైతులు వ్యవసాయం చేస్తున్నారా? సంస్కరణలు ప్రవేశ పెట్టినప్పటి నుంచి ప్రభుత్వాలు వ్యవసాయాన్ని చిన్న చూపు చూస్తూ పెట్టుబడులు పెట్టడం లేదని అందరూ విమర్శిస్తూ వచ్చారు. ఆ విషయాన్ని అంగీకరించిన ప్రస్తుత ప్రభుత్వం కూడా, బ్యాంకుల ద్వారా ఇచ్చే రుణం మొత్తం పెంచడం తప్ప వ్యవసాయానికి చేసిందేమీ లేకపోగా, సెజ్‌ల కోసం–పరిశ్రమల కోసం రైతుల భూముల్నే స్వాధీనం చేసుకోవటం దారుణం. ప్రభుత్వం తలకాయలో పరిశ్రమల రంగమే ఇంకా తిష్టవేసుకొని కూర్చుందనడానికి వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకోవడమే తిరుగులేని నిదర్శనం.

అభివృద్ధి కోసం వ్యవసాయ భూములను తీసుకోవటం తప్పదని అలా తీసుకోవడాన్ని విమర్శిస్తున్నవారిని అభివృద్ధికి వ్యతిరేకులుగా ప్రభుత్వం చిత్రిస్తోంది. ఇప్పటికే నీటి పారుదల ప్రాజెక్టుల కోసం, భారీ పరిశ్రమల కోసం, రహదారులను వెడల్పు చేయటం కోసం రైతుల, గిరిజనుల భూములను నోటీసులిచ్చి స్వాధీనం చేసుకొంటున్న ప్రభుత్వం సరికొత్తగా సెజ్‌ల కోసం లక్ష హెక్టార్లను స్వాధీనం చేసుకోబూనుకోవటం, రైతులను వ్యవసాయాన్ని వెన్నుపోటు పొడవటమే. సంపన్నుల ప్రయోజనాలకోసం, రైతుల భూములను కైంకర్యం చేయటం, రైతులు రెచ్చిపోవడానికి దారి తీస్తుంది. ప్రయివేట్ రంగం సెజ్‌లలో పరిశ్రమలు పెడతానంటుంది. వారు పరిశ్రమలు పెట్టేది లాభం కోసమే కదా. వాళ్లకు భూమి కావాలంటే, రైతులు అంగీకరిస్తే వాళ్ల వద్ద కొనుక్కోమనండి. అంతేగాని పారిశ్రామికవేత్తల కోసం ప్రభుత్వం భూమిని సేకరించి వాళ్లకు అప్పచెప్పడమేమిటి? పెట్టుబడిదారులకు ప్రభుత్వం బ్రోకర్ పని చేపట్టిందా? రైతులను దబాయించి చవక ధరకు స్వాధీనం చేసుకొని హెచ్చు ధరకు పారిశ్రామికవేత్తలకు కట్టబెట్టడం చూస్తే రైతుల ప్రాణాలతో ప్రభుత్వం వ్యాపారం చేస్తోందా అని అడగాలి. ఒకపక్క మార్కెట్ ఎకానమీ అంటాం. ఏ ధరకు కొనాలి, ఏ ధరకు అమ్మాలి అనేది మార్కెటింగ్ ఎకానమీ ప్రాథమిక సూత్రం. సెజ్‌ల

విషయంలో మార్కెట్ ఎకానమీ సూత్రం వర్తించదా. మన్మోహన్‌జీ రైతు తన భూమిని తన ఇష్టం వచ్చిన ధరకు అమ్ముకొనే హక్కులేదా?

పరిశ్రమల స్థాపనకు కావాల్సిన మౌళిక సౌకర్యాలకు, ముఖ్యంగా భూ సేకరణ విషయంలో ప్రోత్సాహకాలు ఇవ్వాల్సిందే అంటున్నారు ప్రభువులు. సెజ్‌లో భవనాలు, రహదారులు, ఇళ్లనిర్మాణానికి సిమెంట్ అవసరం. రైతులను తమ భూములను చవక ధరలకు అమ్మాలని ఎలా అంటున్నారో, సిమెంట్ కంపెనీలను కూడా సిమెంట్‌ను తక్కువ ధరకు అమ్మాలని ప్రభుత్వం అడుగుతుందా?

ఒక పక్క భూ సంస్కరణలు అమలుపరుస్తున్నాం, భూ స్వామ్య వ్యవస్థను రద్దు చేస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూ, రెండో పక్క సెజ్‌ల పేరుతో కొత్త తరం భూస్వాములను సృష్టించటం, వేలకు వేల ఎకరాలు డెవలపర్స్‌కు ఇవ్వటం జరగటం లేదా? కొత్త జమీందారీ వ్యవస్థను సృష్టించటం లేదా? ప్రముఖ చరిత్రకారుడు సుమిత్ సర్కార్ 'ఇది స్వతంత్ర భారతంలో అదిపెద్దదైన భూములను లాక్కొనే కుంభకోణం' గా వర్ణించారు.

సెజ్‌లలో పరిశ్రమలు ఏర్పాటు చేయాలని, ఆ ఉత్పత్తులు ఎగుమతి చేయాలనేది లక్ష్యం. అంటే సెజ్‌లో సింహభాగం పరిశ్రమలకు కేటాయించబడుతుందని అనుకొంటాం. కాని కేటాయించిన భూమిలో ఢబై అయిదు శాతం పారిశ్రామికేతర అవసరాలకు కేటాయించాలని చట్టమే చెబుతుంది. ఇదేమిటని అడిగితే, భవనాలు, మాల్స్, గృహాలు, రహదారులు, ఎంటర్‌టైన్‌మెంట్ (అంటే సినిమాలు, నైట్ క్లబ్‌లు) లాంటి వాటి కోసం ఇలా చేయాల్సి వచ్చిందని అధికారులంటున్నారు. ఇది రియల్ ఎస్టేట్‌కు మరో పేరు మాత్రమే. సెజ్‌లో ఏర్పాటయ్యే సంస్థలకు బ్యాంకులు రుణాలు ఇస్తే, అది రియల్ ఎస్టేట్‌కు రుణం ఇచ్చినట్లు భావించాలని రిజర్వు బ్యాంకు ఆదేశించింది. మరి రియల్ ఎస్టేట్ కాదంటారేమిటి? రైతుల భూములు లాక్కొనేది ఇందుకోసమన్నమాట. ఎగుమతులు చేయాలంటే పైనే చెప్పినట్లు తీర ప్రాంతాల్లో ఏర్పాటు చేస్తే ఖర్చు తగ్గుతుంది. కాని ఢిల్లీ, ముంబై, చండీఘర్ లాంటి పట్టణాల పొలిమేరల్లో అత్యధికంగా ఏర్పాటు చేయబడుతున్నాయి.

సెజ్‌లో తమ వ్యాపకాలకు స్థలాలకోసం ఎక్కువగా ఎగబడుతున్నది ఐటి, ఐటిఇ కంపెనీలు. వీరంతా, ఇవన్నీ ఇప్పటి వరకూ పట్టణాల్లో, నగరాల్లో పనిచేస్తున్న సంస్థలే. సెజ్‌లకు ఇస్తున్న రాయితీలు,పన్ను మినహాయింపులు, ప్రోత్సాహకాలను నంజుకోవడానికి, వారు సెజ్‌లకు ఎగబడుతున్నారు. బయట ఉన్నప్పుడు కూడా ప్రోత్సాహకాలు అనుభవిస్తున్నాయి. అవికాక ఈ ప్రోత్సాహకాలు అదనం. ఏ ప్రోత్సాహకాలు లేకుండానే ఈ సేవా పరిశ్రమ ముప్పై శాతం వార్షికాభివృద్ధి సాధిస్తోంది. ఇప్పుడు రెండు చేతుల్తో లాభాలు పోగేసుకొంటాయి. వాళ్ల లాభాల కోసం రైతులు నిర్వాసితులు కావాలన్నమాట. ఎగుమతులు ఏ ప్రోత్సాహకాలు ఇవ్వకుండానే పెరుగుతున్నాయని గణాంకాలు తెలియజేస్తున్నాయి. అలాంటి నేపథ్యంలో, ఎగుమతులు పెంచటానికి ప్రత్యేకంగా రైతుల ప్రయోజనాలను బలిచేసి, సెజ్‌లు స్థాపించాలా? ప్రభుత్వం బలహీనతను కొంతమంది సొమ్ము చేసుకొంటున్నారు. విశాఖ ఉక్కు కర్మాగారం, ఒరిస్సాలోని విదేశీ పోస్కో ఉక్కు కర్మాగారం సెజ్‌లను ఏర్పాటుకు ప్రయత్నించడేమేమిటి? బయటనున్న పరిశ్రమలు తమకు కూడా సెజ్‌లో ఇస్తున్న మినహాయింపులు, ప్రోత్సాహకాలు (లెవెల్ ప్లేయింగ్ ఫీల్డ్) ఇవ్వాలని అంటున్నాయి.

సెజ్‌లో స్థాపించే పరిశ్రమలకు నేరుగా భూమిని కేటాయిస్తే అదో పద్ధతి. కాని భూమిని డెవలపర్స్‌కు ఇస్తున్నారు. వారు పెట్టుబడి పెడతారు కాబట్టి వారి లాభం వారు చూసుకొంటారు. ఆ ధరకు పారిశ్రామికవేత్తలు

## డెవలపర్స్‌కు ప్రోత్సాహకాలు

- ★ సెజ్‌లో నిర్మాణ, అభివృద్ధికి కావాల్సినవన్నీ విదేశాలనుంచి సుంకాలు లేకుండా దిగుమతి చేసుకోవచ్చు.
- ★ వ్యాపార సరళిలో ఫ్లాట్లు కేటాయింపు చేసే స్వతంత్రం
- ★ నివాస ప్రాంతాన్ని అభివృద్ధి చేయటానికి విదేశీ నిధులు సెజ్‌లో స్థాపించే యూనిట్లకు ప్రోత్సాహకాలు
- ★ లైసెన్స్ లేకుండా దిగుమతులు
- ★ దిగుమతుల మీద కస్టమ్స్ సుంకం రద్దు
- ★ వ్యాపార లావాదేవీలకు సంబంధించినంత వరకూ విదేశీ భూ భాగంగా పరిగణించబడుతుంది.
- ★ దేశంలో తయారయ్యే యంత్ర సామగ్రి, ముడిసరుకుల మీద ఎక్సైజ్ డ్యూటి ఉండదు.
- ★ సెజ్‌కు సరఫరా చేసే వాటన్నిటికీ ఎగుమతులకు వర్తించే నియమనిబంధనలన్నీ వర్తిస్తాయి.
- ★ 10-15 సంవత్సరాలు ఆదాయ పన్ను మినహాయింపు
- ★ అయిదేళ్లకు నూరు శాతం ఆదాయపు పన్ను రాయితీ, రెండేళ్లయితే యాభై శాతం, మరో మూడేళ్ల పాటు వచ్చిన లాభాలను తిరిగి పెట్టుబడి పెడితే యాభై శాతం వరకూ.
- ★ ఆఫ్‌షోర్ బ్యాంకింగ్ యూనిట్లకు మూడేళ్ల వరకూ ఆదాయపు పన్ను మినహాయింపు, మరొ రెండేళ్లకు యాభై శాతం వరకు.
- ★ సెజ్ ఏర్పాటులో విదేశాలకు సబ్ కాంట్రాక్టు ఇవ్వవచ్చు.
- ★ కొన్ని సెక్టార్లను మినహాయించి మిగతా తయారీ కాగా అన్నింటిలో నూరు శాతం విదేశీ పెట్టుబడులకు ఆటోమెటిక్ అనుమతి.
- ★ చిన్న పరిశ్రమలకు కేటాయించిన ఉత్పత్తుల తయారికి నూరు శాతం విదేశీ పెట్టుబడులకు అనుమతి.
- ★ చిన్న పరిశ్రమలకు లైసెన్స్‌లు అవసరం లేదు.

స్థలాలు తీసుకొని వారి లాభాలను కలుపుతారు. ఏతావాతా వినియోగదారుడి మీద భారం పడుతుంది. అక్కడే పని చేస్తూ అక్కడి ఇళ్లల్లో ఉండేవారు ఈ భారాన్ని మోయాల్సి వస్తుంది. ఈ సెజ్‌ల స్థాపన కామర్స్ మంత్రిత్వశాఖ బాధ్యత. లక్షల కోట్ల రూపాయల ఆదాయం వస్తుందంటుంది. చిదంబరం, ఇచ్చే రాయితీల వల్ల లక్ష కోట్ల రూపాయలు ఖజానాకు నష్టం వస్తుందని అంటున్నారు. ఇది లాలూచీకుస్తీ అని వేరే చెప్పాల్సిన పనిలేదు. మంత్రిమండలి ఆమోదముద్ర వేసింది, ప్రధాని ఓకే అన్నారు. ఇంత వరకూ అనుమతించిన సెజ్‌లను పరిశీలిస్తే 80.8 శాతం సెజ్‌లు కేవలం ఆరు రాష్ట్రాల్లో ఉంటాయి. ఇది ప్రాంతీయ అసమానతలను మరింతగా పెంచుతుంది.

వ్యవసాయాన్ని దెబ్బతీయటం, పారిశ్రామికవేత్తలకు లాభాలు సమకూర్చటం అనే ప్రపంచ బ్యాంకు విధానాన్ని ఈ సెజ్‌లు మరింత ముందుకు తీసుకుపోతాయి.

ప్రోత్సాహకాల పట్టికను పరిశీలిస్తే, విదేశీ పెట్టుబడులకు ఈ సెజ్‌లు అడ్డాగా మారుతాయి. వాటన్నిటికీ ప్రోత్సాహకాలు వర్తిస్తాయి. లాభాలు, డివిడెండ్లు, జీతనాతాలు అన్ని విదేశాలకు తరలిపోతాయి.

పారిశ్రామికేతర అవసరాలకు డెబ్బై అయిదు శాతం ప్రాంతాన్ని కేటాయించుకోవచ్చునన్న సౌలభ్యాన్ని యాభై శాతం మాత్రమే అనుమతిస్తూ పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రభుత్వ విధానాన్ని అంగీకరిస్తే, సెజ్‌ల ఏర్పాటుకు వామపక్షాల సూత్రప్రాయ అంగీకారం తెలియచేసింది. సెజ్‌ల్లో కార్మిక హక్కులకు స్థానం లేదు. కార్మిక సంబంధిత చట్టాలు వర్తించవు. రైతుల భూముల అక్రమణ, కార్మిక హక్కుల కాలరాయడం, ప్రభుత్వ ఆదాయం కోల్పోవడం, విదేశీ పెట్టుబడులకు మరింతగా తెరిచిన ద్వారాలు క్లుప్తంగా ఇదీ సెజ్ స్వరూపం.

**తాజా స్పందన :** ఈ నెల 15వ తేదిన కామర్స్ మంత్రిత్వ శాఖ కార్యదర్శి జి.కె. పిళ్లై హైదరాబాద్‌లో సెజ్‌ల గురించి ప్రసంగిస్తూ, ఇప్పటి వరకూ అనుమతి ఇచ్చిన సెజ్‌ల కోసం 34,510 హెక్టార్ల భూమి మాత్రమే అవసరమవుతుందని, ఇది దేశంలోని మొత్తం పంట భూమిలో 0.000012 శాతం మాత్రమేనని, ఇంత తక్కువ భూమి వ్యవసాయానికి ఎలా నష్టం కలుగ చేస్తుందని, ఆహార భద్రతకు ఎలా భంగం కలిగిస్తుందని ఆర్థిక శాస్త్రవేత్తలను ఎద్దేవా చేశారు. ఈయన వాదన ఒక కథను గుర్తుకు తెస్తోంది. ఒక రాజుగారి ఇంట్లో వివాహ సందర్భంలో ఊళ్లో ఉన్న వారంతా ప్రతి ఒక్కరూ ఒక చెంబుడు పాలు గంగాళంలో పోయాలని ఆదేశించారు. అందరూ పాలే పోస్తారు నేనొక్కడిని నీళ్లు పోస్తే ఏమీ కాదుకదా అని ప్రతీ ఒక్కరూ నీళ్లే పోసే సరికి సాయంత్రానికి గంగాళంలో అన్నీ నీళ్లే వచ్చాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో అనేక శాఖలు భూమిని సేకరిస్తున్నాయి. రహదారులు, భారీ నీటి పారుదల ప్రాజెక్టులు, భారీ పరిశ్రమలు, తదితర అభివృద్ధి కార్యక్రమాలకు భూమిని సేకరిస్తున్నాయి. కామర్స్ శాఖ ముప్పైనాలుగు వేల హెక్టార్లే ఆక్రమించవచ్చు కాని, కేంద్ర ప్రభుత్వంలో పని చేసే కార్యదర్శికి ఒక విశాలమైన దృక్పథం ఉండాలి కదా. అన్ని శాఖలు లక్షల హెక్టార్లు సేకరిస్తుంటాయి. ఇదేదో ఒక్కసారి మాత్రమే జరిగే ప్రక్రియ కాదు; అభివృద్ధి చెందుతున్న దేశాల్లో ఇలాంటి సేకరణ నిరంతర ప్రక్రియ. ఇలా సేకరిస్తూపోతుంటే సాగుభూమి విస్తీర్ణం తగ్గుతూపోతే, అది ఆహార భద్రతకు భంగకరం కాదా? మొత్తం దేశంలో తన శాఖ ఒక్కటే, అది కూడా ముప్పైనాలుగు వేల హెక్టార్లు మాత్రమే స్వాధీనం చేసుకొన్నట్లు మాట్లాడతారేమిటి? పిళ్లై పిన్ హోల్ దృష్టిని సవరించుకొంటే మంచిది. ◆

## తెలంగాణ భూముల బూమ్ ఎస్ఇజెడ్‌ల చలవేనా?

దాదాపు రెండేళ్ల కిందటి వరకూ తెలంగాణ లోని అనేక ప్రాంతాల్లో అయిదు వేల రూపాయలకు ఎకరం బంజరు భూమి దొరికేది. సాగులో ఉన్న చల్కా భూములు పదిహేను వేలు నుంచి ఇరవై వేలకు విరివిగా లభించేవి. అయితే గడచిన రెండు సంవత్సరాలుగా త్వరగతిన సంభవించిన అనేక పరిణామాలు ఇక్కడి భూముల విలువను అనూహ్యంగా పెంచేశాయి. మొదట హైదరాబాద్‌కు దగ్గరా ఉన్న రంగారెడ్డి జిల్లా, మెదక్ జిల్లాలోని కొన్ని మండలాల్లో భూముల రేట్లు పెరగడం ప్రారంభం అయ్యింది. ఇది క్రమంగా అటు మహబూబ్‌నగర్‌కు ఇటు నల్లగొండకు పాకింది. గడచిన సంవత్సర కాలంగా తెలంగాణలో అయిదు ఆరు జిల్లాల్లో గ్రామ గ్రామాన భూముల అమ్మకం, కొనుగోళ్లు ఉపందుకొన్నాయి. వేలల్లోంచి భూముల విలువ అమాంతంగా లక్షల్లోకి పెరిగింది. ప్రతి గ్రామంలో రోజూ హైదరాబాద్ నుండి వచ్చే బ్రోకర్ల హడావిడి పెరిగింది. పనికిరాని కొండలు, గుట్టలు, కంచెలను లక్షలకు పెట్టి కొంటున్న వారెవరో, వాళ్లు ఎందుకిలా కొంటున్నారోనని ఊళ్లోని రైతుల నుండి పట్నంలోని మేధావుల వరకూ అందరూ ఆశ్చర్యపోయారు. ప్రపంచ బ్యాంకు డబ్బులు, సాఫ్ట్‌వేర్ డబ్బులు, అమెరికా నుండి మనవాళ్లు వెనక్కి పంపుతున్న డబ్బులు, జలయజ్ఞం డబ్బులు, ఇలా రకరకాల మార్గాల్లో పచ్చి పడుతున్న డబ్బు ఇలా పెట్టుబడిగా మారుతొందన్న విశ్లేషణలు కొంత వినవచ్చాయి. ఇప్పుడు బైటికి వస్తోన్న ఎస్ఇజెడ్‌లు కథలు వింటాంటే అసలు తెలంగాణ భూముల కొనుగోళ్ల వెనుక ఉన్నది ఈ ఎస్ఇజెడ్ పథకమేనని అర్థం అవుతుంది. ఎస్ఇజెడ్‌లు ఏర్పాటు చేయడానికి వందలు, వేల ఎకరాల్లో భూమి కావాలి కొంతమంది తెలివైన వ్యక్తులు మొదట ఇలా భూమి సేకరించి ఆనక దాన్ని ఏ పారిశ్రామికవేత్తకు అమ్ముకుంటారన్న మాట. సాధారణంగా మన రాష్ట్రంలో భూకమతాల విస్తీర్ణం చాలా తక్కువ. అందుకే ఎస్ఇజెడ్ ఏర్పాటు చేయాలనుకునే కంపెనీ నేరుగా రైతులనుండి భూము కొనుగోలు చేయడం చాలా వ్యయప్రయాసలతో కూడుకున్న పని. అందుకే వారు ఎస్ఇజెడ్ కోసం భూమి సేకరించడానికి బ్రోకర్లను వినియోగించుకోవడం మొదలు పెట్టారు. తత్ఫలితమే ఈ భూముల బూమ్!

# ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటు కానున్న ఎస్ఇజెడ్‌లు

**ఔషధాలు, బయోటెక్నాలజీ ఇతర పరిశ్రమలు**

| క్ర.సం. | సంస్థ పేరు | స్థలం | ఉత్పత్తి | విస్తీర్ణం (హె॥) |
|---|---|---|---|---|
| 1 | దివీస్ లాబరేటరీస్ లిమిటెడ్ | చిప్పాడ, విశాఖపట్నం | ఔషధాలు | 101 |
| 2 | రాంకీ ఫార్మాసిటీ లిమిటెడ్ | లేమర్తి, విశాఖపట్నం | ఔషధాలు | 243 |
| 3 | హెటెరో డ్రగ్స్ లిమిటెడ్ | నక్కపల్లి, విశాఖపట్నం | ఔషధాలు | 100 |
| 4 | ఎపిఐఐసి | కరకపట్ల, మెదక్ | బయోటెక్ | 40.47 |
| 5 | సిల్వర్ టేక్ టెక్నాలజీస్ | కొమరగిరి, తూ.గో. | ఔషధాలు | 100 |
| 6 | డా. రెడ్డీస్ లాబరేటరీస్ లిమిటెడ్ | మెదక్ | ఔషధాలు | 105 |
| 7 | డా. రెడ్డీస్ లాబరేటరీస్ లిమిటెడ్ | శ్రీకాకుళం | ఔషధాలు | 110 |
| 8 | ఎపిఐఐసి | రాజాపూర్, పోలేపల్లి, మహ॥నగర్ | ఫార్ములేషన్ పరిశ్రమ | 101.17 |
| 9 | ధన్వంతరి లైఫ్‌సైన్సెస్ ప్రైవేట్ లిమిటెడ్ | మహబూబ్‌నగర్ | బయోటెక్నాలజీ | 170 |
| 10 | ఎపిఐఐసి | తడ, నెల్లూరు | తోలు పరిశ్రమ | 283.28 |
| 11 | అపాచీ ఇన్వెస్ట్ హోల్డింగ్స్ ప్రైవేట్ లిమిటెడ్ | హైదరాబాద్ | పాదరక్షలు | 101 |

**బహుళ ఉత్పత్తి / ఇతరాలు**

| క్ర.సం. | సంస్థ పేరు | స్థలం | ఉత్పత్తి | విస్తీర్ణం (హె॥) |
|---|---|---|---|---|
| 1 | హైదరాబాద్ జెమ్స్ ఎస్ఇజెడ్ లిమిటెడ్ | హైదరాబాద్ | ఆభరణాలు | 80.93 |
| 2 | కాకినాడ ఎస్ఇజెడ్ లిమిటెడ్ | కాకినాడ, తూ.గో | బహుళ ఉత్పత్తి | 4134 |
| 3 | ఎపిఐఐసి | విశాఖపట్నం | బహుళ ఉత్పత్తి | 2309 |
| 4 | వైట్‌ఫీల్డ్ పేపర్ మిల్స్ లిమిటెడ్ | పోలవరం, ప.గో. | పేపర్‌మిల్ | 121.4 |
| 5 | బ్రాండిక్స్ ఇండియా ఆప్పారెల్ సిటీ ప్రైవేట్ లిమిటెడ్ | విశాఖపట్నం | దుస్తులు | 404.7 |
| 6 | నియోజెన్ ప్రాపర్టీస్ ప్రైవేట్ | హిందూపూర్, అనంతపురం | అప్పారెల్ పార్క్ | 141.64 |
| 7 | యూనిటెక్ బిల్డర్స్ అండ్ డెవలపర్స్ లిమిటెడ్ | మల్కాజ్‌గిరి, సికింద్రాబాద్ | ఆటో మొబైల్ విడిభాగాలు | 10 |
| 8 | గ్రిమాటెక్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, ఎక్విప్‌మెంట్స్ అండ్ ప్రాజెక్ట్ లిమిటెడ్ | బొబ్బిలి | బహుళ ఉత్పత్తి | 1000 |
| 9 | ఆంబియంట్ ఇన్‌ఫ్రాటెక్ ప్రైవేట్ లిమిటెడ్ | మంచాల, రంగారెడ్డి జిల్లా | బహుళ ఉత్పత్తి | 1000 |
| 10 | రస్సాయ్ ప్రాపర్టీస్ అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | హిందూపూర్ | బహుళ ఉత్పత్తి | 1000 |
| 11 | డిఎల్ఎఫ్ యూనివర్సల్ లిమిటెడ్ | హిందూపూర్ | బహుళ ఉత్పత్తి | 1012 |
| 12 | లహరి ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్ | శంకర్‌పల్లి, రంగారెడ్డి జిల్లా | సేవారంగం | 100 |
| 13 | ఎపిఐఐసి | మహేశ్వరం (మం), రంగారెడ్డి జిల్లా | భవన నిర్మాణ ఉత్పత్తులు | 110 |

## చైనా రూటు వేరు!

ఇవాళ ఆసియా ఖండంలో ప్రబల శక్తులుగా ఉన్న చైనా, భారత్‌లను అన్ని విషయాల్లో పోల్చి చూడటం పరిపాటి. ప్రత్యేక ఆర్థిక మండళ్ల విధానాన్ని చైనా పాతికేళ్ల కిందటే రూపొందించింది. గమనించాల్సిన విషయం ఏమిటంటే చైనా ఎస్ఇజెడ్ విధానం అక్కడి ఎగుమతులపై అధిక ప్రభావాన్నే వేసింది. మరి ఇంకేం, మనమూ అదే పని చేస్తున్నాం గదా ఇక సమస్యేమిటి అంటారా? అక్కడే ఉంది తిరకాసంతా! చైనా ఎస్ఇజెడ్‌లకు మన ఎస్ఇజెడ్‌లకు హస్తమశకాంతరం తేడా ఉంది. చైనాలో గత పాతికేళ్లలో నెలకొల్పినవి కేవలం అయిదు ఎస్ఇజెడ్‌లు. మరి మన దగ్గరో? ఇప్పటికే నాలుగు వందల ఎస్ఇజెడ్‌లకు ఎడాపెడా అనుమతిలిచ్చేశాయి మన ప్రభుత్వాలు. చైనాలో ఎస్ఇజెడ్‌లు నెలకొల్పడం ప్రభుత్వం ఆధీనంలో జరిగింది. ఇక మన దగ్గర వస్తోన్న ఎస్ఇజెడ్‌లలో సింహభాగం ప్రైవేట్ కంపెనీలదే. చైనాలో ఎస్ఇజెడ్‌లను పక్కా ప్రణాళికతో నిర్మించారు. అప్పటికే ఉన్న నగరాల్లో మౌలిక వసతులపై భారంపడకుండా ఉండేందుకు కొత్త పారిశ్రామిక పట్టణాల వలె ఎస్ఇజెడ్‌లను తీర్చిదిద్దారు. అంతే కాదు, ఎగుమతులకు అనువుగా ఉండటం కోసం ఎస్ఇజెడ్‌లను నౌకాశ్రయాలకు దగ్గరగా, తీరప్రాంతాల్లోనే నిర్మించారు. మన దగ్గర ఏర్పాటవుతున్న ఎస్ఇజెడ్‌లు అన్నీ పెద్ద నగరాలు, టౌన్ల సరిహద్దుల్లోనే ఉన్నాయి. ఇప్పటికే అస్తవ్యస్తంగా ఉన్న నగరాలను ఇవి ఇంకా ఇబ్బందుల్లోకి నెట్టే అవకాశం ఉంది. చైనాలో ప్రముఖ ఎస్ఇజెడ్ అయిన షెన్‌జెన్ విస్తీర్ణం 49,300 హెక్టార్లు అయితే హైదరాబాదులో విప్రో సంస్థ ఏర్పాటు చేస్తున్న ఎస్ఇజెడ్ విస్తీర్ణం ఆరు హెక్టార్లు మాత్రమే! అయినా చైనా ఎస్ఇజెడ్‌ల మీద కూడా ఎన్నో విమర్శలు ఉన్నాయి.

# స్పెషల్ ఎకనామిక్ జోన్స్ (సెజ్) - ఒక పరిశీలన

- సురవరం సుధాకర రెడ్డి

ప్రత్యేక ఆర్థిక మండళ్లులేక స్పెషల్ ఎకనామిక్ జోన్స్ (సెజ్) కోసం చట్టం 2005 మే నెలలో పార్లమెంటులో ఆమోదింపబడి అమలులోకి వచ్చిన తర్వాత తీవ్రంగా వివాదాస్పదమైంది. యుపిఎ ప్రభుత్వ హయాంలో తీవ్ర విమర్శలకు గురైన చట్టం బహుశా ఇదే.

ఎగుమతి ఆర్థిక మండళ్ల పేరుతో ఇలాంటి ప్రత్యేక సంస్థలు గతంలో మనదేశంలోనూ, ఇతర దేశాలలోనూ అమలులో ఉండేవి. కాని ఇవి చాలా పరిమితంగా ఉండేవి. 1986 నాటికి ప్రపంచ వ్యాప్తంగా 176 ఎగుమతి మండళ్లు 47 దేశాల్లో ఉండేవి. ప్రపంచీకరణ వేగవంతమయ్యేసరికి 116 దేశాల్లో 3000కు పైగా ఇలాంటి మండళ్లు ఏర్పాటయ్యాయి.

మన దేశంలో టాటా కంపెనీ 1977లోనే బుర్రోస్ అనే అమెరికన్ కంపెనీతో సాఫ్ట్‌వేర్ పరికరాల ఎగుమతి కంపెనీని ఏర్పాటు చేశారు. అలాగే ముంబాయిలో 1987-88లో ఆధునిక ఆభరణాల యూనిట్‌ను (సీపిజడ్) ఏర్పాటు చేశారు. ఈ రెండింటి నుంచి కూడా ఎగుమతులు చాలా పుంజుకున్నాయన్న వాదన ఉంది. ఆభరణాల తయారి భారతదేశంలో సంప్రదాయకంగా విశ్వకర్మలు తమ ఇళ్లలో, చిన్న దుకాణాల్లో ఉత్పత్తి చేసే పరిశ్రమ. లక్షలాది మందికి స్వయం ఉపాధి కల్పించే పరిశ్రమ. ఆధునిక యంత్రాలతో ఈ జోన్ ఏర్పాటైన తర్వాత ఆభరణాల తయారి బాగా పెరిగింది. 2002-03లో మొత్తం ఆభరణాల ఎగుమతితో 55 శాతం ఈ మండళ్ల నుంచే జరిగింది. ఆధునిక యంత్రాల వాడకం ఈ రెండు దశాబ్దాల కాలంలో దేశీయ ఆభరణాల తయారిలోకి కూడా జొరబడి లక్షలాది స్వర్ణకారుల పొట్టకొట్టింది. చిన్న గ్రామాలలో, మండల కేంద్రాలలో తయారైన ఆభరణాల అమ్మకందార్లు ఏర్పడ్డారు. పెట్టుబడి పెట్టలేని స్వర్ణకారులు (వీరే అత్యధికులు) నిరుద్యోగులయ్యారు. ప్రజల ఆదాయం పెరిగింది. బంగారం కొనుగోలు పెరిగింది. కానీ స్వర్ణకారులు నిరుద్యోగులు కావడం వారిని దిగ్భ్రాంతికి గురిచేసింది. ఐటి రంగానికి చెందిన కుటీర పరిశ్రమలు లేవు గనుక సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్ ఎగుమతులు, యాంత్రీకరణ ఇలాంటి ప్రభావాన్ని చూపలేదు.

ఈ మధ్య కామర్స్ మంత్రిత్వశాఖ కార్యదర్శి, హైదరాబాద్‌లో ఒక పత్రికాగోష్ఠిలో మాట్లాడుతూ, స్పెషల్ ఎకనామిక్ జోన్స్‌కు కేటాయిస్తున్న భూమి, భారతదేశంలో మొత్తం సాగుభూమిలో 0.00001 శాతం కూడా లేదని, ఆర్థిక శాస్త్రవేత్తలు, రాజకీయ నాయకులు ఎందుకు గగ్గోలు పెడుతున్నారో అర్థం కావడంలేదని వాపోయారు. వ్యవసాయ భూమిని సెజ్‌లకు కేటాయించడంపట్ల పంట దిగుబడి దెబ్బతిని, ఆహారోత్పత్తి తగ్గి, ఆహార భద్రతకు ప్రమాదం వస్తుందన్న వాదనకు ఆయన జవాబు ఇది. సెజ్‌లపై విమర్శకులు లేవనెత్తిన అనేక అంశాలలో ఆహార భద్రత సమస్య కూడా ఒకటి. అదొకటే అభ్యంతరం కాదు. ఇతర అంశాలపై సమాధానం చెప్పకుండా ఆయన తప్పించుకున్నారు.

రైతులు, ప్రజలు 'అభివృద్ధి' అంటే ఉలిక్కిపడే రోజులొచ్చాయి. అభివృద్ధి అంటే పరిశ్రమల కోసం, సెజ్‌ల కోసం, రోడ్ల వెడల్పు కోసం, మాల్స్ కోసం, రైతుల భూములు లాక్కొని వారిని వీథుల్లోకి నెట్టి, ఒక నూతన ధనిక ప్రపంచాన్ని నిర్మించడం, మరొక వైపు దారిద్రీకరణను పెంచడంగా ప్రజలు భావిస్తున్నారు.

**సెజ్‌లు ఎలా ప్రకటిస్తారు ?**

కేంద్ర ప్రభుత్వం స్వయంగా సెజ్‌లను ఏర్పాటు చేయవచ్చు. రాష్ట్ర ప్రభుత్వాలు సెజ్‌లపై ఆసక్తి ఉన్న డెవలపర్స్ పెట్టే దరఖాస్తులను, కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసే ప్రత్యేక బోర్డు పరిశీలించి నిర్ణయం చేస్తుంది. ప్రపంచీకరణ నేపథ్యంలో ఎగుమతులు - దిగుమతుల వ్యాపారం ప్రాధాన్యత వహిస్తుంది. కొన్ని ఇతర దేశాలతో పోల్చినప్పుడు మనం వెనుకబడిపోతున్నామన్న భయం, వేగంగా ఆర్థికాభివృద్ధి రేటును పెంచాలన్న తపన నుంచి సెజ్‌ల పట్ల క్రేజ్ పాలక వర్గాలలో పెరిగింది. కొన్ని రకాల ఎగుమతులలో ఇంతకు ముందే కొన్ని ప్రోత్సాహకాలు ఉన్నాయి. కాని అవి చాలడంలేదని ఈ సెజ్‌లు ప్రారంభించారు. వివిధ శాఖల అనుమతులు ఆలస్యం కాకుండా 'ఏకగవాక్షం' (సింగిల్‌విండో) ద్వారా వేగంగా సెజ్‌లో లభిస్తాయి.

సెజ్‌లో ఏర్పాటైన పారిశ్రామిక, వాణిజ్య సంస్థలకు ఆకర్షణీయమైన రాయితీలు లభిస్తాయి.

1 కస్టమ్స్ డ్యూటీ, కేంద్ర ఎక్సైజ్ డ్యూటీ, సర్వీస్ టాక్స్, సెంట్రల్ సేల్స్ టాక్స్, సెక్యూరిటీ ట్రాన్సాక్షన్ టాక్స్‌ల రాయితీ ఈ సంస్థలకు, డెవలపర్స్‌కు లభిస్తాయి.

2 గతంలో ఏడేళ్లపాటు ఉన్న పన్నుల రాయితీ 15 సంవత్సరముల వరకు పెంచారు. (1) మొదటి 5 సంవత్సరములలో వందశాతం రాయితీ (2) ఐదు సంవత్సరాలు పూర్తయిన తర్వాత 10 సంవత్సరముల వరకు యాభైశాతం పన్ను రాయితీ (3) ఆఖరి 5 సంవత్సరములలో ఎగుమతుల లాభాలలో యాభైశాతం రాయితీ

3 సెజ్‌లు ఏర్పాటు చేసిన డెవలపర్స్‌కు 10 సంవత్సరముల వరకు ఆదాయ పన్నులో వంద శాతం రాయితీ.

ప్రభుత్వం స్వంతంగా పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టలేదనే సాకుతో ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యం పేరుతో ప్రభుత్వం భూమి కేటాయించి, పన్నుల రాయితీలు ఇచ్చేట్లు, ప్రైవేట్ సంస్థలు మౌలిక సదుపాయాలు ఏర్పాటు చేసి (భూమి చదును చేయడం, రోడ్లు వేయడం, విద్యుచ్ఛక్తి, నీరు ఏర్పాటు చేయడం, ప్లాట్లు కేటాయింపు వగైరాలు) డెవలపర్స్ చేస్తారు. బ్యాంకులు, రుణ సౌకర్యాలు, విమానాశ్రయాలు, రేవులు, రైళ్ల ద్వారా రవాణాను మళ్లీ ప్రభుత్వమే సహాయం చేయాలి. విదేశాలకు ఎగుమతి కోసం ప్రత్యేక రేవులను కేటాయిస్తున్నారు.

సెజ్‌ల ఏర్పాటుకు కేంద్రమే కాక జోనల్ కమిటీలను ఏర్పాటు చేశారు. వారు దరఖాస్తులను అంగీకరించడానికి, నిరాకరించడానికి,

అందులోని అంశాలను మార్చడానికి హక్కుంది. జోనల్ స్థాయిలో సెజ్‌లన్నీ పరిపాలనాంశాలపై అధికారం గల డెవలప్‌మెంట్ కమిషనర్ (అభివృద్ధి కమిషనర్) ఉంటారు. కార్మిక చట్టాలకు సంబంధించి, లేబర్ కమిషనర్ అధికారాలు కూడా అభివృద్ధి కమిషనర్‌కు బదలాయించారు. క్లాజ్ 23 ప్రకారం రాష్ట్ర ప్రభుత్వాలు సెజ్‌లలో వచ్చే సివిల్ కేసులు, నోటిఫై చేయబడిన రకాల నేరాలు విచారించేందుకు ప్రత్యేక కోర్టులు ఏర్పాటు చేస్తుంది. వీటిపై అప్పీలు ఆయా రాష్ట్రాల హైకోర్టులకు చేసుకోవచ్చును.

ఇన్ని అసాధారణమైన రాయితీలు, ప్రత్యేక సౌకర్యాలు కలిగించి, భారత ఆర్థిక వ్యవస్థకు ఎంత పటిష్టత చేకూరుతున్నట్లు? నిజంగా దేశాభివృద్ధికి ఇవి ఉపయోగపడితే దీనిని సానుకూలంగా పరిశీలించవచ్చును. కాని ఫలితాలు అలా లేవు.

ప్రస్తుతం పనిచేస్తున్న సెజ్‌లు : 16

ఇందులో ఎనిమిది ఎగుమతి ప్రాసెసింగ్ జోన్స్‌ను సెజ్‌లుగా మార్చారు.

| | |
|---|---|
| ప్రభుత్వ పెట్టుబడులు | : రు. 948 కోట్లు |
| ప్రైవేట్ పెట్టుబడులు | : రు. 2841 కోట్లు |
| మొత్తం | : రు. 3789 కోట్లు |
| ఎగుమతులు | : రు. 22,511 కోట్లు |
| ఉపాధి | : 1,23,440 మంది |

| అంశం | సంఖ్య | భూమి అవసరం |
|---|---|---|
| నోటిఫై చేయబడిన సెజ్‌లు | 41 | 3,36,468 ఎకరాలు |
| సూత్రబద్ధంగా అనుమతి ఇవ్వబడినవి | 166 | - |
| ఫార్మల్‌గా అనుమతి | 237 | 86,400 ఎకరాలు |
| వాయిదా వేయబడిన ప్రతిపాదనలు | 173 | 1,03,565 ఎకరాలు |
| కొత్తగా వచ్చిన దరఖాస్తులు | 73 | |

ఇంత పెద్ద ఎత్తున వ్యవసాయ భూములు కేటాయిస్తూ, దాని ప్రాధాన్యతను తగ్గించి చూపటం అధికారుల మోసపూరిత చర్య.

గతంలో ఏదో ఒక ప్రత్యేక రంగానికి సంబంధించిన ఉత్పత్తులు, ఉదాహరణకు ఆభరణాలు లేక ఐటి లాంటి వాటికి సెజ్‌లు కేటాయించబడేవి. ఇప్పుడు బహుళ ఉత్పత్తుల కోసం సెజ్‌లు కేటాయిస్తున్నారు. ఆసియా ఖండంలోనే మొదటి ఎగుమతి జోన్‌ను భారతదేశంలో గుజరాత్‌లోని కాండ్లారేవులో 1965లోనే ఏర్పాటు చేశారు. ఇది విజయవంతంగానే నడిచిందని ప్రభుత్వవాదన. ఈ మధ్య వచ్చిన అనుభవాలను బట్టి సెజ్‌లకు అనుమతులు పెంచుతున్నామన్నారు. గత సంవత్సరం మొత్తం భారత ఎగుమతుల్లో సెజ్‌ల ద్వారా జరిగింది 5 శాతం మాత్రమే. దేశంలోని మొత్తం పారిశ్రామిక పెట్టుబడిలో సెజ్‌ల పెట్టుబడి 1 శాతం ఉండగా, ఉపాధి కల్పన 0.32 శాతం మాత్రమే. స్థానికంగా ఆర్థికాభివృద్ధికి, నైపుణ్యంలేని స్థానిక కార్మికులకు ఉపాధిలో తగినంత సహాయం చేయలేక పోయాయి.

దేశ ఆర్థికాభివృద్ధికి ఎగుమతుల పెరుగుదల అవసరమే అయినప్పటికీ, ఇన్ని పన్నుల రాయితీలు దీనికి అవసరంలేదు. సెజ్‌ల ఏర్పాటుపై న్యాయబద్ధంగానే తీవ్ర విమర్శలు, అభ్యంతరాలు వస్తున్నాయి.

1 సెజ్‌ల పేరుతో రాయితీలిస్తున్నందున, బయట ఉన్న పరిశ్రమలనే, సెజ్‌ల ఆవరణలోకి మార్చి రాయితీలు పొందే సంస్థలున్నాయి. కొత్త పెట్టుబడిరాదు. రాయితీల రూపంలో కోట్ల రూపాయల అదనపు లాభాలు దండుకుంటారు. నూతన పెట్టుబడుల కోసం సెజ్‌లన్న వాదన పసలేనిదే.

2 సాంప్రదాయకంగా దశాబ్దాల తరబడి పెద్ద ఎత్తున ఉత్పత్తులు సాగించి, ఎగుమతులు చేస్తున్న పారిశ్రామిక సంస్థలకు లేని రాయితీలు సెజ్‌లోని సంస్థలకిచ్చినందున, వివక్ష చూపడం అనివార్యమవుతుంది. వారిలో తీవ్ర అసంతృప్తి పెరుగుతుంది.

3 సెజ్‌ల కోసం రాయితీలు విదేశ ఎగుమతుల కోసం ఇచ్చే రాయితీలు, స్వదేశంలో భారత ప్రజల కోసం చేసే ఉత్పత్తుల పైన అన్ని రకాల పన్నులు వేస్తూ విదేశీయుల కోసం చేసే ఉత్పత్తుల పైన రాయితీలు ఇవ్వటం దేశ ప్రజలపై అసాధారణమైన వివక్ష అవుతుంది. 'అయినవారికి ఆకుల్లో కాని వారికి కంచాల్లో' అన్న సామెత వర్తిస్తుంది.

4 సెజ్‌లకు ఎంత భూమి కావాల్సి ఉంటుందన్న అవగాహన ప్రభుత్వానికి లేదు. అందువల్ల అవసరమైన దానికంటే 10 రెట్లు, వందరెట్లు భూమిని కంపెనీలు డిమాండ్ చేయటం, ప్రభుత్వం కేటాయించడం, భవిష్యత్తులో అదనపు భూమిని రియల్ ఎస్టేట్‌కు ఉపయోగించుకోవటం వారి ఆలోచనలగా ఉంది. ముంబై ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లోకి 400 మీటర్ల ప్లాటు వేలం వేస్తే 84 కోట్లు పలికింది. దానికి దగ్గరలోనే 35,000 ఎకరాలు అంబానీలు తమ సెజ్‌ల కోసం ప్రతిపాదించారు. ఢిల్లీ నగరానికి దగ్గర్లో యుపిలోని ఘజియాబాద్ జిల్లాలో అనిల్ అంబానీకి 25,000 ఎకరాలు పారిశ్రామికీకరణకు కేటాయిస్తే, పంజాబ్‌లో ముఖేష్ అంబానీకి 20,000 ఎకరాలు కేటాయించారు. రైతుల దగ్గర తక్కువ ధరకు బలవంతంగా కొని, బడా పారిశ్రామిక సంస్థలకు కట్టబెట్టడం రైతాంగ వ్యతిరేక చర్య.

5 ఏ రకమైన ఉత్పత్తులకు, ఎగుమతులకు డిమాండ్ ఉందో వాటి కోసం సెజ్‌లు కేటాయించడం కాక, బహుళ ఉత్పత్తులు కేటాయించడం మంత్రిత్వశాఖలో అస్పష్టత గందరగోళాన్ని సూచిస్తున్నది. పన్నుల రాయితీల కోసం ఏదో పేరుతో దరఖాస్తులు ఇస్తున్నారు. ప్రభుత్వం అంతే అరాచకంగా కేటాయిస్తున్నది. ఇది సెజ్‌ల లక్ష్యాన్ని నెరవేర్చదు.

6 విదేశీ పెట్టుబడులను సెజ్‌లలో ఆహ్వానిస్తున్నారు. విదేశీ పెట్టుబడితో దాదాపు ఉచిత మౌలిక సదుపాయాలు, భూమితో పరిశ్రమలు ఏర్పాటు చేసి, భారత దేశంలో తక్కువ వేతనాలతో కార్మికులతో పనిచేయించుకొని, అన్ని రకాల పన్నుల రాయితీలు పొంది, విదేశాలకు ఎగుమతులు చేసి, లాభాలను కూడా ఎగుమతి చేస్తారు. కొద్దిమంది కార్మికులకు పని దొరకటం, భారత భాగస్వాములుంటే వారికి కొంత లాభం మినహా దేశానికి ఏం ఒరుగుతుంది? పన్నుల రాయితీల నష్టం తప్పదు. దేశం నుంచి ఎగుమతులు మరికొన్ని

వందల, వేల కోట్లు చేశామన్న లెక్కలు రాసుకోవడానికి జాతీయ ఆర్థికాభివృద్ధి రేటు పెరుగుదల రికార్డులో అదనంగా చేర్చుకోవటం ద్వారా సంతృప్తి పొందటానికి మాత్రమే ఉపయోగపడుతుంది.

7 సెజ్‌లలో వ్యాపార, పారిశ్రామిక సంస్థల ఫ్యాక్టరీల ఏర్పాటుతోపాటు, అందులో పెట్టుబడులు పెట్టిన వారికి, ఉద్యోగులకు అవసరమైన నివాసానికి ఫ్లాట్లు, ఇళ్లు, ఆస్పత్రులు, పౌర జీవనానికి అవసరమైన ఏర్పాట్లు వారే చేసుకోవచ్చు. అక్కడ జరిగే నేరాలకు (నోటిఫైడ్ అఫెన్సెస్) చట్టవిరుద్ధ కార్యక్రమాలపై పోలీసులకు, న్యాయవ్యవస్థకు అధికారం లేదు. ప్రత్యేక కోర్టులుంటాయి. విదేశీ రాయబార కార్యాలయాలకుండే ఈ ప్రత్యేక హక్కులు, భారత భూభాగంలో విదేశీ భూఖండాలలోని హక్కులు భారతదేశ సార్వభౌమత్వాన్ని తాకట్టు పెట్టే హేయమైన చర్య.

8 సెజ్‌లలో అన్ని రాయితీలతోపాటు కార్మిక చట్టాలకు కూడా చెల్లుచీటి ఉంటుంది. లేబర్ కమిషనర్ అధికారాలు డేవలప్‌మెంట్ కమిషనర్‌కు బదలాయించబడ్డాయి. భారతదేశంలో విదేశీ స్వదేశీ పెట్టుబడిదార్లు 'ఆర్థిక సంస్కరణల్లో' భాగంగా లేబర్ చట్టాలను సరళీకరించాలని డిమాండ్ చేస్తున్నారు. సమ్మె హక్కులేని, యూనియన్లులేని, లేబర్ కమిషనర్‌లేని సెజ్‌లలో కార్మికుల సంక్షేమం, ఉద్యోగ భద్రతకు అవకాశాలు ఎలా ఉంటాయో ఊహించుకోవచ్చు. ట్రేడ్ యూనియన్లు ఉన్నా బయటి నాయకులుండరాదన్న షరతు కొన్ని సెజ్‌లలో పెడుతున్నారు. ఇది కార్మిక వ్యతిరేక చర్య.

9 సారవంతమైన వ్యవసాయ భూమి లక్షలాది ఎకరాలు గనుల త్రవ్వకం కోసం, నగరాల విస్తరణ కోసం, నాలుగులైన్ల, ఆరు, ఎనిమిది లైన్ల రోడ్ల కోసం, పరిశ్రమలు కోసం కేటాయించడం, రాను రాను ఆహార భద్రత సమస్యను కలిగిస్తుంది. లక్షలాది రైతులను వారి కుటుంబాలను వీధుల్లోకి నెట్టుతుంది. వీటి ద్వారా ఎంత మందికి నూతన ఉపాధి ఉద్యోగావకాశాలు వస్తాయో అంతకంటే ఎక్కువ సంఖ్య, నిరుద్యోగానికి, దీర్ఘ దారిద్రానికి గురౌతారు. ఇచ్చే నష్టపరిహారం చేసిన అప్పులకుపోతే రైతు బికారిగా మిగుల్తాడు. జాతీయ ఆర్థికాభివృద్ధి రేటు ఇండెక్సు పైకి పోతుంది. మరికొన్ని లక్షల రైతుల కుటంబాలు దారిద్రరేఖ దిగువకు బలవంతంగా నెట్టబడుతారు. భూపరిమితి చట్టాలు గాలికి పోతాయి. కొత్త జమిందార్లు, భూకామంధులు, రియల్ ఎస్టేటుదార్లు చట్టబద్ధంగా ఆవిర్భవిస్తారు. ఇప్పటికే సంక్షోభంలో ఉన్న వ్యవసాయ రంగం మరింత సంక్షోభంలోకి కూరుకపోతుంది.

10 సెజ్‌ల ఏర్పాటుకు అంగీకరించి, భూమి కేటాయించిన తర్వాత దాని ఏర్పాటుకు పరిమితిలేదు. ఎగుమతుల లక్ష్యం విఫలమైతే శిక్షలేదు. గతంలో ప్రభుత్వ విధానాల వల్ల ఎగుమతుల ప్రోత్సాహకాలు విఫలమైతే, ఇప్పుడు మరిన్ని రాయితీలిస్తున్నారు.

ఈ అంశాలేకాక సెజ్‌ల ఏర్పాటు పట్ల మంత్రివర్గంలో కూడా అభిప్రాయభేదాలున్న మాట బహిరంగమే. స్వయంగా ఆర్థిక మంత్రి సెజ్‌ల సంఖ్య పెంచేందుకు వ్యతిరేకం. ఇప్పటికి ఏర్పాటైన సెజ్‌లకిచ్చే పన్ను రాయితీల వల్ల, రాబోయే 4 సంవత్సరాల కాలంలో దాదాపు లక్ష కోట్లు (సరిగ్గా చెప్పాలంటే 97,900 కోట్లు) దేశానికి నష్టం వాటిల్లుతుంది. సెజ్‌లలో దీర్ఘకాలంలో వచ్చే లాభాలు దీనిని పూడ్చటం అసాధ్యం.

సారవంతమైన వ్యవసాయ భూములు పెద్ద విస్తీర్ణంలో సెజ్‌లకు కేటాయించవద్దని యు.పి.ఎ అధ్యక్షురాలు శ్రీమతి సోనియాగాంధీ కాంగ్రెస్ ముఖ్యమంత్రులకు హితవు పలికింది. ఇష్టాపూర్తిగా పన్నుల రాయితీలు ఇవ్వకుండా జాగ్రత్త వహించాలని ప్రధాని హితవు చెప్పారు. కాని స్వయంగా కేంద్రమే ఈ రాయితీలిస్తున్నది. ఆయన దానిని సరిచేయాలి. సెజ్‌ల ఏర్పాటుకు, రిజర్వ్‌బ్యాంక్ రియల్ ఎస్టేట్‌ల ఏర్పాటుగానే చూస్తున్నది. కాని సెజ్‌ల కేటాయింపు కొనసాగుతున్నది. ప్రజా ఆందోళన ద్వారానే దానిని ఆపాలి.

వామపక్షాలు ఆర్థికాభివృద్ధికి వ్యతిరేకంకాదు. పెట్టుబడిదారి వ్యవస్థలో ఆర్థికాభివృద్ధి జరిగి సంపదను సృష్టించినా అది కేంద్రీకృత మవుతున్న తీరు ధనిక-పేద వర్గాల మధ్య వ్యత్యాసాన్ని పెంచుతున్న విషయం గమనంలోకి తీసుకుంటూనే, దానిపై సైద్ధాంతిక రాజకీయ పోరాటాలకు సిద్ధమవుతూనే పరిమితంగానైనా ఉద్యోగ, ఉపాధి అవకాశాలు పెంచే ఆర్థికాభివృద్ధిని ఆహ్వానిద్దాం.

**ఏం చేయాలి? :**

1 సెజ్‌ల ఏర్పాటు అడ్డదిడ్డంగా, అరాచకంగా జరగకూడదు. దానికి సహేతుకమైన పరిమితి ఉండాలి.

2 ఖచ్చితమైన ఎగుమతుల డిమాండ్ ఉన్న ఉత్పత్తులకే కేటాయించాలి.

3 వ్యవసాయానికి పనికిరాని భూములు మాత్రమే సెజ్‌లకు కేటాయించాలి.

4 రైతుల భూములు అనివార్యంగా కొద్ది మొత్తంలో తీసుకుంటే న్యాయమైన నష్టపరిహారంతోపాటు అంతే భూమిని ప్రత్యామ్నాయంగా ఆ రైతులకు కేటాయించాలి.

5 సెజ్‌లకు విదేశీ భూభాగాలకిచ్చే హక్కులు రద్దుచేసి, న్యాయస్థానాల, చట్టబద్ధ పరిపాలన చెల్లుబాటు చేయించాలి.

6 భూములను లీజుకు మాత్రమే ఇవ్వాలి. తర్వాత కాలంలో రియల్ ఎస్టేట్‌కు, ఇతర కార్యక్రమాలకు వాడుకుంటే తిరిగి వాపసు తీసుకోవాలి.

7 సకాలంలో సెజ్‌లు పని ప్రారంభించకపోయినా ఎగుమతుల లక్ష్యంలో సగానికి కూడా చేరలేని వైఫల్యమున్నా దానిని రద్దుచేయాలి. ఆ భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి.

8 ఇప్పటికే పెద్ద ఎత్తున రైతుల భూములు తీసుకున్న రైతులను కూడా, ఆయా సెజ్‌ల డెవలపర్స్‌తో భాగస్వాములుగా ప్రకటించి, వారికి వచ్చే లాభాలలో రైతులకు వారి వాటా ఇచ్చేట్లు చట్టంలో మార్పుతేవాలి.

9 అన్ని సెజ్‌లలో అన్ని కార్మిక చట్టాలు పూర్తిగా అమలు అయ్యేట్లు చట్టం సవరించాలి.

10 సెజ్ చట్టాన్ని మొత్తంగా పునరాలోచించాలి. వామపక్షాలు కోరిన సవరణలతో కొత్త చట్టం తేవాలి. ◆

**సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్, ఐటి ఆధారిత సేవలు**

| క్ర.సం. | సంస్థ పేరు | స్థలం | విస్తీర్ణం (హె॥) |
|---|---|---|---|
| 1 | విప్రో లిమిటెడ్ | హైదరాబాద్ | 6 |
| 2 | రహేజా ఐటీ పార్క్ ప్రైవేట్ లిమిటెడ్ | మాదాపూర్, రంగారెడ్డి జిల్లా | 36.62 |
| 3 | ఐటీ అండ్ కమ్యూనికేషన్ డిపార్ట్‌మెంట్ | ఎపిఐఐసి, మధురవాడ, విశాఖపట్నం | 16 |
| 4 | సత్యం కంప్యూటర్ సర్వీసెస్ లిమిటెడ్ | తట్లకొండ, విశాఖపట్నం | 20.23 |
| 5 | సత్యం కంప్యూటర్ సర్వీసెస్ లిమిటెడ్ | బహదూర్‌పల్లి, హైదరాబాద్ | 10.52 |
| 6 | సత్యం కంప్యూటర్ సర్వీసెస్ లిమిటెడ్ | హైదరాబాద్ | 12.14 |
| 7 | ఎపి టెక్నో ప్రాజెక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ | మాదాపూర్, హైదరాబాద్ | 10 |
| 8 | సిఏ కంప్యూటర్ అసోసియేట్స్ ఇండియా | నానకరాంగూడ, రంగారెడ్డి జిల్లా | 12.14 |
| 9 | ఐటీ అండ్ కమ్యూనికేషన్ శాఖ, ఎపిఐఐసి | మధురవాడ, విశాఖపట్నం | 36 |
| 10 | ఐటీ అండ్ కమ్యూనికేషన్ శాఖ, ఎపిఐఐసి | కేసరపల్లి, కృష్ణా జిల్లా | 12 |
| 11 | ఎపిఐఐసి | నానక్‌రాంగూడా, రంగారెడ్డి జిల్లా | 20.53 |
| 12 | సిఎంసి లిమిటెడ్ | గచ్చిబౌలి, హైదరాబాద్ | 20.59 |
| 13 | సంఘీ ఇండస్ట్రీస్ లిమిటెడ్ | రంగారెడ్డి జిల్లా | 202.4 |
| 14 | ఫ్యాబ్ సిటీ ఎస్‌పిసి (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ | హైదరాబాద్ | 486 |
| 15 | భావనసాయి అసోసియేట్స్ | మంథన, కేసరపల్లి | 25 |
| 16 | ఎపిఐఐసి | మహేశ్వరం, రంగారెడ్డి జిల్లా | 111 |
| 17 | దివ్యశ్రీ ఎన్ఎస్ఎల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్ | రాయదుర్గం, రంగారెడ్డి జిల్లా | 15.175 |
| 18 | ల్యాంకో మంత్రి టెక్ పార్క్ ప్రైవేట్ లిమిటెడ్ | రంగారెడ్డి జిల్లా | 11.77 |
| 19 | ఇత్తిన ప్రాజెక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్ | శేరిలింగంపల్లి, రంగారెడ్డి జిల్లా | 20 |
| 20 | బ్రాహ్మణి ఇన్‌ఫ్రాటెక్ ప్రైవేట్ లిమిటెడ్ | మామిడిపల్లి | 60.721 |
| 21 | ఇందూ టెక్నొజోన్ ప్రైవేట్ లిమిటెడ్ | కంచ ఇమారత్, మహేశ్వరం, రంగారెడ్డి జిల్లా | 60.7 |
| 22 | టాప్ వాచ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్ | ఉప్పల్ ఐడిఎ, హైదరాబాద్ | 11.735 |
| 23 | ఎమార్ హిల్స్ టౌన్‌షిప్ ప్రైవేట్ లిమిటెడ్ | రంగారెడ్డి జిల్లా | 10.33 |
| 24 | నవయుగ ఇంజనీరింగ్ కంపెనీ లిమిటెడ్ | శేరిలింగంపల్లి, రంగారెడ్డి జిల్లా | 10.218 |
| 25 | జెన్‌ప్యాక్ట్ ఇండియా | రంగారెడ్డి జిల్లా | 20.23 |
| 26 | జెటి. హోల్డింగ్స్ ప్రైవేట్ లిమిటెడ్ | కంచఇమారత్, రావిర్యాల, రంగారెడ్డి జిల్లా | 28.33 |
| 27 | రుద్రదేవ్ ఇన్ఫో పార్క్ ప్రైవేట్ లిమిటెడ్ | కిస్టాపూర్, చేవెళ్ల, రంగారెడ్డి జిల్లా | 12.42 |
| 28 | మార్గ్ బిజినెస్ పార్క్ ప్రైవేట్ లిమిటెడ్ | కొత్రమంగళం, తిరుపతి | 10.12 |
| 29 | మహావీర్ స్కైక్రేపర్స్ లిమిటెడ్ | చేవెళ్ల, రంగారెడ్డి జిల్లా | 40.47 |
| 30 | స్టార్‌గేజ్ ప్రాపర్టీస్ ప్రైవేట్ లిమిటెడ్ | కంచఇమారత్, మహేశ్వరం, రంగారెడ్డి జిల్లా | 68.96 |
| 31 | మేతాస్ ప్రాపర్టీస్ ప్రైవేట్ లిమిటెడ్ | బాచుపల్లి, కుత్బుల్లాపూర్ (మం), రంగారెడ్డి జిల్లా | 29.85 |
| 32 | మేతాస్ ప్రాపర్టీస్ ప్రైవేట్ లిమిటెడ్ | గుండ్లపోచంపల్లి, మేడ్చల్ (మం), రంగారెడ్డి జిల్లా | 14.16 |
| 33 | మేతాస్ ప్రాపర్టీస్ ప్రైవేట్ లిమిటెడ్ | గోపన్‌పల్లి, శేరిలింగంపల్లి, రంగారెడ్డి జిల్లా | 15.92 |

## చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. అంటే ఏ నెల సంచిక ఆ నెల మొదటి వారానికల్లా పాఠకులకు చేరుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారం లోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

**- సర్క్యులేషన్ మేనేజర్**

**99493 91028**

# రాజ్యాంగాతీతమయిన అధికారాలతో కొత్త రాజ్యాలు

– మాడభూషి శ్రీధర్

తీవ్ర విమర్శలు, రాజ్యాంగ వివాదాల మధ్య స్పెషల్ ఎకనామిక్ జోన్‌ల ఆవిర్భావం జరుగుతున్నది. ముమ్మరమయిన అభివృద్ధికి వేలకోట్ల రూపాయల పెట్టుబడులకు ఎస్ఇజడ్‌లు వేదికలు కాబోతున్నాయి. విదేశీ పెట్టుబడులు, ప్రపంచీకరణ, ఉదార ఆర్థిక విధానాలు, శాసనాల పట్టు సడలింపులతో సహా అనేకానేక మినహాయింపులతో ప్రత్యేక సదుపాయాలతో, ఎస్ఇజడ్‌లు ఈ దేశ స్వరూపాన్ని మార్చబోతున్నాయి. అది మంచికేనా? ఎవరి మంచికోసం? ఈ దేశం సుస్థిర ప్రగతికి ఎస్ఇజడ్‌లు పునాదులా? కాదా? అనే ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వివాదాలు చెలరేగుతున్నాయి.

కనీసం నాలుగువందల ఎస్ఇజడ్‌లు అవతరించడానికి శరవేగంగా నిర్మాణాలు, వనరుల కల్పన జరిగిపోతున్నది. అరచేతిలో స్వర్గాలు అవతరించబోతున్నాయి. వీటి స్థాయి ప్రపంచ స్థాయి. కనీసం అయిదు వేల హెక్టార్ల విస్తీర్ణంలో నిర్మాణమయ్యే ఈ సముదాయాలకోసం భూమి సేకరణకు కనీసం రు. 9,325 కోట్ల రూపాయలువెచ్చిస్తారు. మరో ఎనిమిది వేలకోట్లతో 2000 మెగావాట్ల విద్యుచ్ఛక్తి, రు. 800 కోట్లతో డీసాలైనేషన్ ప్లాంట్, రు. 200 కోట్లతో విమానాలు దిగడానికి చిన్న ఎయిర్‌పోర్ట్, రు. 500 కోట్లు ఖర్చుచేసి ఒక జెట్టీ రెండు బెర్త్‌లతో చిన్న రేవు మొదలయిన సర్వాహంగులతో ఈ చిన్ని నగరాలు మొత్తం 18 వేల 825 కోట్ల రూపాయలతో రూపుదిద్దుకోబోతున్నాయి. కనీసం 263 కంపెనీలు అనుమతులు అందుకున్నాయి. మరో 169 కంపెనీలకు అనుమతులు లభించడానికి అన్ని లాంఛనాలు పూర్తయ్యాయి. మహారాష్ట్రలో రెండు ఎస్ఇజడ్‌లకు 30 వేలకోట్లరూపాయలను గుమ్మరించడానికి రిలయన్స్ సిద్ధంగా ఉంది. హర్యానాలో మరో ప్రత్యేక ఆర్థిక మండలానికి 40 వేలకోట్లు వెచ్చించడానికి కూడా రిలయన్స్ వెనుకాడడం లేదు. అమృత్‌సర్, అంబారా, లుధియానా, గుర్‌గాంవ్‌లలో నాలుగింటికి 41 వేలకోట్ల రూపాయలతో డిఎల్ఎఫ్ ముందుకు వస్తున్నది. హర్యానా హిమాచల్ ప్రదేశ్‌లలో రెండింటికోసం డిఎస్ గ్రూప్ 12 వేల కోట్ల రూపాయల ప్రణాళిక రూపొందించింది. పూణే మంగళూర్‌లలో వేయి కోట్ల కన్న ఎక్కువ ఖర్చుతో భారత్ ఫోర్జ్, వీడియోకాన్, సుజ్లాన్ మొదలయిన కంపెనీలు ముందుకు వస్తున్నాయి. వీరంతా కలిసి మూడు లక్షల హెక్టార్ల భూమి కొని పెద్దపెద్ద ఫ్యాక్టరీలకు, ఐటి పార్క్‌లకు, కార్యాలయాల కాంప్లెక్స్‌లకు, గోదాములకు, నివాస నిలయాలకు ఆలవాలమయిన నగరాలను నిర్మిస్తారన్నమాట.

దాదాపు మూడు లక్షల హెక్టార్ల భూమిని కొని అభివృద్ధి చేసి విదేశీ స్వదేశీ పారిశ్రామిక వేత్తలకు అద్దెకు ఇచ్చే కార్యక్రమం ఇది. ఇది వరకు ప్రభుత్వం పారిశ్రామిక వాడలను నిర్మించింది. ఇప్పుడా పని ప్రయివేట్ వ్యక్తులకు అప్పగించారన్న మాట. చదరపు అడుగు నేలకు 138 రూపాయల కనీస ఖర్చు లెక్క వేస్తే 3 లక్షల 30 కోట్ల పెట్టుబడి అవసరం. ఇంకా పారిశ్రామిక వేత్తల అవసరాలకు అనుగుణంగా మలచడానికి ఖర్చు కూడా లెక్క వేస్తే పెట్టుబడి 5 లక్షల 50 వేల కోట్లు దాటుతుంది. ఈ దేశపు జిడిపిలో 10 నుంచి 17 శాతం సొమ్ముతో సమానమయిన నిధిని ఈ విధంగా రియల్ ఎస్టేట్ వ్యాపారానికి పెట్టబోతున్నారు. ఎన్నో దేశాల్లో ప్రభుత్వమే ఇటువంటి జోన్‌లను నిర్మించింది. కాని ప్రైవేట్ సంస్థలు నిర్మించి లాభాలుచేసుకున్న దాఖలాలు ఇంతవరకు లేవు. ఈ జోన్‌లలో ఇతర ప్రైవేట్ పారిశ్రామిక వేత్తలు మరిన్ని వందల కోట్లు పెట్టుబడితో వారి ఫ్యాక్టరీలు కట్టుకున్నారు. ఆ విధంగా కట్టుకుంటే లాభాలు వచ్చే అవకాశాలున్నాయి. దుబాయ్‌లో జెబెల్ ఆలీ ఫ్రీజోన్ అనే అతి పెద్ద సంస్థ 5 వేల వ్యాపార కేంద్రాలకు తగిన వనరులు లభించాయి. దుబాయ్ పాలకుడు షేక్ రషీద్ బిన్ సయీద్ అల్ మక్తూం ఈ ప్రాజెక్టులో 3 బిలియన్ల అమెరికన్ దాలర్లు ధారపోసాడు. తరువాత జెబెల్ అలీ ఫ్రీజోన్ గా పేరు పొందింది. రాజుగారు పెట్టుబడులను తిరిగివసూలు చేయబోనని మాఫీ చేసాడు. అప్పుడికా డబ్బు విలువ 9 బిలియన్లడాలర్లు. ఆతరువాత దాని యాజమాన్యం జెబెల్ అలీ ఫ్రీజోన్ యాజమాన్య అథారిటీకి మారింది. ఈ వాణిజ్యసంస్థ ప్రభుత్వ మద్దత్తుతో పెట్టుబడులను ఆకర్షిస్తూ, ఉద్యోగాలు కల్పిస్తూ, పారిశ్రామిక ఉత్పత్తులు పెంచడానికి దోహదపడుతూ, పన్ను మినహాయింపులు ఇస్తూ, చమురు లాభాలలో కొంత దీనికి మళ్లిస్తూ జోన్‌ను నిలబెడ్తున్నాయి. అంటే భూములు కొని రోడ్లు వేసినంత మాత్రాన పెట్టుబడులు విదేశీ పరిశ్రమలు వస్తాయని అనుకోవడానికి వీల్లేదని ఈ దుబాయ్ అనుభవం నుంచి గ్రహించాలి. చమురు నిధులు పుష్కళంగా ఉండి, రాయితీలు ఇచ్చే అవకాశాలు చూపి, ఇతర సదుపాయాలు కల్పించి ఈ జోన్ నిలబడిపోయింది. భారత దేశానికి ఇది సాధ్యమా అని ఆలోచించవలసిన అవసరం ఉంది.

**అందరికీ లాభాలువచ్చేనా**

చైనాలో కూడా ముందు ప్రభుత్వ పెట్టుబడులు బ్యాంకు రుణాలతోనే ఈ జోన్‌లు నిలబడ్డాయి. వాటి ఆశయం లాభాలు కాదు, పరిశ్రమలు ఎక్కువగా వచ్చే ప్రయత్నాలు చేయడం. మనదేశంలో పరిస్థితి వేరు. ఇక్కడ ప్రయివేట్ సంస్థలు లాభాపేక్షతో జోన్‌లు అభివృద్ధికి ముందుకు వస్తున్నాయి. కాని అందరికీ లాభాలు వస్తాయా? ఇన్ని చోట్ల వందలాది ప్రత్యేకజోన్‌లు కట్టి లాభాలు సంపాదించగలవా అన్నది అసలయిన ప్రశ్న. చెన్నయ్‌లో మహీంద్రా వరల్డ్ సిటీ ఎస్ఇజడ్ 1400 ఎకరాల్లో ప్రస్తుతం 35.4 కోట్ల నష్టంతో ఉందని బిజినెస్ పత్రికలు రాస్తున్నాయి. నవీ బొంబయ్‌లో రిలయన్స్ వారు తమకు మొదటి దశలో 90 శాతం అమ్ముడయితే వేయి కోట్ల లాభం వస్తుందని అంచనా వేస్తున్నారు. ఈ లాభాలు ఎలా వస్తాయి? ఎవరికి వస్తాయి? ఎప్పుడు వస్తాయి? అనేవి అసలయిన ప్రశ్నలు. దీనికి భూముల సేకరణ కోణం, రైతుల ఆక్రందనల కోణం కూడా జత అవుతాయి. మార్కెటింట్ తెలివి తేటలు జోడించి రైతును తక్కువ ధరకే అమ్మేట్లు బుట్టలోకి దింపి తరువాత

పెద్ద పెద్ద సంస్థలకు పెద్దధరలకు అమ్మి లాభాలు చేసుకోవడం ఈ జోన్ నిర్వాహకుల వ్యూహం అయి ఉండాలి.

**చట్టాలకు అతీతం, రాజ్యాంగానికి దూరం**

ఈ సమస్య కాకుండా మరొక ప్రమాదం ఉంది. ఈ ప్రత్యేక జోన్‌లన్నీ కప్పంగట్టకుండా ఎగవేసి స్వతంత్రం ప్రకటించుకున్న మాజీ సామంత రాజుల స్థాయినుంచి సార్వభౌమ కేంద్రాలుగా ఎదగడమే ఆ ప్రమాదం. ఎస్ఇజడ్‌ల చట్టం 2005 లో సెక్షన్ 49 అసలు సిసలు నియమం ఉంది. ఏ కేంద్ర చట్టంకూడా ఈ ఎస్ఇజడ్‌లకు వర్తించదు, ఏ కేంద్ర చట్టంలో నియంత్రణకూడా ఈ ఎస్ఇజడ్‌లపైన పనిచేయదు అని ఈ సెక్షన్ చెప్తున్నది. మంచినీటిసరఫరాతో సహా రోగాల నియంత్రణదాకా అన్ని పనులూ ఈ ఎస్ఇజడ్‌ల నిర్వాహకులే చేయాలి. చేసారో లేదో అడిగే చట్టపరమయిన అధికారం ఎవరికీ లేదు. చావులు పుట్టుకల ధృవీకరణ కూడా ఈ ప్రయివేటు కంపెనీలు చేయవచ్చు.

కనీసం ఈ చిన్న చిన్న సామ్రాజ్యాల్లో పనిచేసే వారికి తమ ప్రతినిధిని ఎన్నుకునే ప్రజాస్వామిక అధికారం లేదు. 74వ రాజ్యాంగ సవరణ ఈ మండలాలకు వర్తించదు. ఇక్కడ పారిశ్రామిక వివాదాల చట్టం, కంట్రాక్టు లేబర్ చట్టం, వీటికి రాష్ట్రాలు చేసిన సవరణల విషయంలో కార్మికులకు జనరల్‌గా నోటీసులు జారీ చేసారు. మహారాష్ట్ర మరొక అడుగు ముందుకు వేసి ఈ ఎస్ఇజడ్‌లన్నీ పబ్లిక్ యుటిలిటీ సర్వీసులని ప్రకటించింది.

ఎస్ఇజడ్ మండలాలలోని పరిశ్రమలన్నీ పర్యావరణ ప్రభావ అంచనా నివేదికలు ఇవ్వనవసరం లేదు. అంతేకాదు పర్యావరణ పరమయిన అభ్యంతరాలను జనం చెప్పుకోవడానికి వీలుగా బహిరంగ విచారణ జరపాల్సిన బాధ్యత కూడా లేదు.

ఈ మండలాల్లో పరిశ్రమలు విద్యుత్ చట్టం, విద్యుత్ పరమయిన పరిమితులకు కూడా లోబడి ఉండవు. ఆయా చట్టాలు ఇక్కడ వర్తించవు.

నష్టపోయిన మండలాలలను ఎస్ఇజడ్‌ల గుర్తింపు నుంచి మినహాయించి వేల హెక్టార్ల నేలను విముక్తి చేయడానికి వీల్లేదు. స్థూలంగా ఇవీ ఎస్ఇజడ్‌ల సర్వస్వతంత్ర, సర్వసత్తాక సార్వభౌమ నియమాలు. రిలయన్స్ వంటి స్వదేశీ సంపన్నులు గానీ లేక మరే విదేశీ సంపన్న సంస్థగానీ ఒక్క ఎస్ఇజడ్ పెడతే చాలు, అక్కడ వారిదే ఇష్టారాజ్యాం, ఇష్టారాజ్యాంగం. అదొక చిన్న రాజ్యం. ఆ ప్రభువులపైన ఏ దేశ శాసనాలూ కొరడా ఝళిపించడానికి వీల్లేదు. కనీసం వీరు తమదైన ఏ శాసనానికయినా బద్ధులవుతారో లేదా అని అడగడానికి కూడా వీల్లేదు. వీరు మన భారత రాజ్యాంగం నుంచి కూడా విముక్తులా కాదా అని రాయలేదు కాని, ఎస్ఇజడ్‌ల చట్టం, 2005 నియమాల జోరు చూస్తే రాజ్యాంగం కూడా కేంద్ర శాసనమే కనుక అదీ వర్తించదనే సాధారణ మినహాయింపు ఉంది కనుక అది మాత్రం వర్తించడం ఎందుకని ఈ కంపెనీల తరఫున నిపుణులయిన లాయర్ శిఖామణులు వాదించే అవకాశాలు లేకపోలేదు. కార్పొరేట్ ప్రభువుల సొంత నియంతృత్వ పాలనకు ఈ ఎస్ఇజడ్ చట్టం ఒక పూలబాట, ఎర్ర తివాచీ. మనకు మనమే ప్రభువులం, ఈ దేశ పౌరులే ఈ దేశానికి ఇచ్చుకున్న అద్భుత శాసనమాతృక అయిన రాజ్యాంగం అనిమనం గొప్పలు చెప్పుకోవడం వల్ల ప్రయోజనం లేదు ఎందుకుంటే ఆ సర్వ స్వతంత్ర భావనకు, రాజ్యాంగ రక్షణా పరిధికి ఈ చట్టం ద్వారా ఎస్ఇజడ్‌లకు మినహాయింపు ఇచ్చేసింది.

అటు పర్యావరణ శాసనాలూ వర్తించవంటూ, ఇటు కార్మిక శాసనాలనుంచీ మినహాయింపులిచ్చి, విద్యుచ్ఛక్తి ఇతర అంశాలన్నీ మీ ఇష్టమే అంటూ వదిలేసే ఈ సరికొత్త 'మండలాధీశుల' రాజ్య చట్టాన్ని చేయడం తీవ్రమయిన విషయం. నిజానికి పర్యావరణం, విద్యుచ్ఛక్తి, కార్మికులు అనే అంశాలపైన కేంద్ర రాష్ట్రాలు చట్టాలు చేసుకోవచ్చునని రాజ్యాంగం అధికార విభజన నియమాలలో వివరించింది. ఎస్ఇజడ్‌ల విషయంలో ఈ అంశాలపైన శాసనాలు చేసే అధికారాన్ని కేంద్రం రాష్ట్రాలకు వదిలేసింది. అంటే తమకు తోచిన విధంగా శాసనపరమయిన వరాలు ఇచ్చుకునే వీలు ఆయా రాష్ట్రాలకు ఉందన్నమాట. ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలనిర్మాణానికి ఇంకా ఎక్కువ మినహాయింపులు ఏమయినా అవసరమో కాదో నిర్ణయించి ఆయా కొత్త నియమాలను రాష్ట్ర శాసనాల్లో చేసుకోవచ్చునన్న మాట. మహారాష్ట్ర, ఆంధ్ర ప్రదేశ్ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాలు తమకు అనుకూలమయిన నియమాలు చేసుకున్నాయి. చట్టం కింద రూల్స్ చేసుకునే స్వతంత్రం రాష్ట్రాలకు ఉంది. కేంద్రం పరిధిలోనే కార్మిక చట్టాలనుంచి అన్ని ఎస్ఇజడ్‌లకు మినహాయింపు ఇద్దామని కేంద్ర ప్రభుత్వం అనుకుంది. కాని వామపక్షాల వత్తిడుల వల్ల ఆ పని మానుకుని, ఆయా అంశాలను రాష్ట్రాలు మినహాయించవచ్చని ఒక వెసులు బాటు కల్పించింది. కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల్లో ఈ అధికారాన్ని వినియోగించుకుని, ప్రత్యేక హోదాలను ఎస్ఇజడ్‌లకు కట్టబెట్టవచ్చు. మహారాష్ట్ర ఈ మండలాల్లో కాంట్రాక్టు కార్మికుల చట్టం సెక్షన్ 10(2) వర్తించదని పేర్కొంది. దీని అర్థం అంటే శాశ్వతంగా తాత్కాలిక కార్మికులను నియమించి వారిని పనిదోపిడీకి గురి చేసే సర్వాధికారాలు ఉంటాయన్న మాట. ఇక ఈ మండలాల్లో ఏ విధమయిన పరిశ్రమలు ఉన్నాసరే, ఉదాహరణకు కోకా కోలా బాట్లింగ్ కంపెనీ అయినా సరే, ప్రజాప్రయోజనాలకు అవసరమైన సేవా సంస్థలుగా గుర్తించుతారన్న మాట. చట్టం తెలియని వారికి ఇది మంచిదే అనిపిస్తుంది. కాని దీని అర్థం సమ్మెల పైన నిరంతర నిషేధం అని తెలుసుకోవాలి. పర్యావరణ సమస్యలు ఎన్ని ఉన్నా సరే, అనుమతులు రాబోవని భయపడనవసరంలేదు, ఈ మండలంలో మీరు ఫ్యాక్టరీ పెడితే చాలు, అ మినహాయింపులన్నీ అత్యంత సులువుగా ఏ ఇబ్బంది లేకుండా లభిస్తాయి. ఇక్కడి ఫ్యాక్టరీ పరిశ్రమల్లో కాలుష్యం, ఉత్పత్తి వల్ల పర్యావరణానికి కలిగే ప్రతికూల ప్రభావాలపై అంచనా వేసే అవసరం నుండి మినహాయింపు ఉంది. పర్యావరణ అనుమతులు ఏవయినా అవసరమయితే ఆయా ఎస్ఇజడ్‌ల డెవలప్‌మెంట్ ఆఫీసర్ గారు సంబంధిత కాలుష్య నియంత్రణ అధికారిని సంప్రదించి ఇచ్చేస్తారని కొన్ని రాష్ట్ర నియమాలుచెప్తున్నాయి.

ఇది కాకుండా ఈ ఎస్ఇజడ్‌లకు కేంద్ర చట్టాల నియంత్రణనుంచి తప్పించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి ఉంది. అంటే ఒక జీవో జారీచేయడం ద్వారా ప్రభుత్వం అనేక చట్టాల బాధలనుంచి వీటిని విముక్తంచేయ వచ్చునన్నమాట. ఒక్కముక్కలో చెప్పాలంటే ఈ ఎస్ఇజడ్‌లు భారత రాజ్యాంగం పరిధికి లోబడి ఉండవు. చట్టాల కింద బాధ్యతలేమీ ఉండవు.

ఉదార విధానాల్లో మరీ ఉదారమయిన యుగానికి ఎస్ ఇ జడ్‌లు తెరలేపుతున్నాయి. మన శాసనాలు ప్రగతినిరోధక శాసనాలనీ ప్రపంచంతో పాటు మన ప్రభుత్వంకూడా ప్రగాఢంగా విశ్వసిస్తున్నది. కనుక ఈ నిరోధక నియమాలనుంచి పరిశ్రమలను ఎంత వేగంగా వీలయితే అంత వేగంగా విముక్తి ఇవ్వడానికి ప్రభువులు ప్రయత్నిస్తున్నారు.

ప్రయివేట్ రంగంలో ఎస్‌ఇజడ్‌లను నెలకొల్పే కొత్త ప్రక్రియను దాదాపు గా భారతదేశమే ప్రారంభించిందనవచ్చు. ప్రైవేట్ రంగంలో విస్తృతమయిన ప్రగతి సాధించిన పాశ్చాత్య దేశాల్లో కూడా ఇంత పెద్ద సంఖ్యలో జోన్‌ల ఏర్పాటు జరగలేదు. ఇక వాణిజ్యశాఖ అయితే ప్రగతి సాధనలో ఎంత ఆతురతగా ఉందంటే వీలయినన్ని జోన్‌లు వెంటవెంటనే అనుమతించడానికి తొందరపడుతూనే ఉంది. ఓ ఇరవై లేదా ముప్ఫయ్ జోన్‌లకు వారంరోజుల్లో అనుమతి ఇవ్వడం లేదా ఇచ్చి తీరతాం అని హామీ అయినా ఇవ్వడం జరిగిపోతూనే ఉంది.

ముంబయ్ నేలపై రెండుజోన్‌లు స్థాపించి 120 చదరపు కిలోమీటర్ల సామ్రాజ్యాన్ని నెలకొల్పే సువర్ణావకాశం రిలయన్స్ వారికి లభించింది. చైనాలో ఇంతకన్న మూడింతలు పెద్ద మండలం 326 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంతో జోన్ ఉంది. చండీఘర్‌లో 112 చకిమీ, జంషెడ్‌పూర్‌లో 64 చ కిమీ సైజు జోన్‌లు వస్తున్నాయి. తమ జోన్‌లో పదిలక్షలమందికి ఇళ్లు నిర్మించాలని, మరో 20 లక్షల మందికి ఇళ్లు కట్టుకునే బాధ్యతలను పరిశ్రమలకు అప్పగించాలని రిలయన్స్ సంస్థ ప్రణాళికలు రచిస్తున్నది. అంటే మిలియన్ల జనాభా నివసించే నగరాలను నిర్మించే అవకాశం ఈ ఎస్ఎజడ్‌ల కింద ఉన్నపుడు వారికి స్థానిక పాలనా మండలులకుండే సంక్షేమ బాధ్యతలేమీ ఉండవా, వారు ఏ పాలనా పరిధిలోకి రావా? అంటే రావనే దీని అర్థం. అక్కడిక్కడ ఆయా జోన్ నిర్వాహకులే సార్వభౌములన్నమాట.

ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలను నిర్మిస్తున్న సంస్థ ప్రతినిధి (ప్రభుత్వ ప్రతినిధి కాదు) ఈ ఎస్‌ఇజడ్ అభివృద్ధి అథారిటీ (ఎస్‌డిఏ) ముఖ్యఅధికారిగా వ్యవహరిస్తారు. ఒక డెవలప్‌మెంట్ కమిష్నర్‌ను రాష్ట్రం నియమిస్తుంది. ఈ కమిష్నర్ ఇతర ఏ అధికారులకు లేనన్ని విపరీత అధికారాలతో రంగంలోకి దిగుతారు. రాష్ట్రాలు ఈ ఎస్‌ఇజడ్‌లకు పారిశ్రామిక పట్టణాల స్థాయి కల్పిస్తున్నది కనుక ఈ డెవలప్‌మెంట్ కమిష్నర్‌లు మునిసిపల్ లేదా మరే ఇతర స్థానిక సంస్థల పరిధిలోకిరారు. స్థానికపాలనా సంస్థ విధులను అధికారాలను అంటే పన్ను వసూలు, నీటిసరఫరా, శాంతి భద్రతలు కల్పించే బాధ్యత ఈ అథారిటీలపైన ఉంటుంది. కొన్ని చోట్ల ఈ అథారిటీలకు పుట్టుక మరణాల సర్టిఫికెట్ జారీచేసే అధికారం ఇచ్చారు. స్మశాన వాటికలు నిర్వహించే బాధ్యత ఇచ్చారు. ఇవన్నీ మునిసిపల్ అధికారాలని 12 వ షెడ్యూలు (రాజ్యాంగం) లో పేర్కొన్నారు. వీధులు, రోడ్ల నిర్వహణ, చిన్న వంతెనల నిర్మాణం, రోగాల నిరోధపోరాటం అన్నీ వీరి అధికార పరిధిలోనివే. కాని ఈ పనులు చేయకపోతే జరిమానాలు ఏమిటో ఈ నియమాల్లో లేదు. స్థానిక పాలన గానీ జవాబుదారీ గాని ఏమీ ఉండవు. కాని అన్ని పాలనాధికారాలు పుష్కలంగా లభిస్తాయి. ఇక్కడ నివసించే వారికి అన్ని రకాల సేవలందించే బాధ్యత మునిసిపాలిటీలకు ఉన్నట్లుగా నిర్ధారించలేదు. ఒకవేళ ఎవరయినా పౌరుడికి సేవలే లభింపకపోతే ఎవరిని ఎక్కడ నిలదీయాలి ఆ హక్కు ఉందా అంటే లేదు. కోర్టులో పడితే తప్ప ఈ అంశాలు బయటకు రావు. లాభాల సంపాదించాలన్న లక్ష్యంలో పడి ఈ సేవలను తగ్గించినా, నిరాకరించినా అడిగే హక్కు లేదు.

ఎస్‌ఇజడ్‌లలో విదేశీ పారిశ్రామిక వేత్తలకు ఇబ్బంది కలుగకుండా ఈ వివాదమయినా పరిష్కరించడానికి ఫాస్ట్ ట్రాక్ న్యాయవ్యవస్థలను నిర్మిస్తారు. ఈ మండలాల్లోగాని, అవతల గానీ ప్రత్యేక కోర్టులను నిర్వహించేందుకు అనుమతించే అధికారం కేంద్రానికి ఉంది.

స్థానిక స్వపరిపాలన గానీ, మునిసిపాలిటీ తరహాలో పాలనా వ్యవస్థను ఏర్పాటుచేయడానికి ఇబ్బందులు రావచ్చు. జంషెడ్‌పూర్ లో పరిశ్రమలను టాటా వారు నిర్వహిస్తున్నారు. 70 శాతం మంది టాటా పరిశ్రమల్లో పనిచేసే వారే. ఇప్పుడు వారికి అన్ని సౌకర్యాల కల్పన బాధ్యత టాటాదే. జార్ఖండ్ ప్రభుత్వం ఈ ప్రాంతానికి మునిసిపాలిటీస్థాయి కల్పించాలని ప్రయత్నిస్తుంటే అడ్డుకుంటున్నారు. 30 సంవత్సరాల కాలానికి భూమిని టాటాకు లీజుకు ఇచ్చారు. ఈలీజును కొనసాగించే దశలో మునిసిపాలిటీ వ్యవహారం పరిశీలనకు వస్తుంది. కాని ప్రైవేట్ భూములను ప్రభుత్వ భూములను కొనివేసిన పక్షంలో ఎస్‌ఇజడ్‌ల మీద ఎవరికీ ఏ దశలోనూ ఏవిధమయిన పరిమితి ఉండే అవకాశం ఉండదు. ఎన్ని లక్షలమంది నివసించినా వారికి స్థానిక స్వపాలనాధికారం రాకపోవచ్చు.

ఈ మండలాలు ఆర్థిక వివక్ష అనే కొత్త సామాజిక దురాచారానికి దారి తీసే అవకాశం ఉందని ప్రశాంత్ భూషణ్ వంటి న్యాయనిపుణులు విశ్లేషిస్తున్నారు. అంటే ఎస్ ఇ జడ్‌లలో లభించే విపరీతమయిన మినహాయింపులు, ప్రయోజనాలు బయట ఉండే పరిశ్రమలకు లభించవు. ఆ పరిశ్రమలు ఇందులో ఉన్న పరిశ్రమలతో ఆర్థికంగా పోటీపడడానికి అవసరమయిన సమానతను ఈ మినహాయింపులు దెబ్బ తీస్తుంటాయి. ప్రయివేటీకరణలో శరవేగంగా అభివృద్ధిసాధించడానికి ఇదొక వెసులు బాటు అని పాలకులు సమర్థిస్తున్నారు. విమర్శకులు మాత్రం కొత్త రాజరిక వ్యవస్థకు ఇది తెరలేపుతున్నదని విమర్శిస్తున్నారు.

ఇక కోర్టులే దిక్కు:

అసమానతలు ప్రత్యేకతలు సృష్టించి, అనేక జనబాహుళ్య శాసనాలనుంచి మినహాయించి రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడుతున్నారన్న ఆరోపణపై హైకోర్టు, సుప్రీంకోర్టులలో ఇప్పటికే అనేక ప్రజా ప్రయోజన వ్యాజ్యాలు దాఖలయినాయి. నోయిడాలో రిలయన్స్ వారి ఎస్‌ఇజడ్ పైన భూసేకరణ, భూమి కేటాయింపు పైన దాఖలయిన పిల్‌ను అలహాబాద్ హైకోర్టు కొట్టివేసింది. పంజాబ్, హర్యానా, మహారాష్ట్ర పశ్చిమ బెంగాల్ ఎస్ ఇ జడ్‌ల ఏర్పాటు కోసం వ్యవసాయ భూములను పారిశ్రామిక ప్రయోజనాలకు మళ్లించడాన్ని సవాలుచేస్తూ ఒక పిల్ సుప్రీంకోర్టులో దాఖలు చేసారు. ఎస్ ఇ జడ్ చట్టం 2005 రాజ్యాంగ అధికరణాలు 14, 19, 21, 301 ని భంగపరుస్తున్నదని కనుక చెల్లదని, ఆదేశిక సూత్రాలకు కూడా పూర్తిగా ఈ చట్టం వ్యతిరేకమని, పార్లమెంట్ తన అధికార పరిధికి మించి శాసనంచేసిందని ఈ పిల్‌లో సవాలుచేసారు. స్థానిక పాలననుంచి మినహాయించి, బాలకార్మిక, కార్మిక చట్టాలనుంచి మినహాయించి రాజ్యాంగ నేరానికి పాల్పడుతున్నారని విమర్శించారు. ◆

# ప్రత్యేక ఆర్థిక మండలాలు - కొత్త భూస్వామ్యం

- ఎన్. వేణుగోపాల్

దేశంలో భూమి ఇంకా ప్రధాన ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక అధికార చిహ్నంగానే ఉన్నదని, భూస్వామ్యవర్గాల పట్టు సడలలేదని, కొత్త భూస్వామ్యవర్గం ఒకటి ప్రపంచీకరణశక్తుల అండ దండలతోనే ఏర్పడుతున్నదని రెండు మూడేళ్ల కిందటిదాకా ఎవరైనా అని ఉంటే వారిని 'మార్క్సిస్టు మూర్ఖులు'గా అభివర్ణించడం జరిగేది. ఈ దేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని బలోపేతం చేయడానికే ప్రపంచీకరణ వస్తున్నదని, అది భూస్వామ్యవర్గాలను అంతం చేసి పారేస్తుందని, భూమి ప్రాధాన్యత తగ్గిపోయి, మార్కెట్ సంబంధాలు బలపడతాయని, అందువల్ల ప్రపంచీకరణను సమర్థించాలని చెపుతూ మార్క్సిస్టు-లెనినిస్టు శిబిరం నుంచే ఒక దశాబ్దం కింద ఒక పుస్తకం వెలువడింది. ఆ పుస్తకం దేశంలోని అర్ధ భూస్వామ్య, అర్ధ వలస వ్యవస్థను గమనంలోకి తీసుకోలేదనీ, సామ్రాజ్యవాద శక్తులకూ భూస్వామ్యానికీ మధ్య ఉన్న మిలాఖత్తును గుర్తించలేదనీ నేను వ్యాఖ్యానించినప్పుడు (గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ – మరో దృష్టి, అరుణతార, డిసెంబర్ 1999) అటువంటి విమర్శలే వచ్చాయి.

ఆశ్చర్యకరంగా ఇప్పుడు ప్రత్యేక మండలాల రూపంలో ప్రపంచీకరణ శక్తుల భూదాహం గురించి ప్రతి ఒక్కరూ మాట్లాడుతున్నారు. ఈ కొత్త మహమ్మారి దేశంలోని పంట పొలాల్లో కనీసం ఏడెనిమిది లక్షల ఎకరాలను ఆక్రమించబోతూ కొత్త భూస్వామ్యానికి దారి తీస్తోంది. దేశంలోని ప్రధాన పెట్టుబడిదారీ వ్యాపార గృహాలుగా పేరొందిన టాటా, బిర్లా, మహీంద్రా, బజాజ్, గత రెండు దశాబ్దాలలో అనూహ్యంగా ఎదిగిన అంబానీలు, ఇటీవల ఇన్ఫోటెక్ – బయోటెక్ – రియల్ ఎస్టేట్ రంగాలలో ప్రముఖులైన సహారా, సత్యం, విప్రో, ఇన్ఫోసిస్, బయోకాన్, డిఎల్ఎఫ్ వంటి దళారీ, బడా పెట్టుబడిదారీ వ్యాపార సంస్థలన్నీ ఈ భూ ఆక్రమణలో ఉన్నాయి. దక్షిణ కొరియాకు చెందిన ఉక్కు వ్యాపార సంస్థ పోస్కో వంటివి కూడ ఇందులో భాగం పంచుకుంటున్నాయి. అంబానీలు ఒక్కరే అన్ని రాష్ట్రాలలో కలిపి డెబ్బై వేల ఎకరాల ప్రత్యేక ఆర్థిక మండలాలు ఏర్పాటు చేస్తున్నారు. ఇందులో హర్యానాలో ఇరవై ఐదు వేల ఎకరాలు, ముంబాయి సమీపంలో నలభై వేల ఎకరాలు ఉన్నాయి.

ఈ భూ ఆక్రమణలను ఆధునిక భారత చరిత్రలో అతి పెద్ద భూ ఆక్రమణలుగా అభివర్ణించిన చరిత్రకారుడు సుమిత్ సర్కార్ 'దేశంలో, ముఖ్యంగా బీహార్ లోనూ, ఆంధ్రప్రదేశ్ లోనూ 1960ల చివరినుంచి జరిగిన భూ ఆక్రమణ ఉద్యమాలకు ఇది పూర్తిగా వ్యతిరేకమైనది, తలకిందులు చేసేది. అప్పుడు జరిగినది నిజంగా రైతులు, భూమిలేని నిరుపేద కూలీలు పాల్గొన్న మహాసమీకరణ. అప్పుడు ఏ కుటుంబం దగ్గరయినా గరిష్ట పరిమితి కన్న ఎక్కువ భూమి ఉంటే ప్రజలు వెళ్లి ఆక్రమించుకున్నారు. ఆ ఉద్యమం పేదప్రజలది. దానికి వామపక్షాలు నాయకత్వం వహించాయి. ప్రస్తుత భూ ఆక్రమణ ధనికుల్లోకెల్లా ధనికులది' అన్నారు.

అయితే సహజంగానే ఏ పోలికలోనైనా ఉన్నట్టుగానే ఈ కొత్త భూస్వామ్యానికీ పాత భూస్వామ్యానికీ మధ్య సామ్యాలూ ఉన్నాయి, భేదాలూ ఉన్నాయి. పాత భూస్వామ్యం లాగనే కొత్త భూస్వామ్యానికి కూడ ఆ భూములలో పంటలు తీయడం మీద పెద్ద ఆసక్తి లేదు. ఆ భూమిని ఏ పేరు మీద తీసుకుంటున్నారో ఆ అవసరానికే వినియోగించాలనే నియమం కూడ లేదు. తీసుకున్న భూమిలో 35 శాతం మాత్రం ప్రకటిత అవసరం కోసం వాడి, మిగతాదాన్ని ఇష్టప్రకారం వాడుకోవడానికి చట్టమే వీలు కల్పిస్తుంది. పాత భూస్వామ్యానికి వేల ఎకరాల భూమి ఉండడం ప్రతిష్ఠాచిహ్నం కాగా, కొత్త భూస్వామ్యానికి గోల్ఫ్ కోర్సులు, రియల్ ఎస్టేట్, విలాసవంతమైన హోటళ్లు వంటి అదనపు భూవినియోగ అవకాశాల గురించి తెలుసు. పాత భూస్వామ్యం భూమి మొత్తం రాజుదే అని రాజ్యాధికారాన్ని స్థాపించి, రాజునుంచి ఇనాములు, అగ్రహారాలు, ముక్తాలు, జాగీర్లు సంపాదించినట్టుగానే, ఇప్పుడు కొత్త భూస్వామ్యం భూమి మీద, భూసేకరణ మీద ప్రభుత్వాధికారాన్ని స్థాపించి, ప్రభుత్వం నుంచి చౌకధరలకు జాగీర్లు సంపాదిస్తోంది. పాత భూస్వామ్య అధికారం తనకు తానే చట్టమై, మరే చట్టానికీ లొంగి ఉండని విధంగానే, కొత్త భూస్వామ్యం కూడ ఈ దేశపు చట్టాలకు లోబడి ఉండనక్కరలేని, 'విదేశీ భూభాగం' హోదాను అనుభవించబోతోంది. ఒకటే తేడా ఏమంటే కొత్త భూస్వామ్యానికి వచ్చినంత ఆకర్షణీయమైన, సమ్మోహకమైన భాష పాత భూస్వామ్యానికి వచ్చేది కాదు. కొత్త భూస్వామ్యానికి ఆధునికతా వాసన ఉన్నప్పటికీ, అదే పాత భూస్వామ్యం కన్న ఎక్కువ మొరటుగా, ఎక్కువ దుర్మార్గంగా ఉన్నట్టు కనబడుతోంది.

ఈ రాజకీయార్థిక శాస్త్ర చర్చను పక్కనపెట్టి, అసలు ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలు ఎట్లా, ఎందుకొరకు ప్రారంభమయ్యాయి. వాటి ప్రకటిత, అప్రకటిత లక్ష్యాలేమిటి. వాటి తక్షణ, దీర్ఘకాలిక ఫలితాలేమిటి, వాటి పట్ల రాజకీయపక్షాల, సామాజిక వర్గాల వైఖరులేమిటి అనే ప్రశ్నలగురించి ఆలోచించవలసి ఉంది.

స్పెషల్ ఎకనమిక్ జోన్స్ (సెజ్ – ప్రత్యేక ఆర్థిక మండలాలు) అనే పేరుతో ప్రఖ్యాతమైన ఈ ఏర్పాటును, స్పెషల్ ఎక్స్ప్లాయిటేషన్ జోన్స్ (ప్రత్యేక దోపిడీ మండలాలు) అనీ, స్పెషల్ ఎర్రోనియస్ జోన్స్ (ప్రత్యేక తప్పుడు మండలాలు) అనీ కూడ విమర్శకులు పిలుస్తున్నారు.

దేశవ్యాప్తంగా మౌలిక సాధన సంపత్తిని సమకూర్చడం సాధ్యం కాదు కాబట్టి, అది చాల ఖర్చుతో కూడుకున్నదీ, ఎక్కువ సమయం తీసుకునేదీ కాబట్టి, పారిశ్రామికాభివృద్ధి కోసం ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు ఒక వ్యూహమని ప్రభుత్వ వాదన. అందుకోసం పన్ను మినహాయింపులను ఇవ్వడం, స్థలాన్నీ, సౌకర్యాలనూ తక్కువ ధరకో, ఎక్కువ కాలవ్యవధితోనో సమకూర్చడం, కావలసిన మౌలిక సౌకర్యాలనూ, విద్యుత్తు, నీరు తదితర అవసరాలనూ కల్పించడం,

సింగిల్ విండో అనుమతులివ్వడం, సులభతరమైన పద్ధతులు, చట్టాల సరళీకరణ వంటి చర్యలు ప్రభుత్వం చేపడుతుంది.

నాలుగు దశాబ్దాలుగా ఈ దేశంలో నడుస్తున్న ఎగుమతి ప్రోత్సాహక మండలాలు ప్రస్తుతం ప్రత్యేక ఆర్థిక మండలాలుగా మారిన క్రమం ఆసక్తికరమైనది. వీటికి మూలం చైనా అమలుచేస్తున్న విధానంలో ఉంది. భాజపా నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వంలో వాణిజ్యశాఖ మంత్రిగా ఉండిన మురసోలి మారన్ 2000లో చైనా పర్యటనకు వెళ్లినప్పుడు అక్కడి ప్రత్యేక ఆర్థిక మండలాలను, ముఖ్యంగా షెన్‌జెన్‌ను చూసి ముచ్చట పడి 2000 ఏప్రిల్‌లో ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని ప్రకటించారు.

ఇప్పటికీ భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అగ్ర నాయకులు ప్రకాష్ కరత్, సీతారాం యేచూరిలు చైనా అవలంబిస్తున్న విధానం విభిన్నమైనదని సమర్థిస్తున్నారు గాని ప్రఫుల్ బిద్వాయ్, రమేశ్ రామనాథన్ వంటి స్వతంత్ర పరిశోధకులు షెన్‌జెన్ నమూనాలో జరుగుతున్న అక్రమాల గురించి వివరించారు. చైనా చర్చ ఇక్కడ అప్రస్తుతం గాని, ఎన్‌డిఎ హయాంలో మొదయిన ఈ విధానం, ఆ తర్వాత మూడు సంవత్సరాలు పడుతూలేస్తూ ముందుకుసాగి, కాంగ్రెస్ నాయకత్వంలో, వామపక్షాల మద్దతు కూడ ఉన్న యుపిఎ ప్రభుత్వ హయాంలో 2005 మే 11న చట్టరూపం పొందింది. ఈ బిల్లు చట్ట రూపం పొందడానికి లోక్‌సభలో జరిగిన చర్చ రెండు మూడు రోజులు మించక పోగా, రాజ్యసభలో ఒకేఒక్క రోజులో చర్చ ముగిసిపోయింది. అంటే, దేశంలోని పార్లమెంటరీ రాజకీయ పార్టీలన్నీ, ఇవాళ బయట ఏమి చెపుతున్నప్పటికీ, ఎటువంటి ఆందోళనలు నడుపుతున్నప్పటికీ, ఈ విధాన నిర్ణయపు తిలాపాపంలో తలా పిడికెడు పంచుకోవలసిందే.

2004 మేలో అధికారానికి వచ్చిన యుపిఎ ప్రభుత్వం తన కంటే ముందు ఎన్‌డిఎ తయారు చేసిన ఎస్ఇజెడ్ విధానం పెట్టుబడిదారులు కోరుకున్నంత సరళంగా లేదని, ఎక్కువ రాయితీలు లేవని భావించింది. అందువల్ల తానే ఒక బిల్లు తయారు చేసింది. ఆ బిల్లును 2005 జనవరిలో కేంద్ర మంత్రి వర్గం చర్చించి కొన్ని చర్చనీయాంశాల మీద తుది తీర్పు కోసం మంత్రివర్గ బృందానికి (గ్రూప్ ఆఫ్ మినిస్టర్స్‌కు) పంపించింది. ఆ తర్వాత ఆ బిల్లును 2005 బడ్జెట్ సమావేశాలలో, బడ్జెట్ చర్చ ముగిసిన తర్వాత, సమావేశాలు ముగియడానికి రెండు రోజుల ముందు హడావిడిగా ప్రవేశపెట్టారు. సమాచార హక్కు బిల్లు చట్టం కావడానికీ, మహిళలకు రిజర్వేషన్ బిల్లు ప్రవేశ పెట్టడానికీ ఏళ్లకు ఏళ్లు తీసుకున్న ప్రభుత్వాలు, ప్రత్యేక ఆర్థిక మండలాల బిల్లును చట్టం చేసే పనిని రోజులలోనే ముగించాయి. అంతేకాదు, ఇంత ముఖ్యమైన చట్టాన్ని ఆపేశక్తి లేకపోయినా, రభసచేసి ఆలస్యం చేయడానికయినా అవకాశం ఉన్న ప్రతిపక్షాలు దాదాపు మౌనాంగీకారంతో బిల్లును చట్టం కానిచ్చాయి.

లోక్‌సభలో సిపిఐకి చెందిన గురుదాస్ దాస్‌గుప్తా, సిపిఎంకు చెందిన రూప్‌చంద్ పాల్, రాజ్యసభలో సిపిఎంకు చెందిన నీలోత్పల్ బసు ఈ బిల్లుమీద కొంత చర్చ చేసి, కొన్ని సవరణలు ప్రతిపాదించారు గాని వాటి ఫలితం పెద్దగా లేదనే చెప్పాలి.

ప్రత్యేక ఆర్థిక మండలాలు ఏర్పాటు చేస్తామని ప్రభుత్వం దగ్గరికి ఎన్ని అభ్యర్థనలు వస్తున్నాయో, ప్రభుత్వం ఎంత వేగంగా వాటికి అనుమతులను ఇస్తున్నదో చూస్తే దేశాన్ని పారిశ్రామికీకరించడానికి గత అరవై ఏళ్లలో లేని ఉత్సాహం హఠాత్తుగా ఈ ఆరు నెలలలోనే వచ్చిందా అని ఆశ్చర్యం కలుగుతుంది. ఇదంతా పారిశ్రామికీకరణ ఆసక్తి కాదేమోననీ, బహుశా ఈ పేరుతో కారుచౌకగా వేల ఎకరాల భూమి ఆక్రమించుకోగల భూదాహం మాత్రమేననీ అనుమానం కలుగుతుంది. ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు అనుమతి పొందినవారి సంఖ్య, సూత్రరీత్యా అనుమతి పొందినవారి సంఖ్య రోజురోజుకు పెరిగిపోతోంది. నవంబర్ రెండో వారం చివరికి అన్ని అనుమతులు పొందిన ఎస్ఇజెడ్‌లు 263, సూత్రరీత్యా అనుమతి పొందిన ఎస్ఇజెడ్‌లు 169, మొత్తం 432 ప్రత్యేక ఆర్థిక మండలాలు అనుమతి పొంది ఉన్నాయి.

ప్రత్యేక ఆర్థిక మండలాల (స్పెషల్ ఎకనమిక్ జోన్స్) విషయంలో గత కొంతకాలంగా, ముఖ్యంగా 2006 ఫిబ్రవరిలో కేంద్ర ప్రభుత్వ నిబంధనలు జారీ అయినప్పటినుంచి దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున ఆందోళనలు చెలరేగుతున్నాయి. అప్పటినుంచే ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల గురించి ప్రచారసాధనాల ద్వారా ప్రజలకు ఎక్కువగా తెలిసివస్తోంది. ప్రజలలో, ముఖ్యంగా ఆయా ప్రాంతాల రైతాంగంలో ఆందోళన పెరిగిపోతోంది. ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల వల్ల రైతుకూలీల జీవనోపాధి రద్దవుతుందనీ, ఆహారభద్రత కొరవడుతుందనీ, భూమి కోల్పోతున్న రైతులకు తగిన నష్టపరిహారం అందడం లేదనీ, మధ్య దళారులు ఇబ్బడిముబ్బడిగా లాభాలు చేసుకుంటున్నారనీ, వీటివల్ల పారిశ్రామికాభివృద్ధి గానీ, ఉద్యోగకల్పన గానీ ఏమీ ఉండబోదనీ, వీటిలో ప్రకటిస్తున్న సంస్థల, వ్యాపారాల బదులు వేరే వ్యాపారాలు జరిగే అవకాశం ఉందనీ, ఇవి అంతిమంగా రియల్ ఎస్టేట్‌గా మారిపోతాయనీ, ఇవన్నీ ఇప్పటికే రాయితీలు పొందుతున్న వ్యాపారవర్గాలకే మేలు చేస్తాయనీ, వీటివల్ల ఖజానాకు వచ్చే పన్నుల ఆదాయానికి గండి పడుతుందనీ, వీటిలో చట్టాలు చెల్లవుగనుక ఇవన్నీ కార్మిక, ఉద్యోగవ్యతిరేక విధానాల నమూనాలుగా మిగిలిపోతాయనీ, ప్రభుత్వం ఉద్యోగ కల్పన గురించి, పెట్టుబడుల గురించి గుప్పిస్తున్న వాగ్దానాలన్నీ నీటిమూటలనీ అనేక విమర్శలు చెలరేగుతున్నాయి. వీటిలో ప్రతిఒక్క విమర్శకూ ఆధారాలు, బలమైన వాదనలు ఉన్నాయి.

ఆరాధనా అగర్వాల్ అనే పరిశోధకురాలు చెపుతున్న ప్రకారం మొత్తం అనుమతులు పొందిన ప్రత్యేక ఆర్థిక మండలాలలో 61 శాతం ఐటి రంగంలోనే ఉన్నాయి. నిజానికి ఐటి రంగ సంస్థలు గత పదిహేను సంవత్సరాలుగా ఏవేవో రాయితీలను అనుభవిస్తూనే ఉన్నాయి. ఇప్పుడు తమ రాయితీల గడువులను పొడిగించుకోవడానికి, పాత వ్యాపార సంస్థలను కొత్త వ్యాపార సంస్థలుగా నమోదుచేసి మరింత భూమి సంపాదించడానికి ఒక మార్గంగా ఈ కొత్త విధానం కింద అనుమతులు సంపాదిస్తున్నాయి గాని, కొత్తగా రాబోయే సంస్థలూ లేవు, పెట్టుబడులూ లేవు, ఉద్యోగ కల్పనా లేదు.

అట్లాగే ఈ ప్రత్యేక మండలాల ఏర్పాటు కోసం అభ్యర్థనలు పెట్టుకున్న వారందరూ ప్రధాన నగరాల చుట్టుపట్ల ఉన్న భూమి కోసమే

దరఖాస్తు చేసుకున్నారంటే వారి పారిశ్రామిక ఆసక్తికన్న రియల్ ఎస్టేట్ ఆసక్తే ఎక్కువని తెలిసిపోతోంది. అట్లాగే, మొత్తం దరఖాస్తులలో 65 శాతం కేవలం ఐదు రాష్ట్రాలలోనే ఉన్నాయంటే ఇది అభివృద్ధి చెందిన ప్రాంతాలలో మరింతగా రియల్ ఎస్టేట్ అభివృద్ధి తప్ప నిజమైన వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కాదని తేలిపోతుంది. ఇక దరఖాస్తు చేసిన కొన్ని సంస్థలైతే స్పష్టంగానే రియల్ ఎస్టేట్, వినోద, విలాస సంస్థలుగా తెలిసిపోతున్నాయి. అవి అటు ఎటువంటి పారిశ్రామికాభివృద్ధికి దోహదం చేయగలవో, వాటికి కారుచౌకగా వేల ఎకరాల భూమి ఎందుకు ఇవ్వాలో అర్థం కాదు.

ప్రత్యేక ఆర్థిక మండలాలను చట్ట బద్ధంగానే 'విదేశీ భూభాగంతో సమానమైనవిగా' గుర్తిస్తారు. అంటే అక్కడ భారతదేశంలో అమలులో ఉండే చట్టాలు పనిచేయవన్నమాట. దేశానికి సంబంధించిన 21 చట్టాలు ఈ మండలాలలో వర్తించవు. అనుమతులు లేకుండానే సుంకాలేవీ చెల్లించకుండానే అక్కడికి విదేశీ సరుకులు దిగుమతి చేసుకోవచ్చు. అక్కడ సంపాదించే లాభాలను భారత రిజర్వ్ బ్యాంకు అనుమతి లేకుండానే విదేశాలకు తరలించుకుపోవచ్చు.

అంతే కాదు, ఎస్ఇజెడ్‌లలో అనేక పన్ను రాయితీలుంటాయి. ఆ రాయితీలన్నిటినీ ఒక్క మాటలో చెప్పాలంటే, అక్కడి వ్యాపార సంస్థలు పది సంవత్సరాలపాటు పూర్తిగా పన్నులపై సెలవును అనుభవించవచ్చు. కేవలం 150 ఎస్ఇజెడ్‌లపైనే కనీసం రెండువేల కోట్ల డాలర్ల (ఒక లక్ష కోట్ల రూపాయల) పన్ను ఆదాయాన్ని నష్టపోవలసివస్తుందని స్వయంగా ఆర్థిక మంత్రిత్వశాఖ అభిప్రాయపడింది. చాల ఆశ్చర్యకరంగా ఈ 150 ఎస్ఇజెడ్‌ల ద్వారా ప్రభుత్వం అంచనా వేస్తున్న పెట్టుబడుల మొత్తం రెండున్నరవేల కోట్ల డాలర్లు మాత్రమే.

గతంలోనైతే ప్రైవేట్ పెట్టుబడిదారులు వారికి అవసరమైన భూమిని వారే మార్కెట్ ధరలకు కొనుక్కునే పరిస్థితి ఉండగా, ఇప్పుడు ప్రత్యేక ఆర్థిక మండలాలలో ప్రభుత్వమే రైతుల దగ్గరి నుంచి భూమిని సేకరించి పెట్టుబడిదారులకు అందజేస్తుంది. ఇలా ప్రభుత్వం కొనబోతుందని ముందే తెలిసిన మధ్య దళారులు చిన్న చిన్న కమతాలు అన్నింటిని కొనివేసి తిరిగి ప్రభుత్వానికి లేదా పెట్టుబడిదారులకు అమ్మజూపుతున్నారు. ఇందువల్ల రైతులకు రావలసినంత రావడం లేదనేది ఒక అంశం అయితే, ఇన్నాళ్లు వచ్చిన దానికన్నా ఎక్కువే వస్తుందని ఆశ చూపే మధ్యవర్తులు ఉండడం మరొక అంశం. అయితే నష్ట పరిహారం లక్షలు వస్తుందా కోట్లు వస్తుందా అనే దాని కన్నా ముఖ్యమైనది రైతులు తమ శాశ్వత జీవనోపాధి వనరును పోగొట్టుకొని తమ భూములనుంచి బైటపడవలసి వస్తుంది. వచ్చిన డబ్బులు ఎంత జాగ్రత్తగా వారి అవసరానికి ఉపయోగపడతాయో అనుమానమే.

పెట్టుబడిదారులకు ప్రోత్సాహకాల పేరుతో సాగే ఇటువంటి రాయితీలవల్ల, ప్రస్తుతం వేరే ప్రాంతాల్లో నడుస్తున్న పారిశ్రామిక, వ్యాపార సంస్థలు కూడ తమను తాము ఎస్ఇజెడ్‌లుగా పిలుచుకుని ఈ వసతులన్నీ పొందడానికి ప్రయత్నించవచ్చునని స్వయగా ఐఎంఎఫ్ ప్రధాన ఆర్థిక వేత్త రఘురాం రాజన్ అన్నారు.

గత అనుభవాన్ని ఒకసారి పరికిస్తే, 1970ల నుంచీ నడుస్తున్న ఎగుమతి ప్రోత్సాహక మండలాలలో సుంకాల రాయితీలవల్ల నష్టపోయిన మొత్తం 170 కోట్ల డాలర్లని, అది ఆ మండలాలు ఎగుమతుల ద్వారా సాధించిన ఆదాయం కన్న 60 శాతం ఎక్కువని ప్రభుత్వ అంచనాలే ప్రకటిస్తున్నాయి.

గతంలో ప్రభుత్వం ప్రత్యేక ఆర్థిక మండలాలకు ఎన్ని ప్రోత్సాహకాలు ఇచ్చినా అవి పెద్దగా సాధించింది ఏమిలేదు. ప్రత్యేక ఆర్థిక మండలాల నుంచి 2004-05లో మొత్తం దేశంలోని ఎగుమతుల్లో కేవలం 5 శాతం మాత్రమే జరిగాయి. అవి కేవలం 0.32 శాతం పెట్టుబడులను మాత్రమే ఆకర్షించగలిగాయి. కేవలం ఒక్క శాతం కార్మికులకు మాత్రమే ఉపాధి కలిగించగలిగాయి.

ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలు ఎట్లా వచ్చాయి, ఎందుకు వచ్చాయి, వాటి ప్రకటిత, అప్రకటిత లక్ష్యాలేమిటో స్థూలంగా పరిశీలించిన తర్వాత వాటి పట్ల రాజకీయ వైఖరులను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

ప్రత్యేక ఆర్థిక మండలాల విషయంలో రాజకీయ వైఖరులు విచిత్రంగా ఉన్నాయి. ఈ ఆలోచనను ప్రారంభించినది ఎన్‌డిఎ ప్రభుత్వమని, కొనసాగించింది యుపిఎ ప్రభుత్వమని పైననే చూశాం. అంటే ఈ విధానపు ప్రధాన బాధ్యతను భారతీయ జనతా పార్టీ, కాంగ్రెస్‌లే తీసుకోవాలి. ఆ రెండు పార్టీలు కూడ తాము అధికారంలో ఉన్నచోట ఒక వైఖరిని, ప్రతిపక్షంలో ఉన్నచోట అందుకు భిన్నమైన వైఖరిని ప్రదర్శిస్తున్నాయి. పశ్చిమ బెంగాల్, కేరళ వంటి రాష్ట్రాలలో కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర వంటి రాష్ట్రాలలో భారతీయ జనతాపార్టీ ఎస్ఇజెడ్‌ల వ్యతిరేక ఆందోళనల్లో కూడ పాల్గొంటున్నాయి.

ఒక వైపు మాజీ ప్రధాని వి.పి. సింగ్ పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని దాద్రి ఎస్ఇజెడ్‌లను వ్యతిరేకిస్తుండగా, వెనుకబడిన కులాల పార్టీగా తనను తాను గుర్తించుకునే సమాజ్ వాది పార్టీ అంబానీ సోదరుల తరఫున ఎస్ఇజెడ్‌లను సమర్థిస్తూ అగ్రభాగాన నిలబడింది.

ప్రత్యేక ఆర్థిక మండలాలను వ్యతిరేకిస్తూ దేశవ్యాప్తంగా ఆందోళనలు నిర్వహిస్తున్న వామపక్షాలు, ముఖ్యంగా భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు), తాము అధికారంలో ఉన్న పశ్చిమ బెంగాల్, కేరళలలో ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేస్తూనే ఉన్నాయి. కేంద్ర చట్టం 35 శాతం ప్రకటిత అవసరానికి వాడుకోవాలని, మిగిలిన భూమి ఎందుకైనా వాడుకోవచ్చునని చెపుతుండగా, పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఆ 35 శాతం ను 50 శాతానికి మాత్రం మార్చి అదే గొప్ప విప్లవాత్మక మార్పు అన్నట్టుగా ప్రచారం చేసుకుంటోంది. చట్టంలో మార్పులు చేసే అధికారం రాష్ట్రాలకు ఉండాలని పార్లమెంట్‌లో వాదించి నెగ్గించుకున్న సిపిఐ(ఎం) పశ్చిమ బెంగాల్‌లో తనదైన విధానం ప్రకటించింది. ప్రభుత్వం ఆక్రమించదలచుకున్న భూమి మీద ఒక వేళ పంట ఉంటే, ఆ పంట కోసుకోవడానికి కూడ రైతుకు హక్కు లేదని, బెంగాల్ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది!

మొత్తం మీద, ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారుల, రాజకీయ పక్షాల, దళారుల ఉమ్మడి వ్యూహంగా అమలవుతోంది. ఆ ఉమ్మడి వ్యూహానికి నష్టపోయేది భారత పీడిత రైతాంగం, భారత ఆర్థిక వ్యవస్థ, భారత ఆహార భద్రతా వ్యవస్థ. దేశ ప్రయోజనాలను అతి దారుణంగా దెబ్బతీస్తున్న ఈ విధానాన్ని ప్రతిఘటించడం ప్రతి ఒక్కరి కర్తవ్యం. ◆

# సూక్ష్మంలో మోక్షమెవరికి?

– ఇతిహాస్

మైక్రోఫైనాన్స్ రంగంలో విశేష కృషి చేసి తద్వారా పేదరికాన్ని రూపుమాపడానికి, సమాజంలో శాంతి నెలకొల్పడానికి గత ముప్ఫై ఏళ్లుగా పాటుపడుతున్నందుకు బంగ్లాదేశ్‌కి చెందిన ప్రముఖ ఆర్థికవేత్త మహ్మద్ యూనిస్‌కు, ఆయన స్థాపించిన గ్రామీణ్ బ్యాంక్‌కు ఈ సంవత్సరపు నోబెల్ శాంతి బహుమతి వరించింది. పేదలకు చిన్న మొత్తాలలో అప్పులు ఇచ్చి వారి కాళ్లపై వారు నిలబడేందుకు ఉద్దేశించిన ఈ మైక్రోఫైనాన్స్ పథకం ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. పేదరికాన్ని తగ్గించడానికి దీన్నో చిట్కా వైద్యంలా ప్రపంచబ్యాంక్ సిఫారసు చేస్తుండగా, ప్రభుత్వాలను బాధ్యతల నుండి తప్పించి దాని స్థానంలో ప్రైవేట్ సంస్థలను, ఎన్‌జీవోలను ప్రతిష్టించే ప్రపంచబ్యాంక్ దుష్టపన్నాగంలో మైక్రోఫైనాన్స్ అనేది తాజా అంకం మాత్రమేనని విమర్శకులు అంటున్నారు. యూనిస్‌కు వచ్చిన తాజా అవార్డు నేపథ్యంలో నాణేనికి మరో వైపుకూడా అర్థం చేసుకోవడం ఎంతైనా అవసరం.

సూక్ష్మరుణాలనేవి అనేక దశాబ్దాలుగా చలామణిలోనే ఉన్నప్పటికీ, వాటికి వ్యవస్థీకృత రూపాన్నిచ్చినవారు మహ్మద్ యూనిస్. పేదలకు సాధారణంగా అప్పు పుట్టదు. వారికి చిన్న మొత్తాలు అప్పుగా ఇస్తే దాంతో వారు ఏ బర్రెనో, గొర్రెనో కొనుక్కుని జీవనోపాధిని సంపాదించుకుంటారనే సదుద్దేశ్యంతోనే యూనిస్ 1976లో గ్రామీణ్ బ్యాంక్‌ను ప్రారంభించారు. గ్రామీణ్ బ్యాంక్ రుణాలు స్త్రీలకు మాత్రమే ఇవ్వబడతాయి. కొద్ది మంది స్త్రీలను ఒక బృందంగా ఏర్పరచి వారికి అప్పు ఇస్తారు. ఆ బృందంలోని సభ్యులలో ఎవరు అప్పు కట్టకపోయినా మిగతా సభ్యులు ఆ మొత్తాన్ని కట్టవలసి వస్తుంది. అనతికాలంలోనే ఈ సూక్ష్మరుణ నమూనా బంగ్లాదేశ్‌లో ప్రాచుర్యం పొందడమే గాక ప్రపంచంలోని అనేక దేశాలకు పాకింది. మన రాష్ట్రంలో గత పదేళ్లుగా వృద్ధి చెందుతున్న డ్వాక్రా స్వయం సహాయక గ్రూపుల పని విధానం ఈ గ్రామీణ్ బ్యాంక్ నుండి ప్రేరణ పొందిందే.

మహ్మద్ యూనిస్ నాటిన బీజం ఇవ్వాళ వటవృక్షమైంది. ప్రపంచబ్యాంక్ అంచనాల ప్రకారం ప్రపంచవ్యాప్తంగా దాదాపు ఏడు వేల మైక్రోఫైనాన్స్ సంస్థలు, దాదాపు కోటి అరవై లక్షల మంది పేదవారికి రుణాలు అందిస్తున్నాయి. ఐక్యరాజ్యసమితికి చెందిన ఎకనామిక్ ఎండ్ సోషల్ కౌన్సిల్, 2005 సంవత్సరాన్ని అంతర్జాతీయ సూక్ష్మరుణ సంవత్సరంగా ప్రకటించింది. ఇప్పుడు, నార్వేలోని నోబెల్ కమిటీ యూనిస్‌కు, గ్రామీణ్ బ్యాంక్‌కు నోబెల్ శాంతి బహుమతి ప్రకటించింది.

అసలు సూక్ష్మరుణాలనేవి ఉట్టి ప్రచారమే తప్ప వీటివల్ల పేదరిక నిర్మూలన సాధ్యం కాదనేది కొంతమంది విశ్లేషకుల వాదన. ప్రభుత్వ బ్యాంకుల నుండి, అంతర్జాతీయ ద్రవ్య సంస్థల నుండి, దాతల నుండి బిలియన్ల కొద్దీ డాలర్లను అతి తక్కువ వడ్డీకి (లేదా వడ్డీ రహితంగా) పొందుతున్న గ్రామీణ్ బ్యాంక్ వంటి సూక్ష్మరుణ సంస్థలు, ఆ డబ్బును పేదలకు 22 శాతం నుండి 30 శాతానికి వడ్డీకిచ్చి మారుబేరం చేస్తున్నాయని, దీనివల్ల పేదలకన్నా సదరు మైక్రోఫైనాన్స్ సంస్థలకే భారీ ఎత్తున లాభం జరుగుతోందనేది ఒక చేదు నిజం. మన రాష్ట్రంలో కూడా మైక్రోఫైనాన్స్ సంస్థలు పేదలనుండి అధిక వడ్డీలు గుంజడం వల్ల చివరికి కొందరు రుణగ్రస్తుల ఆత్మహత్యల వరకూ విషయం వెళ్లింది. ఇవ్వాళ బహుళజాతి బ్యాంకులైన సిటీబ్యాంక్, ఏబిఎన్ ఆమ్రో బ్యాంక్ వంటివి ప్రైవేట్ మైక్రోఫైనాన్స్ సంస్థల ద్వారా పేదలకు సూక్ష్మరుణాలు ఇవ్వడానికి ఉవ్విళ్లూరుతున్నాయంటే, దాని వెనుక ఉన్నది దీన జనోద్ధరణ కాదనీ లాభాల కాంక్ష మాత్రమేననీ ఎవరికైనా ఇట్టే అర్థం అవుతుంది. డ్వాక్రా మహిళలతో బిల్‌క్లింటన్, జార్జిబుష్, ఉల్ఫెన్‌సన్, ఉల్ఫోవిట్జ్ గ్రూప్ ఫోటోలు తీయించుకుని తమ తమ దేశాల్లో వాటిని చక్కటి ప్రచార వస్తువుల్లా వాడుకుంటున్నారు. పేదరిక నిర్మూలనకు సూక్ష్మరుణాలు అద్భుతమైన మందు అనే ప్రచారం ఇవ్వాళ జోరుగా సాగుతోంది.

ఈ ప్రచారపు హోరులోంచి బయటపడి వాస్తవాలు పరికిస్తే విషయం బోధపడుతుంది. 2005 నవంబర్‌లో బంగ్లాదేశ్ ఆర్థిక, ప్రణాళిక శాఖామంత్రి సైఫుర్ రహమాన్ ఒక సభలో ప్రసంగిస్తూ ఇలా అన్నారు – 'ఈ ఎన్‌జీఓలు చాలా ఎక్కువ సంపాదిస్తున్నారు. బ్యాంకుల దగ్గర 8 నుండి 9 శాతానికి తెచ్చి ఆ డబ్బును 22 శాతానికి తిరిగి అప్పులిస్తున్నారు. ఏటా 30 నుండి 40 బిలియన్ టాకాల సొమ్మును బ్యాంకుల నుండి రుణంగా తీసుకుంటున్న ఈ సూక్ష్మరుణ సంస్థలు ఎత్తైన భవంతులు నిర్మించుకుంటూ రాక్‌ఫెల్లర్ సంస్థను గుర్తుకుతెస్తున్నాయి'.

గ్రామీణ్ రుణాలు కేవలం స్వంత ఇళ్లు ఉన్నవారికే ఇస్తారనీ, దీని వల్ల అత్యంత పేదలకు లాభం చేకూరట్లేదు అని కూడా కొద్దిమంది విశ్లేషకులు అంటున్నారు. అసలు ఈ రుణాలు ఉపయోగించుకొంటున్న వారిలో అత్యధికులు వాటిని తమ అవసరాలు తీర్చుకోవడానికి వాడుకుంటున్నారనీ, దాన్ని పెట్టుబడిగా పెట్టి జీవనోపాధిగా పొందుతున్నవారు కొద్ది మందేనని ఒక విశ్లేషణ తేల్చింది. బంగ్లాదేశ్‌లో గ్రామీణ్ బ్యాంక్ నుండి రుణాలు పొందుతున్న వారిలో 55 శాతం మంది కనీస ఆహారం కూడా పొందలేని దుస్థితిలోనే కొనసాగుతున్నారని జీనానెఫ్ అనే అమెరికన్ జర్నలిస్టు ఇటీవలే వ్యాఖ్యానించారు.

మైక్రోఫైనాన్స్ వ్యవస్థ సంప్రదాయ ఆర్థిక, రుణవితరణ సంస్థలను, ప్రభుత్వ పథకాలను బలహీనపరుస్తుందని, ఇది క్రమంగా అన్నిటికీ ఎన్‌జీఓలపై ఆధారపడే ఒక పరిస్థితికి దారితీస్తుందనేది చాలా భీతిగొల్పే ఒక వాస్తవం. ప్రజలకు అప్పులివ్వడమే అభివృద్ధికి తారకమంత్రంగా ప్రపంచబ్యాంక్ అనేక దేశాల్లో ఉపదేశం చేస్తోందిప్పుడు. పేదరిక నిర్మూలనకు సమగ్ర పథకాలను అమలుచేయడం, విద్య, వైద్యం వంటి మౌలిక వసతుల రూపకల్పనపై శ్రద్ధ పెట్టడం వంటి పనులు చేయాల్సిన ప్రభుత్వాలు ఆ పని మరచి ఎన్‌జిఓలకు డబ్బులందివ్వడం – వారా డబ్బును పేదలకు రుణంగా ఇవ్వడం పైనే శ్రద్ధ పెడుతున్నారు. సూక్ష్మరుణాల సమర్థతను సమాజం పై వాటి ప్రభావాన్ని బేరీజు వేయడంలో ప్రపంచబ్యాంక్ చాలా వింత పద్ధతి అవలంబిస్తోంది.

# బతుకు దెరువుకు దుబాయ్‌కి

– భూపతి ఎస్. ఆర్.

ప్రపంచంలో ఉన్న మొత్తం క్రేన్లలో 40 శాతం దుబాయ్‌లో ఎమిరెట్స్‌లో నిర్మాణ రంగంలో పనిచేస్తున్నాయి. జానా బెత్తెడు స్థలాల్లో ఆకాశ హర్మ్యాలు పోటాపోటీగా నిర్మాణమౌతున్నాయి. 160 అంతస్తుల 'బుర్జ్ దుబాయ్' ప్రపంచంలోనే అతి పెద్ద టవర్‌గా రూపుదిద్దుకుంటోంది. దీనినిర్మాణంలో ఎందరో మనరాజన్నలు, రామన్నలు చెమటోడుస్తున్నారు. కాంక్రీట్ దిమ్మలపై తెలుగులో వారి పేర్లు లిఖిస్తున్నారు. అతి తక్కువ జీతాలకు పని చేసే నిర్మాణ రంగ లేబర్‌లో అఖరి వరసలో వీరు, బంగ్లా దేశీయులు, నేపాలీలు ఉన్నారు. వీరు ఎంత శ్రమిస్తారో అందుకు భిన్నంగా అంత తక్కువ ఫలితాన్ని పొందుతున్నారు.

సరయిన వసతిలేక, ఆరోగ్యకర వాతావరణంలేక, మండేఎండల్లో రోడ్డు పనుల్లో, సఫాయి పనుల్లో, టవర్ల నిర్మాణంలో, బంద పనుల్లో వీరంతా కన్పిస్తారు. పాకిస్తాన్ నుండి పఠాన్లు, పంజాబ్ నుండి ఒడ్డు పొడవు ఉన్న కూలీలు లెబర్ కాంట్రాక్టర్ల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి పనులు చేస్తున్నారు. ఎందరో కేరళ వాసులు ఇక్కడ చిన్న చిన్న ఉద్యోగాలలో లక్షల్లో ఉన్నారు. వీరంతా ఇక్కడ బతుకు దెరువుగా వచ్చినోళ్లె. వీరిలో చాలా మందికి 600 నుండి 750 దీర్హమ్స్ జీతాలు ఉంటాయి. 500 దీర్హమ్స్‌కి కూడా పనిచేస్తున్నారని విన్నాను. లేబర్ కాంపుల్లో సరైన మరుగుదొడ్లు లేక, బంకర్ బెడ్ల మీద కాలం వెళ్లబుచ్చుతారు. చిన్న ఉద్యోగులు ఒక్క రూమ్‌లో ఎనిమిది నుండి పన్నెండు మంది నివసిస్తారు. ఒక్కొక్కరు మూడు వందల యాభై నుండి ఐదు వందల వరకు రూమ్ కిరాయి చెల్లిస్తారు. లెబర్‌కి అతి తక్కువ జీతం ఇచ్చి అతి ఇరుకు బెడ్ ఇచ్చి సరిపెడతారు. చిన్న ఉద్యోగులు సొంత వసతి ఏర్పాటు చేసుకోవాల్సిందే. పదివేల దిర్హమ్స్ వచ్చే వారికి కూడా జాయింట్ వసతే గతి. లక్షలాది మందికి భార్య, పిల్లలను తెచ్చుకోవడం కలే. చాలా మంది కుటుంబాలు ఒకే గది హాలు ఎపార్టుమెంట్‌లో పంపకం చేసుకొంటారు. వంటగది పంపకం, మరుగుదొడ్డి పంపకం. మరుగుదొడ్డిలో టైమ్ కోటా కచ్చితంగా అమలు చేయాల్సిందే. పదివేల దిర్హమ్స్ పైన వచ్చే ఇంజనీర్లు, మేనేజర్లు కూడా ఇలానే బతకాలి. సంవత్సరానికి ఒక స్టూడియో ఫ్లాట్‌కి ముప్పై నుండి ముప్పైఆరు వేల దిర్హమ్స్ కిరాయి. ఒక రూమ్, హాల్ అయితే యాభై నుండి అరవై వేల దిర్హమ్స్, రెండు రూములు, హాలు అయితే అరవై అయిదు నుండి తొంభై వేల వరకు అద్దె సంవత్సరానికి.

ఇక తెల్లవారి కోసం ప్రత్యేకమయిన జీతాలు, ప్రత్యేకమయిన వసతులు బీచ్‌లోకి దగ్గరగా నివాసాలు. ఇండియన్ ఇంజనీర్లకి మేనేజర్లకి ఇచ్చే జీతానికి రెండు నుండి మూడు రెట్ల జీతాలు వసతులు వీరికి ఉంటాయి. మొత్తంగా చూస్తే దుబాయ్, ఇండియాకు ఎక్స్‌టెన్షన్ గానే అగుపిస్తుంది.

ఫిలిప్పైన్ దేశస్థులు, ముఖ్యంగా స్త్రీలు ఫ్రంట్ ఆఫీసుల్లో, హోటల్స్‌లో, హాస్పిటాలిటీ ఇండస్ట్రీలో పని చేస్తారు. వీరు తక్కువ జీతాలకు ఎక్కువ సేవలు చేస్తారు. దుబాయ్ ప్రభుత్వం చాలా తెలివిగల ప్రభుత్వం. ఏ దేశస్థుల్ని ఎలా వాడుకోవాలో స్టడి చేసి అలా వాడుకుంటోంది. వీళ్లకి చాలా తెలివయిన అమెరికా, బ్రిటిష్ దేశాల్లో ఆరితేరిన కన్సల్టెన్సీ కంపెనీలు సలహాదార్లుగా ఉన్నాయి.

ఇక్కడ టూరిజం వర్ధిల్లుతోంది. నిశ్శబ్దంగా, అందంగా, అల్లరి లేకుండా వ్యభిచారం వర్ధిల్లుతోంది. చితికిపోయిన రష్యా, తూర్పు యూరప్, ఆఫ్రికాలనుండి, అల్బేనియా, కోసావో, ఇలా ఒకటేమిటి ఎన్నో దేశాల నుండి స్త్రీలు ఇక్కడ వ్యభిచార మార్కెట్లో లభ్యమౌతారు. వీరంతా తమ ఒళ్లమ్ముకొని తమ దేశాల్లో కుటుంబాలను పోషిస్తారు. ఇక్కడ మార్కెట్లో సరుకులు కొనుగోలు చేస్తారు. తాము సరుకుగా అమ్ముడుపోయి ఇక్కడ 'మాల్స్' వ్యాపారుల సరుకులు కొని వారి జేబులు నింపుతారు. యాభై వేలకు పైగా ఉన్న హోటల్ రూములను కిటకిటలాడిస్తారు. ఇదంతా గమనించి రాబోయే రోజుల్లో ఇంకెన్నో కొత్త కొత్త హోటల్స్ వెలుస్తున్నాయి. చెప్పుకోవాల్సిదేమంటే, ఇదంతా నిశ్శబ్దంగా, కడుసున్నితంగా నియంత్రించబడి కనక వర్షం కుర్పిస్తున్న వ్యాపారం. శ్రమ ద్వారా నిర్మాణం చేస్తున్నారు. ఇక్కడ అందరి బాధ ఒకటే – ఇరుకు ఇల్లు బాధ, ఇల్లు లేని బాధ, జీతం చాలని బాధ, ఇంటికిరాయి కట్టగా, తినగా మిగిలేది సొంత ఇంటికి పంపగా అప్పు అప్పుగానే ఉండి పోతుంది. అప్పుచేసి దళారులకిచ్చిన డబ్బు బాపతు వడ్డి పెరుగుతునే ఉంటుంది. అందుకని ఏడుస్తూ, మొత్తుకొంటూ పని చేస్తూనే ఉంటారు.

ఇహ ఎందరో సంపాయించిన వాళ్లూ ఉన్నారు. ఇంటి బ్రోకర్లు, రియల్ ఎస్టేట్ బ్రోకర్లు, లేబర్ కాంట్రాక్టర్లు, ఇతర కాంట్రాక్టర్లు, ఇలా ఎందరో వ్యాపారులు ఉన్నారు. వీరికేమీ ఇబ్బందులుండవు. ఇంజనీర్లకు, మేనేజర్లకు ఫరవాలేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే అందరి గురి లేబర్ ని కొట్టుకు బతకడమే. దుబాయ్ పాలకుడి నీతి కూడా అదే. 'అయినా బతుకు దెరువుకు దుబాయ్' కి జనం వస్తూనే ఉన్నారు. ఎందుకంటే ఈ మాత్రం బతుక్కూడా సొంత ఊళ్లో నోచుకోక కావచ్చు. ◆

---

1995లో గ్రామీణ్ బ్యాంక్‌పై ప్రపంచబ్యాంక్ వెలువరించిన ఒక నివేదికలో ఆ బ్యాంక్ ఆర్థిక పనితీరు, దాని లాభదాయకత పైనే ఎక్కువ శ్రద్ధ చూపించింది. 95 శాతం పైబడి రుణాల రికవరీ జరగడం ఎంతో గొప్ప విషయంగా చెప్పే ఇటువంటి నివేదికలు అసలు రుణగ్రహీతల్లో ఎంతమంది అప్పు తీర్చడానికి మళ్లా అప్పుచేస్తున్నారో చెప్పవు.

ఇక గ్రామీణ్ బ్యాంక్ వ్యవస్థాపకుడు, యూనిస్ ఇటీవల చేపడుతున్న పలు కార్యక్రమాలు విమర్శలకు దారితీస్తున్నాయి. బంగ్లాదేశ్‌లో బహుళజాతి సంస్థ మోన్‌సాంటో గ్రామీణ్ బ్యాంక్‌తో కలిసి పనిచేయడానికి నిర్ణయించుకున్నపుడు భారీ ఎత్తున నిరసన వ్యక్తమైంది. ఈ రచ్చ చూసి యూనిస్ మనసు మార్చుకుని మోన్‌సాంటోతో కలిసి పనిచేయం అని ప్రకటించవలసి వచ్చింది.

ఇక కొసమెరుపు ఏమిటంటే మహ్మద్ యూనిస్ కొంతకాలం కిందట నార్వేకు చెందిన టెలికమ్యూనికేషన్ కంపెనీ నార్టెల్‌తో కలిసి 'గ్రామీణ్ ఫోన్' అనే సెల్‌ఫోన్ కంపెనీనొకదాన్ని స్థాపించాడు. గ్రామీణ్ బ్యాంక్‌లోని సభ్యులనే ఈ గ్రామీణ్ ఫోన్ సర్వీసులు అమ్మడానికి వాడుకోవడం కూడా విమర్శలకు దారితీస్తోంది. అసలు మహ్మద్ యూనిస్‌కు నోబెల్ రావడం కూడా ఈ నార్వే కంపెనీతో ఉన్న సాన్నిహిత్యం వల్లనేనని గుసగుసలు వినిపిస్తున్నాయి. ◆

# శాసనమండలి - ఉపాధ్యాయ సంఘాలు

-డా. జి. లచ్చయ్య

ఎట్టకేలకు శాసనమండలి పునరుద్ధరణ కార్యక్రమం మొదలైయింది. రాష్ట్రంలో పరోక్షంగా సాధారణ ఎన్నికల సందడి ప్రారంభమైయింది. నిజానికి కరీంనగర్, బొబ్బిలి ఉపఎన్నికలు జరుగుతున్నాయనుకున్న తరుణంలో శాసనమండలి ముందుకు తీసుకొని రావడం డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి రాజకీయ చతురతకు నిదర్శనం. చిలికి చిలికి గాలి వానలా మారిన కెసిఆర్ రాజీనామా తంతూ, దీంతో మొదలైన సానుభూతికి కొంతకాలం పాటు తెరపడినట్టైంది. వై.ఎస్.ఆర్. కాంక్షిస్తున్న సమైక్య రాగం మరికొంత కాలం వినిపించడానికి, కొంత మందిలో చొప్పించడానికి ఇది పని చేయవచ్చు. ముఖ్యంగా ఈ నినాదాన్ని ఉపాధ్యాయ శాసనమండలి నియోజకవర్గాల ద్వారా లబ్ధి పొందే అవకాశం కొంతమేరకు ఉండవచ్చు.

గతంలో ఉన్న శాసనమండలి నియోజకవర్గాలను పునర్నిర్మాణం చేయడంతో ఆంధ్రాలో ఒకటి తగ్గి, తెలంగాణలో ఒకటి పెరగడం ద్వారా తెలంగాణ నుంచి కొంత సానుభూతి పొందాలని వైఎస్ఆర్ భావించవచ్చు. కాని ఇందులో కూడా సమేక్య వాదన వినిపించకనే వినిపిస్తుంది. ఆంధ్రా, రాయలసీమ నియోజకవర్గాలను అట్టావుంచి తెలంగాణలోని మూడు నియోజకవర్గాల పరిధిలో వచ్చే పది జిల్లాల్లో దాదాపు పద్దెనిమిదికి పైగా ఉపాధ్యాయ సంఘాలు పని చేస్తున్నాయి. ఒక్క ప్రభుత్వ ఉపాధ్యాయ సంఘం (జిటిఎ) తప్ప, మిగతా ప్రధాన సంఘాలన్నీ కలిసి 'జాక్టో' అనే ఐక్య వేదిక కింద ఈ మధ్యనే చేరి ఉమ్మడి సర్వీస్ నిబంధనల సాధనకై ఉమ్మడిగా పనిచేస్తున్నాయి. ఈ ఉమ్మడి సర్వీస్ నిబంధనలు ప్రస్తుతం రాష్ట్ర హైకోర్టులో నానుతున్నది. పరిష్కారం ఎలా ఉంటుందో తెలియదు. తాత్కాలికంగా 95,96 జీవోలు అమలుకు నోచుకోవడం లేదు. వీటికి ముందున్న 505, 538 జీవోలు సుప్రీం కోర్టులో పరిష్కారంకు నోచుకోవడంలేదు. ఈ సమస్యలకు శాశ్వత పరిష్కారమైన రాష్ట్రపతి ఉత్తర్వుల సవరణకై అసలు ప్రయత్నం జరగడం లేదు. ఈ ప్రయత్నాన్ని ప్రభుత్వ సహకారంతో 'జాక్టో' ముందుకు తీసుకెళ్లాలి అని అనుకున్న తరుణంలో శాసనమండలి ఎన్నికల ప్రక్రియ ముందుకు రావడంతో ఈ ప్రయత్నం కాస్త ఆగిపోయింది. ఉమ్మడి సర్వీసు నిబంధనలు ఇప్పట్లో ఎటూ తేలని స్థితి ఏర్పడడం, ఉపాధ్యాయుల్లో నిరుత్సాహం పెరగడం, ఉపాధ్యాయ, విద్యారంగంపై తీవ్ర ప్రభావాన్ని చూపడం జరుగుతుంది.

దాదాపు అన్ని ప్రధాన ఉపాధ్యాయ సంఘాలు, చిన్నా చితక సంఘాలు కూడా ఉపాధ్యాయ శాసనమండలి పోటీ చేస్తామని ప్రకటించుకుంటున్నాయి. కొన్ని సంఘాలు ఐక్య సంఘటన కట్టాలని ఆలోచిస్తున్నట్లు కూడా కొన్ని ప్రకటనలు వెలువడుతున్నాయి. రాష్ట్ర వ్యాపితంగా నిర్మాణం లేని సంఘాలు, కేడర్ సంఘాలు కూడా ఎనిమిది నియోజక వర్గాల్లో పోటీ చేయాలనుకోవడంలోని రాజకీయాలు అర్థం చేసుకోవచ్చు. సాధారణ ఎన్నికల్లో, స్థానిక సంస్థల ఎన్నికల్లో ఎన్నికల కొండి ఏ విధంగా ఉంటుంది, డబ్బు, మద్యం ఏవిధంగా పారుతుందో ఈ రాష్ట్ర ప్రజలింకా మరిచిపోలేదు. శాసనమండలి ఎన్నికలు కూడా వీటికి అతీతం కాదు. ఎందుకంటే ఇప్పటికీ ఈ శాసనమండలి ఎన్నికలకు రాజకీయ రంగు పులుముకుంటూనే ఉన్నది.

తెలంగాణ ప్రాంతంలో పనిచేస్తున్న ప్రధాన సంఘాలన్నీ దాదాపు ఎన్నికల బరిలోకి దిగాలనుకుంటున్నాయి. ఒక్క డెమోక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్‌కు (డిటిఎఫ్) తప్ప మిగతా సంఘాలేవి ఇప్పటికి తెలంగాణ పట్ల, ప్రత్యేక వాదన పట్ల తమ వాదనని ప్రకటించలేదు. అసలుకు వారి విధానాల్లో తెలంగాణ ఎజెండానే లేదు. డిటిఎఫ్ మాత్రం స్పష్టంగా ప్రజల ఆకాంక్షలను గౌరవించాలని, వారి ఉద్యమాలకు అనుగుణంగా సంస్థ స్పందించాలని, ప్రత్యేక తెలంగాణ వాదంతో పాటు, ఇతర ప్రాంతాల అభివృద్ధి కూడా దృష్టిలో ఉంచుకొని, ఆ ప్రాంత ప్రజల ఆకాంక్షల్ని గౌరవించి మద్దతు తెలపాలని స్పష్టంగా రాసుకున్నది. ఆ మేరకు ఆచరణలో చూపుతున్నది. ఇప్పటికీ టిఆర్ఎస్ లాంటి వేదికలు గాని ఐక్య వేదికలు గాని, విద్యావంతుల వేదిక గాని ఆవిర్భావం కాకముందే పదుల సంఖ్యలో తెలంగాణ వెనుకబాటుతనానికి సంబంధించి సదస్సులను, సమావేశాలను పెద్ద ఎత్తున పెట్టి, ముఖ్యంగా ప్రొ. జయశంకర్ లాంటి వారికి వేదికను కల్పించింది. అదే విధంగా తెలంగాణకు జరుగుతున్న అన్యాయాల్ని ఎత్తి చూపుతూ, పరిష్కార మార్గాలను కూడా ముందు పెడుతూ వారి అధికార మాస పత్రిక అధ్యాపక జ్వాలలో స్పష్టంగా చెప్పడం జరిగింది. ఇంత బలంగా తెలంగాణ ఉద్యమం విభిన్న రూపాలలో ముందుకు వస్తుంటే సామాజిక స్పష్టతో పని చేస్తున్నామని చెప్పుకునే కొన్ని ఇతర ఉపాధ్యాయ సంఘాలు తమ చెవులను పూర్తిగా మూసుకున్నాయంటే వైఎస్ఆర్ వాదాన్ని వారు పూర్తిగా బలపరుస్తున్నట్లే లేదా అవకాశ వాదమన్నా కావాలి. కాబట్టి వైఎస్ఆర్ తన రాజకీయ చతురతతో ఉపఎన్నికలకు ముందుగా శాసనమండలిని ముందుకుతెచ్చి సమైక్యవాదాన్ని తెలంగాణ మేధావులతో (ఎగువ సభ కాబట్టి పోయేవారంతా మేధావులుగా చలామణి అవుతారు) పలికించాలని చూస్తున్నారు. ఎంతో కాలంగా ఈ అవకాశం కోసం ఎదురుచూస్తున్న రాజకీయ వాదులకు తెలంగాణ వాదంకన్నా శాసనమండలే ప్రధానంగా కనపడుతోంది. ఈ విధంగా రాజశేఖరుడు చట్టసభల పేరున మరికొంత మంది సమైక్య వాదులను తయారుచేయవచ్చు. లేదా అలాంటి వారందరికి రాజకీయ తీర్థం పెట్టి వారి దృష్టిని మరల్చవచ్చు. ఇప్పటికే కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు అనుబంధ ఉపాధ్యాయ సంఘాల్ని ఏర్పాటు చేయబోతున్నట్లు ప్రకటించుకున్నాయి. ఈ అనుబంధ సంఘాలు కూడా సమైక్యరాగాన్నే ఆలపిస్తాయనడంలో సందేహం లేదు.

ఈ విధంగా రాజకీయ రొంపిలో దిగి ఉపాధ్యాయ సంఘాలు ప్రజల ఆకాంక్షల్ని పట్టించుకోవాలనే స్పృహను కోల్పోవడం ఈ రాష్ట్ర

ప్రజల దురదృష్టం. కొద్దిలో గొప్పగా తెలంగాణ ప్రాంత ఎన్‌జివో సంఘం 610 జీవో అమలుకై తెలంగాణ జెఎసిని ఏర్పాటు చేయగా, ఈ మధ్యనే ఏర్పాటైన టిఆర్‌టియు (తెలంగాణ టీచర్స్ యూనియన్) తప్ప ఇతర ఏ సంఘాలు అందులో చేరకపోవడం ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాల సామాజిక స్పృహ ఎంతో తెల్పుతున్నాయి. అయితే గిర్‌గ్లాని కమిటీ రిపోర్టు, 610 జీవో రాజకీయాలతో ముడిపడిన అంశాలు కాబట్టి వాటి జోలికి పోవడమెందుకని తెలంగాణ ప్రాంత ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాలు భావిస్తే, ఆ సంస్థలు ఏ ఉద్యోగుల, ఉపాధ్యాయుల శ్రేయస్సుకోసం పనిచేస్తాయనేది ప్రశ్నార్థకమే. అలాగే రాజీయాల జోలికి పోవడమెందుకనే అభిప్రాయం ఉంటే శాసనమండలికి పోటిచేయడం రాజకీయం కాదా? ఇంకా చెప్పాలంటే రాజకీయ పార్టీలకు అనుబంధంగా ఉపాధ్యాయ సంఘాలను కూడా ఏర్పాటు చేసుకుంటున్నప్పుడు తెలంగాణకు జరుగుతున్న అన్యాయాన్ని ఈ సంఘాలు ఎందుకు వీక్షించ లేకపోతున్నాయి? ఇవన్నీ సమాధానం లేని ప్రశ్నలేమి కాకున్నా, అవకాశవాద రాజకీయాలని తెలియకనే తెలుస్తున్నవి.

ఉపాధ్యాయ సంఘాల్ని విద్యారంగానికే పరిమితంగా ఆలోచించినప్పుడు మండలి ఎన్నికల్లో ఆయా సంఘాలు ఎన్నికల ఎజెండా ఏమై ఉంటుందనేది ప్రశ్న. ఏముండాలనేది ఆలోచన. ఈ మధ్యన వస్తున్న పత్రికా ప్రకటనల్లో కనీస విధివిధానాలు గాని, కార్యాచరణగాని ఏ సంఘం ప్రకటించడం లేదు. అసలు ఎన్ని ఉపాధ్యాయ సంఘాలకు విద్యారంగ (ఉపాధ్యాయ రంగంతో పాటు) సమస్యల పట్ల స్పష్టత ఉందనేది కుడా ప్రశ్నార్థకమే. ఉమ్మడి సర్వీస్ నిబంధనల సాధన లక్ష్యంగా పనిచేస్తున్నామని చెప్పుకునే పిఆర్‌టియు రాష్ట్ర నాయకులు, మండలి ఎన్నికల సందర్భంగా ప్రతి ఉపాధ్యాయుడికి స్వంత ఇల్లు, కారు ఉండాలనే ఆకాంక్షను వెల్లిబుచ్చారు. మండలి ఎన్నికల్లో కారు, ఇల్లు విద్యారాంగ ఎజెండాలవుతాయా?

మరికొన్ని రాష్ట్రస్థాయి సాధారణ (జనరల్) సంఘాలు తమతమ నిబంధనావళిలో విద్యారంగం పట్ల, ఉపాధ్యాయ రంగం పట్ల రాజ్యాంగానికి లోబడిన ఆకాంక్షలను నెరవేర్చడానికి కృషి చేస్తామని రాసుకున్నాయి. అందులో ప్రధానంగా లౌకిక వాదం, శాస్త్రీయ దృక్పథం విద్యారంగంలో అమలయ్యేలా చూస్తామని చెపుతాయి. కాని ఆచరణలో ఈ నినాదాల అమలకు చేపట్టిన కార్యక్రమాలు ఎక్కడా కనబడవు. దాదాపుగా గత ముప్పై సంవత్సరాలుగా ఉపాధ్యాయ సంఘాల ఉద్యమాలను చూసినప్పుడు ఈ విషయం స్పష్టంగా కనపడుతున్నది. కాకపోతే ఉపాధ్యాయుల సర్వీసు సంబంధ విషయాలను, ఆర్థికపరమైన విషాయలను సమైక్య పోరాటంతో సాధించుకోవడం అభినందనీయం. కాని ఇవి విద్యారంగ సమస్యలకు పరిష్కారం కాజాలవు.

ఈ రోజు విద్యారంగం దారీ తెన్నులేక, ప్రపంచీకరణ నేపథ్యంలో మొత్తం వ్యాపారంగా మారిపోయింది. రాజ్యాంగంలో పొందుపర్చుకున్న ఉచిత విద్య నుంచి మొదలుకోని, శాస్త్రీయ విద్యకానీ, ఉపాధి అవకాశాలు పెంచే విద్యకానీ ఆచరణలోకి అరవై సంవత్సరాల తర్వాత కూడా రాలేకపోయింది. ఈ దిశగా ఉపాధ్యాయ సంఘాలు కొంతమేరకు ఆలోచించాయేమో కాని ఆచరణలో ఎక్కడా పెట్టలేకపోయాయి. బదిలీ కౌన్సిలింగ్‌ను సాధించుకున్న సంఘాలు, లోపభూయిష్టమైన డిఎస్సీల పట్ల స్పష్టతను ఏర్పర్చుకోలేదు. సుప్రీం కోర్టు, జాతీయ ఉపాధ్యాయ శ్లోకా మండలి (ఎన్‌సిటిఇ) ఎన్‌జిటి పోస్టుకు కేవలం డిఇడి శిక్షణ పొందిన వారిని నియామకం చేయాలని గొంతెత్తి చెప్పినా ఈ అంశాన్ని పట్టించుకున్న ఏ ఒక్క సంఘం రాష్ట్రంలో లేకపోవడం, సంఘాల భావదారిద్ర్యానికి ఉదాహరణ.

వీటన్నింటి ఫలితంగా ప్రభుత్వరంగంలోని ప్రాథమిక విద్య (ప్రైవేట్ రంగంలో బాగుందనికాదు) ప్రమాదపుటంచునకు చేరుకుంది. ప్రతీ సంవత్సరం పాఠశాలల్లో నమోదు గణనీయంగా పడిపోతున్నది. చేరిన విద్యార్థులు 5వ, 10వ తరగతి దాకా చేరలేక పోతున్నారు. అంటే నిలకడ కనీస స్థాయిలో లేదు. ఎస్సీ, ఎస్టీలలో వీరి సంఖ్య అత్యధికంగా, ఆడపిల్లల్లో మరీ ఎక్కువగా ఉంటున్నట్లు జాతీయ నమూనా సర్వేలు (ఎన్‌ఎస్‌ఎస్) ప్రతి సంవత్సరం తెలుపూతూనే ఉన్నాయి. విద్యార్థుల విద్యారంగ స్థాయి కనీస స్థాయిలో (చదవడం, రాయడం, గణితంలో చతుర్విధ ప్రక్రియలు చేయడం) ఉండడంలేదని అనేక సర్వేలు,ఈ మధ్యన విద్యాశాఖ పక్షాన (ఎస్‌ఎస్‌ఎ) రాష్ట్రస్థాయి పరిశీలన బృందాలు వివిధ జిలాల్లో పర్యటించినప్పుడు గుర్తిస్తున్నాయి.

విద్యారంగంగాని, విద్యార్థులు విద్యలో వెనుకబడడానికి గత సంవత్సరాల కాలంగా చెపుతున్న కారణాలను ఉపాధ్యాయులు నేటికీ చెపుతున్నారు. అందులో ప్రధానమైనది 'ప్రభుత్వ విధానమని'. కాని గత 15 సంవత్సరాలుగా విద్యారంగం పట్ల ప్రభుత్వ విధానం గణనీయంగా మార్పుచెందింది. భౌతిక వసతుల కల్పననుంచి మొదలుకోని, ఉపాధ్యాయుల నియామకం, వారికి ఇస్తున్న శిక్షణ, ఆర్థిక సదుపాయాలలో గుణాత్మకమైన మార్పు వచ్చింది. దీనికి తోడు సాంకేతిక వినియోగం పెరిగింది. ఆర్థిక ఇబ్బందులు దాదాపుగా ఏ పాఠశాలకు ఈ రోజులేవు. కాని ఉపాధ్యాయులు, ఉపాధ్యాయ సంఘాలు ఈ అంశాలను గుర్తించలేక, ఉపాధ్యాయుల వాదనకే సంఘాలు మద్దతు తెలుపుతూ ఉండడంతో ప్రభుత్వ విద్యారంగం తన లక్ష్యాల సాధనలో వెనకబడే ఉంటున్నది. దాదాపు ఇరు వర్గాలకు శాస్త్రీయ దృష్టి లోపించింది. ఫలితంగా ప్రభుత్వ విద్యారంగం మరింత రోగగ్రస్తంగా తయారైయింది. వీటి ఫలితంగా ఉపాధ్యాయుల రేషనలైజేషన్‌తో మొదలైన ఉపాధ్యాయ పోస్టుల కుదింపు, పాఠశాల మ్యాపింగ్‌కు (పాఠశాలలను ఎత్తి వేయడం) దారితీసింది. ముప్పై మంది విద్యార్థులకన్నా తక్కువగా ఉన్న పాఠశాలలు రాష్ట్రంలో వేల సంఖ్యలో దర్శనమిస్తున్నాయి. అలాగే యాభై మంది విద్యార్థులకన్నా తక్కువ ఉన్న ఉచ్చతర పాఠశాలలు ప్రతి జిలాల్లో పదుల సంఖ్యలో ఉన్నాయి. ఈ పాఠశాలల్లో రెండు నుండి ఆరు దాకా ఉపాధ్యాయులుండడంతో ప్రతి విద్యార్థిపై దాదాపు వెయ్యి రూపాయలు నెలకు భారం పడుతున్నది. ఈ ఖర్చు ప్రైవేట్ పాఠశాలలో చదువుకుంటున్న విద్యార్థి చెల్లిస్తున్న ఫీజుకన్నా దాదాపు నాలుగు రేట్లుగా ఉంటున్నది. ఈ వాస్తవాన్ని గుర్తించడానికి అటు ఉపాధ్యాయులు, ఇటు సంఘాలు సంసిద్ధంగా లేవు. ఈ సందర్భంగానే కేబ్ (సెంట్రల్ అడ్వైజరీ బోర్డ్ ఫర్ ఎడ్యుకేషన్) కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రిత్వ శాఖకు ప్రైవేట్ విద్యాసంస్థల్లో చదువుకునే బీద విద్యార్థులకు గ్రామీణ ప్రాంత విద్యార్థులకు ఇరవై

# హోళీ పండగరోజున రక్తపు తుంపర్లు

*(కాన్పూరులో గణేష్ శంకర్ 'విద్యార్థి' సంపాదకుడుగా, ప్రచురణకర్తగా ప్రచురించే హిందీ వారపత్రిక 'ప్రతాప్' సంపాదకవర్గంలో వుంటూ, భగత్‌సింగ్ విప్లవ కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. ఆ కాలంలోనే మార్చి 15, 1926 తేది 'ప్రతాప్'లో 'ఓ పంజాబీ యువకుడు' పేరుతో బబర్ అకాలీ ఉద్యమంలో అమరులయిన వారిని గురించి రాసిన వ్యాసం ఇది.)*

హోళీ నాడు – ఫిబ్రవరి 27, 1926న మనమంతా ఆటపాటల్లో మునిగితేల్తూ ఉండగా అదే సమయంలో ఓ విశాల ప్రదేశంలో ఓ మూల ఓ దారుణం జరగసాగింది. వింటేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది! ఒణికిపోతారు!! లాహోరు సెంట్రల్ జైలులో సరిగ్గా అదే రోజున ఆరుగురు బబర్ (పెద్ద సింహం) అకాలీ వీరుల్ని ఉరి తీసేశారు. వారి పేర్లు కిషన్ సింగ్ గడగజ్జ, సంతాసింగ్, దిలీప్‌సింగ్, నందాసింగ్, కరమ్‌సింగ్, ధరమ్‌సింగ్. వీరు గత రెండు ఏళ్ల ఈ కేసులో చూపించిన అలక్ష్యం, తేలికభావాన్ని బట్టే మనం అర్థం చేసుకోవచ్చు. వారు ఈ రోజు కోసం (ఉరితీసే) ఎంతో ఉత్సాహంతో ఎదురుచూస్తున్న వీరు, నెలల తర్వాత జడ్జీగారు తీర్పు ఇచ్చారు. ఐదుగురికి ఉరిశిక్ష, చాలా మందికి ద్వీపాంతరవాసం, దేశ బహిష్కృతి, దీర్ఘకాల కారాగార శిక్ష యిలా, కోర్టువారు తీర్పు ఇవ్వగానే, వారు చేసిన జయఘోషతో కోర్టుహాల్ దద్దిరిల్లింది. అపీళ్లు పెట్టారు. ఐదుగురికి బదులు ఆరుగురికి ఉరిశిక్ష విధించారు. ఆ వేళ వార్త చదివేక, క్షమాభిక్ష కోసం అపీలు పెట్టుకున్నారు. పంజాబ్ కార్యదర్శి ప్రకటించారు, ఇప్పుడప్పుడే ఉరిశిక్ష అమలు జరగదంటూ.

ఎదురుచూస్తున్నాం, కాని ఒక్కసారిగా హోళినాడు శోకగ్రస్థులయిన చిన్న గుంపు ఆ మృత వీరుల శవాల్ని శ్మశానవాటికకి తీసుకుపోతూ ఎదురయింది. ఏ ఆర్భాటం లేకుండా అ శవాలకి అంత్యక్రియలు పూర్తి అయినాయి.

నగరంలో అదే కోలాహలం – తోవని పోయేవాళ్లమీద రంగునీళ్లు జల్లడం. ఎంత దారుణమయిన ఉపేక్ష! వారు తోవ తప్పినవారయితే అవుగాక, ఉన్మత్తులయితే అవుగాక. వారు నిర్భయులయిన దేశభక్తులు. వాళ్లేంచేసినా ఈ దౌర్భాగ్య దేశం కోసమే చేశారు. వారు అన్యాయాన్ని సహించలేకపోయారు. దేశం పతనావస్థని చూసి సహించలేకపోయారు. బలహీనులపై జరుగుతున్న అత్యాచారాల్ని భరించలేకపోయారు. సాధారణ ప్రజానీకాన్ని అణచివేయడం వాళ్ల సహనానికి జవాబు చెప్పింది. ఫలితంగా వాళ్లు (ప్రభుత్వాన్ని) రెచ్చగొట్టి కార్యరంగంలోకి ఉరికారు. వారు సజీవులు! అనుసరింపదగ్గవారు. కర్మక్షేత్రభీషణతే! నువ్వు ధన్యురాలివి!! చనిపోయాక, మిత్రులు, శత్రువులు అంతా సమానమేనంటారు. అది పురుషుల ఆదర్శం, ఒక వేళ వారు అసహ్యించుకొనే పని చేసినా కూడా, స్వదేశపు చరణాలమీద ఎంతటి సాహసంతో, తత్పరతతో ప్రాణాలు అర్పించారో, దాన్ని దృష్టిలో పెట్టుకున్నా, వార్ని మనం పూజించాలి. టేగార్ట్ మహాశయుడు, విరోధిపక్షం వాడయినా కూడా బెంగాల్ వీర విప్లవకారుడు జతీన్ ముఖర్జీ చనిపోయాక, ఆయన వీరత్వాన్ని, దేశ ప్రేమని, కర్మశీలతని ముక్తకంఠంతో ప్రశంసించాడు, మనం పిరికిపందలం, నరపశువులం, క్షణకాలమయినా మన ఆనందాన్ని, వినోదాన్ని పక్కన పెట్టి, వీరుల మృతికి నిట్టూర్పు సహితం విడవలేకపోయాం. ఎంత నిరాశ కలిగించే విషయం! బ్యురాక్రాల దృష్టిలో ఆ బీదవారు చేసిన అపరాధానికీ శిక్ష వారు అనుభవించారు. ఈ భీషణ దు:ఖాంత నాటకంలో ఓ రంగం పూర్తయింది. ఇంకా తెరపడలేదు. కథ సుదీర్ఘమయినది. వినాలంటే చాలా వెనక్కి వెళ్లాలి.

**బలిదానాల శకం**

శాసనోల్లంఘనోద్యమం జోరుగా సాగుతోంది. పంజాబ్‌లో సిక్ఖులు కూడా లేచారు, గాఢ నిద్రలోంచి లేచారు. సమధికోత్సాహంతో లేచారు. అకాలీ ఉద్యమం మొదలయింది. బలిదానాల శకం ఆరంభమయింది. హోషియార్ పూర్ జిల్లా, మహల్ పూర్‌లో ఉన్న ఖాల్సా మిడిల్ స్కూల్

---

ఐదు శాతం ఫీజులను ప్రభుత్వం చెల్లించాలని సూచన చేసింది. ఈ సూచన అమల్లోకి వస్తే ఇప్పుడున్న విద్యార్థుల సంఖ్యకూడా ప్రభుత్వ పాఠశాలల్లో భవిష్యత్తులో కనపడకపోవచ్చు. దీన్ని దృష్టిలో పెట్టుకొనే విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించిన చట్టం మూసాయిదాలో ఉపాధ్యాయుల నియామకం స్థానిక పాఠశాల మేనేజ్‌మెంట్ (ఎస్‌ఎంసి) కమిటీలకు అప్పజెప్పాలని పొందుపర్చింది. దీన్నికూడా మధ్య ప్రదేశ్‌లో, అస్సాంలో అమలు చేయడంతో ఉపాధ్యాయుల పాఠశాల హాజరు గణనీయంగా పెరిగినట్లు రిపోర్టులు తెలుపుతున్నాయి. ఇది దేశ వ్యాపితంగా అమలైతే ఇప్పటిదాకా సాధించుకున్న అనేక సదుపాయాలు, సర్వీసు నిబంధనలు, ప్రమోషన్లకు చెల్లుచీటి అవుతుంది. ఈ విషయాల పట్ల ఉపాధ్యాయులకు, సంఘాలకు ఎలాంటి అందోళన కలగక పోవడం ఆశ్చర్యకరం.

ఈ స్థాయిలో ఉన్న ఉపాధ్యాయుల సంఘాలు ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా, శాస్త్రీయ విద్యకై పోరాడుతాయని అనుకోవడం నేతిబీరకాయ చందమే అవుతుంది. ప్రజల పిల్లలకు ఉచిత విద్యనందించడంలో తమవంతు కర్తవ్యాన్ని ఎలా నెరవేరుస్తాయో అర్థం కాదు. ఇక విద్యారంగంలో ప్రజాస్వామికరించడంగాని, ప్రజస్వామ్యంలో విద్యారంగానికి ఉండే స్థానాన్ని గుర్తించడంలోగాని సఫలీకృతం అవుతాయంటే కొంత అనుమానమే. ఈ సందర్భంగా ఉపాధ్యాయ సంఘాలు ఆర్‌టిసి కార్మికుల మనస్తత్వాల్లో వచ్చిన మార్పును గుర్తిస్తే బాగుంటుంది. ఈ నేపథ్యంలో శాసనమండలికి పోటీ చేస్తూ తమ విధానాలేమిటో స్పష్టంగా చెప్పుకుంటే బాగుంటుంది. లేనిచో రాజకీయ వాదులకు, ఉపాధ్యాయ మేధావులకు ఏమి తేడా కనపడదు. ఇప్పటికైనా ఇటువైపు ఉపాధ్యాయ సంఘాలు దృష్టి సారిస్తే అభినందనీయం. ◆

మాజీ మాస్టారు, మాస్టార్ మోతాసింగ్ ఉపన్యాయసం ఇచ్చారు. ఆయనపై వారెంట్ జారీ అయింది. అయితే చక్రవర్తి గారి ఆతిథ్యం ఆయనకు ఇష్టంలేదు. వూరికినే జైలుకి వెళ్లడం ఆయనకు ఇష్టంలేదు. అందుకే ఆయన ఉపన్యాసాలు ఇస్తునే ఉన్నారు. కోట్‌ఫతూహీ గ్రామంలో గొప్ప బహిరంగ సభ జరిగింది. పోలీసులు చుట్టుముట్టారు. అయినా మాస్టర్ మోతాసింగ్ ఉపన్యసించారు. చివరిలో అధ్యక్షులవారి సూచన మేరకు సభికులందరూ ఒక్కసారి లేచి నిలబడిపోయారు. మాస్టర్‌జీ ఎలా తప్పించుకుపోయారో తెలీదు. ఈ దాగుడుమూతలాట చాలాకాలం దాకా సాగింది. సర్కారు వారికి పిచ్చెత్తినట్టయింది. తనవాడే ద్రోహం చేశాడు. ఏణ్నర్ధం తర్వాత మాస్టర్ గారు పట్టుబడిపోయారు. ఈ భయంకర నాటకంలో ఇది మొదటి అంకం.

గురూకాబాగ్ ఆందోళన ప్రారంభమయింది. నిరాయుధులయిన వీరుల మీద కిరాయి మూకలు విరుచుకుపడి (లాఠీలతో) స్పృహతప్పిపోయేలా కొడ్తూంటే చూసేవారు, వినేవారు ద్రవించకుండా ఎలా ఉండగలరు? అంతటా అరెస్టుల జోరు. సర్దార్ కిషన్ సింగ్ గడగజ్జ పేరున కూడా వారెంట్ జారీ అయింది. అతనూ అదే కోవకి చెందినవాడు. అరెస్టు కావడం ఇష్టంలేదు. పోలీసులు వెంటబడ్డారు. అయినా ఆయన తప్పించుక తిరుగుతున్నాడు. తానే సంఘటితపర్చిన విప్లవదళం ఉంది. నిరాయుధలపై జరిగిన అత్యాచారాన్ని వారు సహించలేకపోయారు. శాంతిపూరిత ఆందోళనలతో పాటుగానే ఆయుధాలు ప్రయోగించడం కూడా అవసరమని వారు గుర్తించారు.

ఒకవైపు కుక్కలు, వేటకుక్కలు (పోలీసులు) వారి జాడల కోసం వాసన చూస్తుంటే, వేరొక వంక ఎత్తుగడలో మార్పు తేవాలని నిర్ణయం తీసుకోబడుతోంది. సర్దార్ కిషన్‌సింగ్ వాళ్లతో అంటున్నారు – 'మన ఆత్మరక్షణకోసం తప్పక మన దగ్గర ఆయుధాలు ఉంచుకోవాలి. అంతకుమించి మరొక అడుగు ముందుకి వేయరాదంటూ. అయితే ఎక్కువ సభ్యుల అభిప్రాయం దీనికి విరుద్ధంగా ఉంది. చివరికి ఓ నిర్ణయం తీసుకోబడింది – వారిలో ముగ్గురు వ్యక్తులు తమ పేర్లు ప్రకటిస్తూ, బాధ్యతంతా తమ మీద వేసుకోవాలంటూ. కరమ్‌సింగ్, ధన్నాసింగ్, ఉదయ్‌సింగ్ ముందుకు వచ్చారు. ఈ నిర్ణయంలోని ఔచిత్యాన్ని ఓ పక్కని పెట్టేసి, ఆ సంఘటన గురించి కాస్త ఊహించండి – ఆ నవవీరులు శపథం చేయడం –

'మేం దేశసేవలో మా సర్వస్వమూ అర్పిస్తాం. పోరాడుతూ, పోరాడుతూ చనిపోతాంగాని, జైల్లులో అడుగుపెట్టడానికి సమ్మతించం.' అంటూ –

ఆ దృశ్యం ఎంత సుందర, మనోహర, పవిత్రతో నిండినది! కుటుంబ బంధాల మోహం త్యాగంచేసి, అలా శపథం తీసుకోవడం! ఆత్మత్యాగానికి పరాకాష్ఠ ఎక్కడా? సాహసానికీ, నిర్భయానికీ సరిహద్దు ఎటు? ఆదర్శ పరాయణతకి చరమ బిందువు ఎక్కడ?

**ప్రాణాలిస్తాం – ఆయుధాలు వదలం**

శ్యామ్‌చురాసీ–హుషియార్‌పూర్ బ్రాంచి రైల్వే లైనులో ఓ స్టేషనుకి సమీపంలో మొట్టమొదటి సారిగా ఓ సుబేదారుని సపా చేసేశారు. ఆ తర్వాత ముగ్గురూ తమ పేరుని ప్రకటించుకున్నారు. ప్రభుత్వం మొత్తం ఫోర్సు అంతటినీ ఉపయోగించి వీళ్లని పట్టుకోవాలని చూసింది. అయినా ప్రయోజనం లేకపోయింది. 'రుడికీ కలాం' అనే చోట సర్దార్ కిషన్‌సింగ్ గడ్డగజ్జని చుట్టుముట్టారు. అతనితో పాటే ఉన్న ఓ యువకుడు గుండు దెబ్బతగిలి పట్టుబడిపోయాడు. అయితే కిషన్‌సింగ్ ఆయుధం సాయంతో అక్కడ నించి తప్పించుకున్నాడు. తోవలో ఓ సాధువు తారసపడ్డాడు. తన దగ్గర అడవి మూలిక ఉందని, దాని సాయంతో అనుకున్నది సాధించవచ్చునని, చెప్పాడు సాధువు. భ్రమలో పడిపోయి, ఓనాడు కిషన్‌సింగ్ ఆయుధం తీసుకెళ్లకుండా, ఒట్టి చేతులతో సాధువు దగ్గరకి వెళ్లాడు. ఏదో ఓ మందుని (కల్వంలో) నూరడానికి ఇచ్చి, మూలిక తెస్తానంటూ బయటికి వెళ్లి, తన వెంబడి పోలీసుల్ని తీసుకువచ్చాడా సాధువు. అతను సాధువా! కాదు సి.ఐ.డి. శాఖలో సబ్ ఇన్‌స్పెక్టర్. (కిషన్‌సింగ్ అరెస్ట్‌కి) బబర్ అకాలి వీరులు రెచ్చిపోయారు. ఎందరో ప్రభుత్వ అసిస్టెంట్లని చంపి పారేశారు. దో ఆబ్–బియా, సట్లెజ్ నది మధ్యలో జలంధర్, హోషియార్‌పూర్ జిల్లా ఇంతకి ముందునించే భారతదేశ రాజకీయ మ్యాపులో ప్రసిద్ధిగాంచాయి. 1915 లో అమరులయిన వారిలో ఎక్కువ భాగం ఈ జిల్లాలకి చెందిన వారే. పోలీసు శాఖ తమ శక్తినంతటిని ఉపయోగించి కూడా ప్రయోజనం లేకపోయింది.

జలంధర్‌కి దూరంలో చాలా చిన్న నది ఉంది. ఆ నది ఒడ్డున ఓ గ్రామంలో 'చౌంతాసాహెబ్' అనే గురుద్వారా ఉంది. అందులో కరమ్‌సింగ్, ధన్నాసింగ్, ఉదయ్‌సింగ్, అనూప్‌సింగ్ మరొక ఇద్దరు, ముగ్గురుతో కలిసి కూచోని కబుర్లు చెప్పుకుంటున్నారు. టీ తయారవుతోంది. హఠాత్తుగా ధన్నాసింగ్ అన్నారు. 'బాబా కరమ్‌సింగ్‌జీ! మనం వెంటనే ఇక్కణ్నించి వెళ్లిపోవాలి. నా మనసెందుకో కీడుని శంకిస్తోంది.' డెబ్భయ్ ఐదేళ్ల వృద్ధుడు కరమ్‌సింగ్ అతని మాటని అంతగా పట్టించుకోలేదు. దన్నాసింగ్ మరి అక్కడ ఉండలేదు. 18 ఏళ్ల దిలీప్‌సింగ్‌ని తనతో తీసుకొని వెళ్లిపోయాడు. కూచున్న బాబా కరమ్‌సింగ్, అనూప్‌సింగ్‌ని పరకాయించి చూస్తూ ఇలా అన్నారు 'అనూప్‌సింగ్! నువ్వు మంచివాడివి కాదోయ్!' అంటూ. ఆ తర్వాత ఆ మాటవూసే మర్చిపోయి, ఇద్దరూ మాటల్లో పడ్డారు. ఇంతలో పోలీసులు చొరబడ్డారు (గురుద్వారలోకి). బాంబులన్నీ అనూప్‌సింగ్ దగ్గర ఉండిపోయాయి. అందరూ హిచి గ్రామంలో దాక్కున్నారు. పోలీసులు ఎంత వెదికినా జాడ తెలియలేదు. చివరికి పోలీసులు హెచ్చరించారు – 'తిరుగుబాటుదారుల్ని బయటికి పంపెయ్యండి! లేదా ఊరికి నిప్పంటించేస్తాం–' అయినా గ్రామం కిమ్మనలేదు.

పరిస్థితి విషమిస్తుందని చెప్పి, వాళ్లే ఇళ్లల్లోంచి బయటికి వచ్చేశారు. దగ్గరున్న బాంబులన్నింటితోనూ వెళ్లి అనూప్‌సింగ్ (పోలీసులకి) లొంగిపోయాడు. మిగిలిన నలుగురు వ్యక్తులు అక్కడ నిలబడ్డారు. చుట్టూ పోలీసులు. ఆంగ్ల కెప్టెన్ ఇలా అన్నాడు – కరమ్‌సింగ్! ఆయుధం విడిచిపెట్టు, నిన్ను క్షమించి, విడిచి పెట్టేస్తాం.'

'మేం మా దేశం కోసం నిజమయిన విప్లవకారుల్లాగా పోరాడుతూ, పోరాడుతూ ప్రాణాలయినా విడుస్తామే తప్ప, ఆయుధాలు విడిచే ప్రశ్నలేదు.' అని జవాబిచ్చి కరమ్‌సింగ్, మిగతా ముగ్గురు సహచరులనూ రెచ్చగొట్టాడు. వారు సింహగర్జనలు చేస్తూ పోరాటంలోకి ఉరికారు. ధనాధన్ మంటూ (రెండువేపులా) గుళ్లవర్షం, మందుగుండు అయిపోగానే

ఆ వీరులు పక్కనున్న నదిలో దుమికేశారు. గంటల తరబడి వారిపై పోలీసులు కురిపించిన గుళ్లవర్షానికి ఆ నలుగురు వీరులూ వీరస్వర్గం అలంకరించారు.

### కొన్ని సాహస గాథలు

కరమ్‌సింగ్ వయసు 75 సంవత్సరాలు. ఈయన కెనడాలో ఉండివచ్చాడు. పవిత్రమయిన ఆచరణ, ఆదర్శ చరిత్ర. బబర్ అకాలి ఉద్యమం అడుగంటి పోయిందని ప్రభుత్వం అనుకుంది, అయినా అది సాగుతూనే ఉంది. 18 ఏళ్ల దిలీప్‌సింగ్ అందగాడు, దృఢకాయుడు. అయితే చదువుకోలేని యువకుడు. అతను దొంగల ముఠాలో చేరాడు. ధన్నాసింగ్ చదువుకోవడం వల్ల గజదొంగ నించి ఓ నిజమైన విప్లవకారునిగా పరిణతి చెందాడు. ఇహ సర్దార్ బంతాసింగ్, బరియామసింగ్ మొదలగువారు ప్రసిద్ధ గజదొంగలు. దొంగతనం విడిచిపెట్టి విప్లవోద్యమంలోకి ఉరికారు.

వీరిలో ఎవరికీ చావంటే ఇసుమంతయినా భయంలేదు. వీరి సంఖ్య రానురాను పెరిగిపోతూ వచ్చింది. ఓనాడు మానహానా గ్రామంలో ధన్నాసింగ్ ఉండగా ఎవరో పోలీసుల్ని పిలుచుకువచ్చారు. తాగుడు మైకంలో ఉన్న ఆయన పట్టుబడిపోయాడు. గుళ్లతో నిండిన పిస్తోలుని లాగుకొని, చేతులకి సంకెళ్లు వేశారు. బయటికి ఈడ్చుకొచ్చారు. 12 మంది సైనికులు, ఇద్దరు ఇంగ్లిష్ ఆఫీసర్లు ఆయనను చుట్టుముట్టారు. సరిగ్గా అదే సమయంలో పెద్ద పేలుడు శబ్దం. ధన్నాసింగ్ బాంబు పేల్చాడు. ఆ పేలుడుకి తను చనిపోవడమేగాక, ఓ ఇంగ్లిష్ ఆఫీసర్, 10 మంది సైనికులు కూడా చనిపోయారు. మిగతావారు బాగా గాయపడ్డారు.

అదే విధంగా ముండేరే గ్రామంలో కూచున్న బంతాసింగ్, జ్వాలాసింగ్ వగైరా చాలామందిని చుట్టుముట్టారు. వీళ్లంతా అటక మీద కూచున్నారు. కొంత సేపటిదాకా గుళ్లవర్షం సాగింది. అయితే పోలీసులు పంపుతో కిరసనాయిలు ఇంటి మీదకి పంప్‌చేసి, ఇంటికి నిప్పంటించారు. అయినా వరియామసింగ్ తప్పించుకు పారిపోయాడు. కాని బంతాసింగ్ మంటలకి ఆహుతి అయ్యాడు.

ఒకటి రెండు సంఘటనలు కూడా ఇక్కడ వర్ణించడం అప్రస్తుతం కాదు. బంతాసింగ్ చాలా సాహసవంతుడు. ఒకసారి జలంధర్ కంటోన్మెంట్‌లో అనుకుంటాను, అశ్వదళానికి కాపలాకాస్తున్న సిపాయి గుర్రాన్నీ, రైఫిల్‌నీ గుంజుకు పారిపోయాడు. ఈయనని పోలీసు బెటాలియన్లకి బెటాలియన్లు వెంబడిస్తూ వచ్చాయి. ఓ అడవిలో అలాంటి బెటాలియన్ ఎదురయింది. సర్దార్ బంతాసింగ్ వెంటనే ఛాలెంజ్ చేశాడు. దమ్ములుంటే ముష్టియుద్ధానికి తలపడండి! అంటూ, అటు చూస్తే కిరాయి పోలీసులు, ఇటు చూస్తే ప్రాణాలకి తెగించిన వీరుడు, ఇద్దరికీ సాపత్యమేమిటి? పోలీసులు తోక ముడుచుకు వెళ్లిపోయారు.

వీళ్లని పట్టుకొనడానికి ప్రత్యేకంగా నియమించిన పోలీసుల పరిస్థితి ఇది సరే. అరెస్టుల ప్రకరణం ఆరంభమయింది. ఊరూరా పోలీసు చెక్‌పోస్టులు పెట్టారు. క్రమక్రమంగా బబర్ అకాలీల జోరు తగ్గింది. అయినా వీళ్లంటే ప్రజల్లో ఆదరణ మాత్రం తగ్గలేదు. వీరు ఏ గ్రామంలోకి వెళ్లినా సంతోషంగా, లోపల పోలీసులంటే భయం ఉన్నా – వీరికి ఆదరసత్కారాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ యంత్రాంగం నిర్జీవమయి పోయిందని చెప్పాలి. ప్రభుత్వ తాబేదార్లు సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయానికి తర్వాత బయటకి రావడానికి జంకుతున్నారు. ఆ రోజుల్లో వారు 'హీరోలు'గా భావించబడేవారు. ఆ వీరులను కొలవడం, వీర పూజగా భావించేవారు. క్రమంగా వారి ప్రభావం తగ్గుతూ వచ్చింది. వందలాది బబర్ అకాలీ వీరులు దొరికిపోయారు. వారి మీద కేసు నడిచింది.

వరియామసింగ్ ఒంటరిగా మిగిలిపోయాడు. జలంధర్, హోషియార్‌పూర్‌లలో పోలీసు ఫోర్సు ఎక్కువగా ఉండటంవల్ల దూరంగా 'లాయర్' ఊరికి వెళ్తున్నాడు. అక్కడ ఒక్కసారి పోలీసులు చుట్టుముట్టారు. అయినా ధైర్యంగా పోరాడుతూ తప్పించుకున్నాడు. అయినా బాగా అలసిపోయాడు. మరొకరు సాయం లేరు. చిత్రమయిన పరిస్థితి. ఓనాడు 'ఢేంసియా' అనే ఊరిలో ఉన్న మావయ్య దగ్గరకు వెళ్లాడు. ఆయుధాన్ని గుమ్మంలో ఉంచాడు. సాయంత్రం భోజనం ముగించుకొని బయలుదేర బోతుండగా పోలీసులు దిగబడ్డారు. ఆయనని చుట్టు ముట్టారు. ఇంగ్లిష్ అధికారి వెనుకపాటున వెళ్లి అయనని పట్టుకున్నాడు. కృపాణంతో అతన్ని బాగా గాయపర్చి, నేలమీదికి ఒరిగిపోయాడు. సంకెళ్లు వేసే ప్రయత్నాలన్నీ వమ్మయినయ్. రెండేళ్ల పాటు సాగిన దమన చక్రంలో అకాలీల ఉద్యమం ముగింపుకి వచ్చింది. తర్వాత కేసు, దాని పరిణామం గురించి ముందుగానే తెలియజేశాను. ఆనాడు తొందరగా ఉరిశిక్ష అమలు కావాలని వారు ఆశించారు. వారి కోరిక నెరవేరింది.

మూలం : 'నా నెత్తురు వృథా కాదు' – భగత్‌సింగ్ రచనలు
సం. నిర్మలానంద

◆

*(5వ పేజీ తరువాయి)*

నల్గొండ వరకూ తెలంగాణ ప్రజలు అలమటిస్తుంటే అన్ని చట్టాలు తుంగలో తొక్కి ఆదరాబాదరాగా ఆంధ్రా ప్రాంతానికి ప్రయోజనం చేకూర్చే పోలవరం, పులిచింతల కడుతున్నారంటే, ఇంకా సమైక్య రాష్ట్రంలో తెలంగాణ అభివృద్ధి జరుగుతుందని ఇక్కడి ప్రజలు నమ్మేంత అమాయకులు కారు సార్!

అయిదు దశాబ్దాల వంచన, ద్రోహాలను తట్టుకుని ఇంకా తెలంగాణ రాష్ట్ర నినాదం సజీవంగా ఉందంటేనే దానికి ప్రజల మద్దతు ఉందని అర్థం. నేతలు స్వార్థంతో మొదలుపెట్టి నడిపే ఉద్యమాలు ఎలా ఉంటాయో మీకు స్పష్టంగా అర్థం కావాలంటే ప్రత్యేక ఆంధ్ర, ప్రత్యేక రాయలసీమ ఉద్యమాలు ఒకసారి పరిశీలించండి. అవి ప్రజల ప్రమేయం లేని, నాయకుల ఉద్యమాలు. మీరు విజ్ఞులు, తేడా అర్థం చేసుకోగలరనుకుంటాను.

**– కె. రామచంద్రారెడ్డి**
నల్లగొండ

'ప్రజలు పాల్గొనని ప్రత్యేక తెలంగాణ ఉద్యమం' అన్న వి. హనుమంతరావుగారి వ్యాసం చదివాక వీక్షణం ప్రధాన సంపాదకుడిగా, ప్రపంచీకరణను వ్యతిరేకించే, పేదప్రజల నడ్డివిరిచే ఆర్థిక సంస్కరణలు వ్యతిరేకించే మేధావిగా గుర్తింపు పొందిన వ్యక్తి ఎట్లా రాయగలిగినాడో అని ఆశ్చర్యంగా ఉన్నది. తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలను సమర్థించే దగ్గిర ప్రజలవైపు నిలబడే మేధావులుగా గుర్తింపు ఉన్న వాళ్లందరూ ఒక్కొక్కరుగా కోస్తామానస పుత్రులుగా తేలిపోవడం ఇటీవలి విషాదం. మేం ప్రత్యేకంగా ప్రేమించే వీక్షణం ప్రధాన సంపాదకులు వి. హనుమంతరావుగారు కూడా ఇట్లా బయటపడిపోవడం ఒక భయంకరమైన వాస్తవం.

హనుమంతరావుగారి ప్రధాన ఆరోపణ తెలంగాణ ఉద్యమానికి ప్రజల మద్దతులేదు. అది కేవలం 'తెలంగాణ వస్తే అధికార పదవులు దొరకుతాయేమోనని ఆశించే రాజకీయ నాయకులు, తెలంగాణలోని కొంతమంది మేధావులు పత్రికల్లో చేసే హడావుడి' మాత్రమే. ఎప్పటిదాకనో ఎందుకు గత రెండు నెలలుగా సిద్దిపేట శంఖారావం మొదలుకొని, కరీంనగర్, సిరిసిల్ల, జగిత్యాల, వరంగల్, నకిరేకల్, నిర్మల్, ఖమ్మం పట్టణాల్లో జరిగిన ధూంధాం సాంస్కృతిక కార్యక్రమాలకు హాజరయిన లక్షలాది ప్రజలు ఎవరో, ఏ ఆకాంక్షలతోని ఈ సభల్లో స్వచ్ఛందంగా పాల్గొన్నారో హనుమంతరావుగారికి తెలియదనుకోవాలా? ఇటీవలి కాలంలో ఏ తెలంగాణ ప్రజా సంఘం సభలైనా అపూర్వమైన ప్రజాస్పందనతో విజయవంతమైన సంగతి హనుమంతరావుగారి కంటికి ఆనకపోతే ఉద్యమానికి ప్రజల మద్దతు లేనట్లేనా? ఇవి సామాన్య ప్రజానీకంలో వచ్చిన కదలిక కాదా? మున్సిపల్, స్థానిక సంస్థల ఎన్నికల్లో తెరాస ఘోరంగా ఓడిపోయిన సంగతి వాస్తవమే. అయితే రాజీనామా అనంతరం 'సిద్ధిపేట శంఖారావం' సభకి లక్షలాదిగా అశేష ప్రజానీకం స్వచ్ఛందంగా కదలివచ్చిన సంగతి అబద్ధమా? మొన్నటికి మొన్న నవంబర్ 17న నామినేషన్ వేసిన అనంతరం టిఆర్ఎస్ నిర్వహించిన బహిరంగ సభకి లక్షలాది జనం కదిలివచ్చిన సంగతి అబద్ధమా? ఇవి హనుమంతరావుగారి దృష్టికి రాని విషయాలేమి కావు. కాని గుర్తించడం ఇష్టంలేక ఇదంతా రాజకీయ నాయకుల, మేధావుల హడావిడే తప్ప ఏమిలేదు అని ముద్ర వేసి ఆత్మతృప్తి పడితే ఉద్యమానికేం నష్టం లేదు కాని ఆయన వ్యక్తిత్వానికి దెబ్బ తగలడం ఖాయం.

ప్రజల మద్దతు లేదని ప్రకటించిన ఆయనే 'సెంటిమెంట్ బలంగా ఉందంటారు గాని, సెంటిమెంట్ ఆధారంగా ఏదో సాధించేస్తామని కలలుకనే మేధావులని ఏమనాలి' అని వెటకారం చేస్తారు. ఈ వెటకారాలు వెనుకనుంచి వస్తున్నవే. వాటి జోలికి పోకుండా–ప్రజల మద్దతు లేకపోవడం, సెంటిమెంట్ బలంగా ఉండడం రెండు ఒకే సమయంలో ఎట్లా సాధ్యమో హనుమంతరావు గారు ఆలోచించినట్లు లేదు. ప్రజల్లో తెలంగాణ సెంటిమెంట్ బలంగా ఉంది గనుకనే మున్సివల్, స్థానిక ఎన్నికల్లో టిఆర్ఎస్‌పై ఆగ్రహం వ్యక్తం చేసిన ప్రజలు సిద్ధిపేట శంఖారావానికి లక్షలాదిగా తరలివచ్చి ఆయన్ని మళ్లీ ఉద్యమ బాట పట్టినందుకు అభినందించారు. ప్రజలకు తెలంగాణ సెంటిమెంట్ ఉన్నదంటేనే ఉద్యమానికి వారి మద్దతు ఉందని అర్థం.

ఆయన వెటకారాలకి, కోస్తా మనోవికారానికి మరో ఉదాహరణ 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమ లక్ష్యం అభివృద్ధి కోసం కాదట. అంకెల్లో అభివృద్ధి చూపించి తెలంగాణను, ప్రజలను తప్పుదారి పట్టించే ప్రయత్నం జరుగుతోందట. తెలంగాణ కేవలం అభివృద్ధితో ముడిపడిన అంశం మాత్రమే కాదట. తెలంగాణ స్వయంపాలన, వనరులపై ఆధిపత్యాన్ని కోరుతున్నదట' ఇట్లాంటి 'అట'లతో కూడిన వ్యంగ వ్యాఖ్యలు వ్యాసం నిండా అనేకం.

మీరు ఆధిపత్యం చెలాయించడం ఇక వీలుకాదని అన్నందుకే ఇంత అక్కసు. ప్రజలకు, ప్రాంతాలకు ఉన్న స్వయంపాలనా హక్కుని హనుమంతరావు గారు గుర్తించడం లేదా? లేక తెలంగాణకు మాత్రమే ఈ హక్కుని నిరాకరిస్తున్నారా? హనుమంతరావు గారు చెబితే బాగుండు. అవును! 1996లో వర్తమాన తెలంగాణ ఉద్యమం తిరిగి ఊపందుకున్నప్పట్నించీ ఘంటాపథంగా చెబుతున్నది. తెలంగాణ స్వయంపాలన కోరుకుంటున్నది. కోస్తా వలసదోపిడీ నుంచి విముక్తిని కోరుకుంటున్నది. వనరుల వినియోగం, అభివృద్ధిపై స్వేచ్ఛని కోరుకుంటున్నది. తెలంగాణ తనకున్న ప్రత్యేక భాషా సాంస్కృతిక అస్తిత్వాన్ని పరిరక్షించుకోవాలనుకుంటున్నది. ఇవి మా ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలు. ఈ ప్రజాస్వామిక ఆకాంక్షని, ప్రజలకు, ప్రాంతాలకు ఉండే స్వయంపాలనా హక్కుని నిరాకరించే హక్కు ఎవరికీ లేదు. అభివృద్ధి స్వయం పాలనకు, ఆత్మగౌరవానికి ప్రత్యామ్నాయం కాదని ఇవ్వాళ తెలంగాణ ఉద్యమం నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నది. యాభై ఏళ్ల సమైక్య రాష్ట్రంలో అభివృద్ధి ఒక మేడిపండులాంటిదని తెలంగాణ అనుభవ పూర్వకంగా తెల్సుకున్నది గనుకనే ఇవ్వాళ విస్పష్టంగా స్వయంపాలనా లక్ష్యంతో ముందుకు కదులుతున్నది. నీటిపారుదల పథకాలు, రింగ్‌రోడ్, విశ్వవిద్యాలయాల ఏర్పాటు లాంటి పథకాలతో ఈ ప్రాంతాన్ని వెనుకబాటుతనం నుంచి బయటపడేయడానికి ప్రభుత్వం తంటాలు పడుతున్నదని హనుమంతరావుగారు నమ్మితే నమ్మనివ్వండి. కృష్ణా నీళ్లని రాయలసీమకు, గోదావరి నీళ్లని కోస్తాకు తరలించే జలయజ్ఞం, 610 జీవోని అమలు చెయ్యకుండా ఉద్యోగరంగాన్ని తమ గుప్పిట్లో ఉంచుకోవడం, హైదరాబాద్ భూముల్ని అగ్గువ సగ్గువకు తెలంగాణ పేదల్నుంచి సేకరించి కోస్తా సంపన్నులకు హర్రాజు చేయడాన్ని, రింగ్‌రోడ్ పేరుమీద తెలంగాణ పేద, దళిత రైతులని నిర్వాసితులు చేయడాన్ని అభివృద్ధిగా భావించడం తెలంగాణ ప్రజలకు సాధ్యం కాదు. రింగ్‌రోడ్‌ని అభివృద్ధి పథకంగా హనుమంతరావు గారు భావించడం మేధో సంక్షోభానికి పరిస్థితులు అనుకూలమవుతున్నాయేమో విజ్ఞులు విశ్లేషించాలి.

ర్యాలీలు, బహిరంగ సభలు, ధూంధాంలు ఉద్యమ రూపాలు కావని హనుమంతరావుగారి అభిప్రాయంగా అర్థమవుతున్నది. హింస, రాళ్లు రువ్వడం, కాల్పులు, మరణాలు, బస్సులు, ఆస్తుల దహనాలు, ఇవన్నీ జరిగితేనే ఉద్యమం అని ఆయన భావన కావచ్చు. అందుకనే శాంతియుత పద్ధతుల్లో లక్షలాది జనం కదలివచ్చినా అది ఉద్యమంగా కనిపించడంలేదు. ఉద్యమం ఎట్లుండాలో, ఏ రూపంలో కొనసాగాలో హనుమంతరావు గారి నుండి పాఠాలు నేర్చుకోవాల్సిన అగత్యం తెలంగాణకు లేదు. తెలంగాణ పోరాటాల పురిటిగడ్డ. అన్ని సామాజిక, రాజకీయ ఉద్యమాలకు ఊతమిచ్చిన నేల. ధిక్కరణ ఈ మట్టి స్వభావం. ఇవ్వాళ స్వయం పాలనకోసం ఉద్యమిస్తున్న తెలంగాణ తనకు అనుకూలమైన పోరాట రూపాలను ఎంచుకుంటుంది. తెలంగాణ విడిపోతే ఏమవుతుంది? భూమి బద్దలేమి కాదు. సరిహద్దులు స్పష్టంగానే ఉన్నాయి. ఆస్తులు పంచుకుంటారు. సమైక్య రాష్ట్రం చేసిన అప్పుల పాపాన్నీ భరిస్తుంది. హైదరాబాద్ నగరం తెలంగాణ రాష్ట్రానికి రాజధానిగా ఉంటుంది. నీళ్లు, నిధులు, నియామకాల మీద పూర్తి నియంత్రణ తెలంగాణ ప్రజలకు దక్కుతుంది. ఆంధ్ర పెట్టుబడులకు ఏ ఢోకా ఉండదు. సమస్యలేవీ లేనప్పటికీ ఇవన్నీ పెద్ద సమస్యలుగా ముందుకు తోసి హృదయభారాన్ని పెంచుకోవడం ఎందుకు? 'లోతుగా, నిర్దిష్టంగా ఆలోచిస్తుంటే ఏమో, ఏమిటో, ఎలాగో, ఎపుడో, ఏం జరుగుతుందో అని అన్పిస్తుంది' అంటూ ఇంత నిరాశ నిస్పృహల్లోకి జారిపోయే బదులు 'ఆంధ్ర'రాష్ట్ర అభివృద్ధికి తన మేధస్సుని వినియోగిస్తే ప్రజా మేధావిగా మిగిలేందుకు ఆయనకు ఇంకా అవకాశాలున్నాయి.

***– శ్రీధరరావు దేశ్‌పాండే***
హైదరాబాద్

# వీక్షణం 2006 సూచిక

పాఠశాలల రేషనలైజేషన్ – బాధ్య తప్పించుకునే ఎత్తుగడ
– జి. రాంమోహన్

యాభై యేండ్ల నిర్లక్ష్యం తెలంగాణ నీటి సమస్యలు
– ఆర్. విద్యాసాగర్‌రావు

కులం పై మరోసారి విలువైన చర్చ – మానేపల్లి

కొత్త సామాజిక శాస్త్ర పత్రిక 'సమాజ' – కె. సీతారామారావు, పి. నర్సింహారావు

ఒక దళారీ పశ్చాత్తాపం – పుస్తక పరిచయ సభ

కొత్త పుస్తకాలు; ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**మే 2006** **సంచిక 58**

గంగవరంలో చిందిన నెత్తురు – సంపాదకీయం

భా.జ.పా. సురక్షా యాత్రలు ఎవరికోసం? – వకుళాభరణం రామకృష్ణ

ఎజెండా మీదకు వచ్చిన తాగునీరు ప్రయివేటీకరణ
– వి. హనుమంతరావు

పేటెంట్ భ్రమలు కల్పిస్తున్న చేనేత ఉత్పత్తి రిజర్వేషన్ చట్టం : 1985
– పులుగుజ్జు సురేష్

చేనేతకు చేయుత ఓ నత్తనడక – కె. శాంతారావు

తెలంగాణ ప్రాంతీయసంఘం పునరుద్ధరణ ఇవాళ్టి అవసరం
– ఎస్. శ్రీధరస్వామి

పరిష్కారం లేని పెట్టుబడిదారి సంక్షోభం – డి. పాపారావు.

రంగారెడ్డి జిల్లా – వెలుగుల వెనుక చీకట్లు – పి. శ్రీనివాసులు నాయుడు

సాగునీటి కొరత – తగ్గిన పంటల విస్తీర్ణం – ఎస్.కె. జాఫర్ అలీ

మతం వంశపారంపర్యమా? – ఎన్. ఇన్నయ్య

ఉక్కిబిక్కిరి అవుతున్న రష్యా ఆర్థికవ్యవస్థ – అనిల్

వెలుగులేమీ లేని కాపిటల్ కన్వర్టబిలిటీ – డి. నరసింహారెడ్డి

వాట్ – కొత్త ఆలోచనలు కావాలి! – టి.వి. అధికారి

ఐదు దశాబ్దాల క్రీడా వికాసం – జి.ఎస్. రాంమోహన్

భూ సంస్కరణలు – కొన్ని ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు
– కె. సీతారామారావు

కొత్త రాజకీయ పదజాలం – ప్రొ. వాసిరెడ్డి భాస్కరరావు

ప్రపంచ బ్యాంక్ – ఎడిబి – రహస్య కవలలు – కొణతం దిలీప్

ఒక దళారీ పశ్చాత్తాపం – సభలు, విశేషాలు

ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**జూన్ 2006** **సంచిక 59**

రెండేళ్లలో సాధించినదేమిటి? – సంపాదకీయం

కొత్త పుస్తకాలు

సమస్యల ప్రస్తావనా దిశగానే 2006 శాసనసభ ఎన్నికలు
– విద్యాభూషణ్

ఒబిసి రిజర్వేషన్లు – సంఘటిత పోరాట అవసరం
– కె. సత్యనారాయణ

సూక్ష్మ రుణ భారతం – కొణతం దిలీప్

ఇదీ మన గ్రామీణ భారత ముఖచిత్రం – వి. హనుమంతరావు

ఎడిబి ఎవరి అభివృద్ధి బ్యాంకు? – ఎస్. వీరయ్య

ప్రపంచీకరణ : మన వ్యవసాయరంగం– ఒక పరిశీలన
– కూరపాటి వెంకటనారాయణ, కె. వీరాస్వామి

ఏ చిట్కా వైద్యంలో ఏముందో? – ఎన్. ఇన్నయ్య

మేధావులపై గ్రామ్‌షీ అభిప్రాయాలు – వజ్రాల అంజిరెడ్డి

ఐదు దశాబ్దాల క్రీడా వికాసం – జి. ఎస్. రాంమోహన్

మతం – మార్క్సిస్టు దృక్పథం – బి. సైదులు

సంచలనాల శతాబ్దంతో ముడివేసుకున్న గాల్‌బ్రెత్
– డి. పాపారావు

మార్క్సిస్టు మనోవికాసం – నేటి అవసరం – ఇతిహాస్

ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**జూలై 2006** **సంచిక 60**

ఇవి స్థానిక ఎన్నికలేనా? – సంపాదకీయం

కొత్త పుస్తకాలు

ప్రజాకంటక విధానాల ఫలితమే పెట్రోధరల పెంపు
– విద్యాభూషణ్

బెంగాల్ ఎన్నికల్లో మార్క్సిస్టు పార్టీ విజయమూలాలు
– సుధాకర్ ఎస్.

ఎస్సీలకు కోట్లాది నిధుల ఎగనామం – వి. హనుమంతరావు

చారిత్రక దృక్పథంలో విధానశక్తి స్థానం – వాసిరెడ్డి భాస్కరరావు

భారత ప్రజాస్వామ్యం – పెరుగుతున్న వ్యక్తి పూజ
– ఎనిశెట్టి శంకర్

సాంస్కృతిక విప్లవం ఆవశ్యకత – కొల్లి సత్యనారాయణ

నైజాం రాజ్యంలో ప్రజా ఉద్యమంపై ప్రభుత్వ దాడి
– దేవులపల్లి వెంకటేశ్వరరావు

తెలంగాణ సాయుధ పోరాటం – భూమి సమస్య
– రాజ్ బహద్దూర్ గౌర్

అమరజీవి కొమరయ్య! అందుకో జోహార్లు – కందిమళ్ల ప్రతాపరెడ్డి

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం–ఇవాళ్టి ప్రశ్నలు
– ఎన్. వేణుగోపాల్

విమోచనోద్యమ యోధులకు దక్కుతున్న గౌరవం!
– కొణతం దిలీప్

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట పరిశోధన ఒక అసంపూర్ణ సూచి

దక్షిణ కెరటాలు

చేనేత పునాదులపై పెరిగిన పవర్‌లూమ్ రంగం – పులుగుజ్జు సురేష్

ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**ఆగస్ట్ 2006** **సంచిక 61**

ప్రభుత్వోద్యోగుల పరిమితులు – సంపాదకీయం

కొత్త పుస్తకాలు

గ్రామీణ స్థానిక సంస్థల ఎన్నికలు – జయాపజయాలు
– ఎన్. వేణుగోపాల్

స్థానిక ఎన్నికలు – ప్రజాస్వామ్య ప్రహసనం – దుర్గం రవీందర్

కమ్యూనిస్టుల పొత్తుల్లో అపశ్రుతులు – బి. సైదులు

గ్రామీణ ప్రాంతాలలో పట్టణ సౌకర్యాల కల్పన : 'పుర' పథకం
– తోట సత్యనారాయణ

రైతుల ముసాయిదా జాతీయ విధానం, డా. స్వామినాథన్ సిఫార్సుల అమలుతోనే అభివృద్ధి సాధ్యం – డా. ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు

సామ్రాజ్యవాద నయా–ఉదారవాద విధానాలే వ్యవసాయ సంక్షోభానికి మూలకారణం – వై.వి. కృష్ణారావు

రైతుల ముసాయిదా జాతీయ విధానం ఎవర్నీ ఉద్ధరించడానికి ?
– ప్రొ. కె.ఆర్. చౌదరి

రైతుల ప్రయోజనాలకిచ్చిన ప్రాధాన్యత ఎంత?
– అరిబండి ప్రసాదరావు

స్వామినాథన్ కమీషన్ నివేదిక ఉగాది పచ్చడి – వి. హనుమంతరావు

రెండేళ్ల పాలనలో రైతుకు దక్కింది ఆత్మహత్యలే– ఆత్రం రామారావు

ఐదు దశాబ్దాల క్రీడా వికాసం – జి.ఎన్. రాంమోహన్

సంస్మరణ : బెతల్‌హోం

సల్వాజుడుం – ఈ అంతర్యుద్ధం ఫలితం ఏమిటి?
– ఇతిహాస్

అసహజ మరణాల సూచి; ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**సెప్టెంబర్ 2006** **సంచిక 62**

మళ్లీ చౌరస్తాలో తెలంగాణ – సంపాదకీయం
కొత్త పుస్తకాలు
లోక్‌సత్తా రాజకీయ పార్టీలో కొత్తదనం ఉందా?
– ఎన్. వేణుగోపాల్
ప్రత్యామ్నాయ ఉద్యమానికి కదులుతున్న తెలంగాణ
– నాగోబా
జి.వో. నెం. 5 రద్దుతో సమస్య తీరినట్లేనా? – పి. నిర్మల్
సంస్కరణల ప్రభావమే పెరుగుతున్న ధరలు! – విద్యాభూషణ్
నిత్యావసర వస్తువుల ధరలు ఎందుకు పెరుగుతున్నాయి?
– వి. చలపతిరావు
బహుళ దోపిడీపై ప్రజాగ్రహం – ఇతిహాస్
మారుతున్న కోర్టు తీర్పులు – పర్యవసానాలు–పరిష్కారాలు
– ఎస్. వీరయ్య
సుప్రీంకోర్టులోనే చుక్కెదురయితే కార్మికులకు న్యాయం ఎవరిస్తారు?
– మాడభూషి శ్రీధర్
ఇటీవలి తీర్పులు రాజ్యాంగానికి అనుకూలమైనా? – సాక్షి
న్యాయస్థానాల తీర్పులు – విద్యారంగం – ఎం. శ్రీనివాస్
ఒకేపార్టీ – రెండు విధానాలు
అమెరికా బంటుకు అనుకోని ఓటమి – జి.ఎస్. రామ్మోహన్
విప్లవమంటే....? (భగత్‌సింగ్ శతజయంతి ప్రారంభం)
– కోర్టులో భగత్‌సింగ్ వాంగ్మూలం
'పుర' పథకం – తోట సత్యనారాయణ
వ్యవసాయ సంక్షోభానికి మూలకారణం – వై.వి. కృష్ణారావు
అసహజ మరణాల సూచి; ఆంధ్రప్రదేశ్ : నాడు – నేడు

**అక్టోబర్ 2006** **సంచిక 63**

యాభై ఏళ్లు నిండిన ఆంధ్రప్రదేశ్ భవిత్యం? – సంపాదకీయం
కొత్త పుస్తకాలు
కడప యురేనియం–వెంటాడుతున్న విధ్వంసక అభివృద్ధి
– డా. కె. సత్యలక్ష్మి, కె. సజయ
పోరుబాట పట్టిన తెలంగాణ – నాగోబా
'వందేమాతరం' వివాదం–ఒక పరిశీలన – పి. సాగర్
సింగరేణిలో సాంస్కృతిక అణచివేత – పిట్టల రవీందర్
అభివృద్ధి–భిన్న దృక్పథాలు – డా. ముదునూరి భారతి
నేరాన్ని ద్వేషించు–నేరస్తుణ్ని కాదు – విద్యాభూషణ్
ప్రాంతీయ అసమానతలు–కొన్ని సైద్ధాంతిక సమస్యలు
– ఎన్. వేణుగోపాల్
వెనుకబాటుతనం ప్రజల పాపం కానేకాదు – దుప్పల రవికుమార్
అభివృద్ధికి నోచుకోని పౌరుషాల పలనాడు – సి.ఎచ్.ఎల్.ఎన్. మూర్తి
చారిత్రకంగా, రాజకీయంగా మోసపోతున్న రాయలసీమ
– ప్రొ.ఎస్. శేషయ్య
తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వం–అన్యాయాల చరిత్ర
– రాజవరం పార్థసారథి
సమైక్య ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ వ్యత్యాసాలు– జె. శివరామ్
అభివృద్ధికి భౌగోళిక అవకాశాలు – టి. వివేక్
శతజయంతి – ఎవరీ భగత్‌సింగ్, ఏమిటితని గొప్ప?
దక్షిణకెరటాలు : బుష్ మాట్లాడిన చోట తుపాకి మందు వాసన
– ఇతిహాస్
సంస్మరణ : తొలి తెలుగు మార్క్సిస్టు మేధావి డా. కె.బి. కృష్ణ
అసహజ మరణాల సూచి; ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు

**నవంబర్ 2006** **సంచిక 64**

అఫ్జల్ మరణశిక్ష – రాజకీయ మొరటుదనం – సంపాదకీయం
కొత్త పుస్తకాలు
యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ – విజయాలు వైఫల్యాలు
– వై.ఎస్. రాజశేఖర రెడ్డి, ఎన్. చంద్రబాబునాయుడు, ఎన్. ఇంద్రసేనారెడ్డి, కె. చంద్రశేఖర రావు, సురవరం సుధాకర రెడ్డి, బి.వి. రాఘవులు, పొత్తూరి వెంకటేశ్వరరావు, కె. రామచంద్రమూర్తి, కె. శ్రీనివాస రెడ్డి, ముళ్లపూడి సదాశివశర్మ, జాహిద్ అలీ ఖాన్, కె.జి. కన్నబిరాన్, బొజ్జాతారకం, వకుళాభరణం రామకృష్ణ, జి. హరగోపాల్, ఆర్.ఎస్. రావు, డా. కె.ఆర్. చౌదరి, ముదిగంటి సుజాతారెడ్డి, ఓల్గా, వరవరరావు, ఎ.బి.కె. ప్రసాద్, వి. హనుమంతరావు
తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే ... – దుర్గం రవీందర్
ఉన్నత విద్యార్జన దళితుల జన్మ హక్కు కాదా?
– నాగం కుమారస్వామి
కొత్త విశ్వసనీయతా యత్నం లోక్‌సత్తా – జి.ఎస్. రామ్మోహన్
పాలకవర్గాలకు పట్టని హైదరాబాద్ సుస్థిర పట్టణాభివృద్ధి
– ఎం. వేదకుమార్
ఔటర్ రింగ్ రోడ్డు – ఒక మానవ విధ్వంస రచన – ఎస్. జీవన్ కుమార్
పెరుగుతున్న హైదరాబాద్ మహానగరం – డా. సి. రామచంద్రయ్య
చిల్లం నుంచి సైబరాబాద్ దాకా – ఎన్. వేణుగోపాల్
భీంగల్ డిపో సాధించుకున్న మహిళా లోకం
– తుర్లపాటి లక్ష్మి, ఎనిశెట్టి శంకర్
ప్రజలు పాల్గొనని ప్రత్యేక తెలంగాణ ఉద్యమం – వి. హనుమంతరావు
పుస్తక పరిచయం : పద్నాలుగు కుట్ర కథలు – కొణతం దిలీప్
సంస్మరణ : బొమ్మారెడ్డి, హీరాలాల్ మోరియా, కె.ఎన్. చారి
శతజయంతి – సుఖదేవ్ కు భగత్‌సింగ్ ఉత్తరం
అసహజ మరణాల సూచి; ఆంధ్రప్రదేశ్ : నాడు–నేడు 

**వచ్చే సంచికలో...**

- ★ **ఫోకస్ - ప్రసార, ప్రచార మాధ్యమాలు - విశ్వసనీయత**
- ★ **ప్రత్యేక తెలంగాణ లక్ష్యసాధన దిశలో... - జి. ప్రభాకర్**
- ★ **మిల్టన్ ఫ్రీడ్‌మన్ - డి. పాపారావు**
- ★ **అమిత్ భాదురి పుస్తకం 'గౌరవనీయ అభివృద్ధి' - ఆర్.ఎస్. రావు**
- ★ **లోక్‌సత్తా అభిప్రాయాలు - ఎ. రామకృష్ణ**
- ★ **ప్రగతి పథంలో పేదరికం - విద్యాభూషణ్**

# అసహజ మరణాల సూచి

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంబైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చుయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు/కారణాలు తెలియని | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 26-10-2006 నుండి 1-11-2006 | 4 | – | 25 | – | – | – | 9 | – | – | 14 | 11 | 20 | – | – | – | – | 26 |
| 2-11-2006 నుండి 8-11-2006 | 12 | 2 | 15 | – | – | – | 6 | 9 | 8 | 24 | 9 | 15 | – | – | – | 6 | – |
| 9-11-2006 నుండి 15-11-2006 | 22 | 2 | 14 | – | – | – | 7 | 3 | 5 | 28 | 15 | 18 | 11 | – | – | – | – |
| 16-11-2006 నుండి 24-11-2006 | 37 | 1 | 24 | 11 | – | – | 6 | 6 | 2 | 18 | 26 | 26 | 1 | – | – | 10 | – |
| మహబూబ్‌నగర్ జిల్లా | 16 | | 15 | – | – | – | 4 | 8 | 12 | 31 | 9 | 10 | – | – | – | 1 | – |
| మొత్తం | **91** | **5** | **93** | **11** | **-** | **-** | **32** | **26** | **27** | **115** | **70** | **89*** | **12** | **-** | **-** | **17** | **26** |

గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.

*డెంగీ మరణాలు 71

## తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త ప్రయోగం
## సిడిఆర్‌సి - వీక్షణం స్వల్పకాలిక ఉపకార వేతనాలు

తెలుగు సమాజం తన గురించి తాను చేసుకునే అన్వేషణకు మార్గాలు కల్పించడానికీ, ఆ అన్వేషణను వ్యక్తీకరించడానికీ ఏర్పడిన సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి), రాజకీయార్థిక సామాజిక మాసపత్రిక వీక్షణం తెలుగునాట సామాజిక పరిశోధనా రంగంలో కొత్త వెలుగులు ప్రసరింపజేయడానికి ఒక కొత్త ప్రయోగానికి పూనుకుంటున్నాయి. తెలుగు సమాజంలో వివరమైన, లోతయిన పరిశోధన అవసరమయిన అనేక సమస్యలపై తగిన సమయం తీసుకుని పరిశోధన జరపడం కొరకు స్వల్పకాలిక ఉపకార వేతనాలను ప్రకటిస్తున్నాయి.

అనంతపురం కరువు, మహబూబ్‌నగర్ వలసలు, నల్లగొండ ఫ్లోరైడ్, నల్లమల చెంచుల దుర్భర జీవనం, కడప యురేనియం, సిరిసిల్ల చేనేత కార్మికుల ఆత్మహత్యలు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ వల్ల మూతబడిన పరిశ్రమల కార్మికుల వెతలు, రైతుల ఆత్మహత్యలు, బాక్సైట్ తవ్వకాలు, వన్ ఆఫ్ సెవెంటీ చట్టం, హైదరాబాద్ పరిసర భూములు, కొల్లేరు ఆక్రమణలు, పోలవరం.... ఆంధ్రప్రదేశ్‌లో వివరంగా అధ్యయనం చేయవలసిన సామాజిక, రాజకీయార్థిక అంశాలకు కొదవలేదు. ఇవి కాక మరెన్నో సామాజిక అంశాలు కూడ ఉండవచ్చు. కాని ఈ అంశాలలో చాలా వాటిపైన అడపాదడపా పత్రికా వ్యాసాలు, వార్తలు తప్ప వివరమైన, సమస్యను అన్ని కోణాల నుంచి చర్చించే పూర్తి స్థాయి అధ్యయనాలు లేవు.

**ఈ స్వల్ప కాలిక ఉపకార వేతనం...**

★ పరిశోధనా విద్యార్థికి నెలరోజుల వ్యవధి ఇస్తుంది.

★ ఖర్చులతో కలిపి రు. 10,000 ఉపకార వేతనం ఇస్తుంది. (ఇందులో రు. 4,000 ఖర్చులకు సరిపోవచ్చునని, రు. 6,000 పారితోషికం అని అంచనా)

★ పరిశోధనా విద్యార్థి వ్యవధి ముగియగానే వీక్షణంకు ఒక వ్యాసం/నివేదిక రాయవలసి ఉంటుంది.

★ మరొక నెల రోజుల వ్యవధిలో అదే అంశం మీద వివరంగా దాదాపు 80-100 పేజీల అధ్యయన నివేదికను సమర్పించవలసి ఉంటుంది.

★ ఆ పుస్తకానికి గణాంకాల పట్టికలు, వివరణలు చేర్చి, ప్రచురించి, విస్తృతంగా ప్రచారం కల్పించే బాధ్యతను వీక్షణం పబ్లికేషన్స్ తీసుకుంటుంది.

**సామాజిక శాస్త్ర విద్యార్థులకు, పాత్రికేయులకు, పరిశోధకులకు, ఆలోచనాపరులకు అపూర్వమైన అవకాశం.**

వెంటనే మీ దరఖాస్తులు పంపండి. మీ రచనా, పరిశోధనా అనుభవం, మీరు ఎంచుకునే సామాజిక అధ్యయనాంశం, ఆ అంశాన్ని అధ్యయనం చేయడానికి మీకున్న అర్హతలు, అవకాశాలు తెలియజేయండి.


ఎడిటర్, **వీక్షణం**

సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్,

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫోన్/ఫ్యాక్స్ : 040-66843495

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27-11-06

PRINTED BOOK
Postal Regn. No. LII/RNP/H-HD 1029/2004-06



Owned, Printed and Published by V. Hanumantha Rao at 301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayat Nagar, Hyderabad - 500 029. Ph : 66843495. Printed at Charita Impressions, Azamabad, Hyderabad. For Nutan Art Printers, Hyderabad. Working Editor : N. Venugopal

VEEKSHANAM
301, Mythri Residency, 3-6-394, Road No. 3, Himayatnagar, Hyd-29.